మానవుడి భక్తికి, మాంత్రికుడి శక్తికి మధ్య జరిగే యుద్ధం




# మాయ

జూలై 9 నుండి

సోమ - శుక్ర, రా॥ 8 గం॥లకు

మీ జెమిని టివి లో

/GeminiTV /GeminiTV

ఇప్పుడే సన్ నెక్స్ట్ యాప్ ను డౌన్లోడ్ చేసుకొని
ఈ కార్యక్రమాన్ని వీక్షించండి ఎప్పుడైనా ఎక్కడైనా

SUN NXT
DOWNLOAD NOW



THE LARGEST CIRCULATED TELUGU WEEKLY

# స్వాతి

సపరివార పత్రిక

FOUNDER PROPRIETOR EDITOR : VEMURI BALARAM

ESTABLISHED 1984 | సంపుటి 35 | 13.7.2018 | సంచిక 2

అనిల్ బిల్డింగ్స్ సూర్యారావుపేట పోస్ట్ బాక్స్ 339 విజయవాడ 520 002


Deep love alone causes deep hurt. If it hurts, there is love



పాఠక దేవుళ్ళకు నమస్కారం

ఎడిటర్

వేమూరి బలరామ్



సీరియల్స్



కథలు



శీర్షికలు



స్పెషల్ ఫీచర్స్



## వారిది మీ దారే!

ఒక పూలమొక్క బాగా పెరగాలంటే, పక్కనే కూర్చుని దాన్ని పట్టిపట్టి చూస్తారా? చూడరు.

దానికి కావలసిన ఎరువు వేసి, తగినంత నీరు చేరేలా మాత్రం జాగ్రత్తపడతారు. ఆ చెట్టు తనంతట తానే పూస్తుంది. పిల్లలు కూడా అంతే. వారిని జాగ్రత్తగా పెంచి పోషించండి. మీ ఆలోచనల్ని వాళ్ళమీద రుద్దకండి.

ఒక పెద్ద పారిశ్రామికవేత్త కొడుకు బిజినెస్‌లో ఆసక్తి చూపకుండా, గిటార్ వాయించుకుంటూ సంగీతంమీద ఆసక్తి చూపిస్తే ఆ తండ్రి తట్టుకోలేడు. ఒక సంగీత దర్శకుడి కొడుకు సంగీతాభిరుచి లేకుండా ఆటోమొబైల్ షాప్‌లో స్క్రూలు బిగిస్తే అతడు తట్టుకోలేడు. ఎందుకని?

తన మరణానంతరం కూడా తన జ్ఞాపకంగా ప్రపంచంలో ఏదైనా ఉండితీరాలనే అత్యాశ వారిది. అందువల్లే పిల్లల్ని తమలాగే తయారుచేయాలని, తమ గుర్తుగా మిగిల్చిపోవాలనుకుంటారు.

మీ తర్వాత మీ పిల్లలు కూడా అదే పిచ్చిపనే చేయాలని ఎందుకు కోరుకుంటున్నారు.

మీ పిల్లలు మీరు చేయలేని సాహసాలను చేయవద్దా! అలా కొత్తతరాలు కొత్తదారులు తొక్కితేనే కదా ప్రపంచం ముందుకు సాగుతుంది.

అభిమానం, జాగ్రత్త వహించడం ఈ రెండే మీరు మీ పిల్లలకివ్వగలిగే అధికారం కాదు. మీ పిల్లలకు కోపం, అహంకారం లేని ఆనందమయ జీవితాన్నివ్వండి. సందేహించవద్దు. మీకన్నా మీ పిల్లలు చాలా బాగుంటారు. అలా పెరిగే పిల్లలు ఎప్పుడూ తప్పుదారిలో అడుగిడరు. సందర్భవశాత్తూ అలా దారి మళ్ళినా, త్వరలోనే తమ తప్పును తెలుసుకుని మీ దారిలోకి వస్తారు.

-సద్గురు సుభాషితాలు


చందాను www.swatipublications.com వెబ్‌సైట్ ద్వారా చెల్లించవచ్చు
E-mail: advtswati@gmail.com swativja@eth.net

విడిప్రతి ₹20 12 నెలలకు ₹1076
విదేశాలకు సంవత్సర చందా (ఎయిర్ మెయిల్) ₹6666 (100 డాలర్లు)

Editor : VEMURI BALARAM Swati Publications Anil Buildings Suryaraopet Vijayawada 520 002 Printed and Published by the owner VEMURI BALARAM
Printed at Anil Swati Press Autonagar Vijayawada Cover at Kala Jyothi Process Pvt.Ltd., Hyderabad
Tel.: (0866) 243 1862 243 4017 Advt. 243 1233 Mktg. 243 3938 Fax: 0866-243 0433

# అత్యధిక సర్క్యులేషన్‌గల ఏకైక తెలుగు వారపత్రిక

'స్వాతి' 'మాస'-'వార' పత్రికలకు శుభాభినందనలు. నిత్యనూతనంగా, జనరంజకంగా, నవనవోన్మేషంగా అశేషపాఠకలోకానికి 'స్వాతి'ని అందజేస్తున్న- కూర్పరి, నేర్పరి- 'వేమూరి వారి' బలరామ్‌గారు.

అటు పెద్దకారుకి, ఇటు కుర్రకారుకి సకల మానవ శరీర అంగాలను, సమస్త మస్తిష్కాలను సంతృప్తిపరిచే 'శీర్షిక'లు 'స్వాతి'లోనే కనువిందు. భలే పసందు. ఇలానే కలకాలం ఉండాలని ఆశిస్తూ-

వేమూరి విశ్వేశ్వరరావు ఘంటశాల

తెలుగువారి అభిమానం చోటు చేసుకుంది స్వాతి. అమూల్యమైన శీర్షికలతో పాఠకులను కబంధహస్తాలతో కట్టిపారేసింది...

శుభోదయం భక్తుడికి సూర్యకిరణాలు... గురువారం ఉదయం పాఠకుడికి స్వాతి కిరణాలు...అమోఘం...




29.6.2018



అద్భుతం... ఆహ్లాదం స్వాతినుంచి వెలువడే ఆశాకాంతులు... అక్షరసిరులు మదిలో నింపుకోవాలనేదే మా తాపత్రయం. స్వాతిని చదవకుండా ఉండలేమన్నది అక్షరసత్యం.

పువ్వాడ హనుమాన్‌ప్రసాద్ మల్కాజ్‌గిరి

ప్రేమతత్వాన్ని ఉదహరిస్తూ... 'ప్రేమను నింపుకో' అనే అంశం మన దృష్టి ఎలా ఉంటే ఈ సృష్టి అలా కనిపిస్తుందనీ, ప్రేమ పెంచుకుంటూపోతే అవతలివాళ్ళు ద్వేషించినా, ప్రేమలో కలిసిపోతుందని తెలిసింది.

'ధర్మం ఉన్నచోట విజయం తథ్యం' అంటున్న 'సత్యాన్వేషణ' శీర్షిక నిత్యసత్యాన్ని అక్షరీకరించింది.

ఎస్.ఎస్.చంద్రబోస్ విశాఖపట్నం

తల్లిదండ్రులు పిల్లలు పడుకునే ముందు కథలు చదివి వారికి వినిపిస్తే దీనివల్ల వారిలో అవగాహనసామర్థ్యం పెరుగుతుంది అని 'స్టోరీ బుక్స్ పవర్' స్పెషల్ ఫీచర్‌లో వివరించారు.

'మనిషిలో మనిషి', 'హృదయం ఎక్కడున్నదీ...', 'సామ్రాట్ సముద్రగుప్త', 'వేట' సీరియల్స్ ఆసక్తికరంగా చదివిస్తున్నాయి.

జి.వి.మురళీమోహనరావు కోటరామచంద్రపురం

'హృదయంలో ప్రేమను, మనసులో శాంతిని, జ్ఞానాన్ని నింపుకుని ఎక్కడికెళ్ళినా అందరికీ అందించాలని 'ప్రేమను నింపుకో' సంపాదకీయంలో వివరణ బాగుంది.

పండ్లరసాలవల్ల ఎలాంటి ప్రయోజనాలు పొందవచ్చో 'రసానుభూతి' వ్యాసంలో తెలిపారు.

'ద్విగుణం' కథ బాగుంది.

పి.నరసయ్య హైదరాబాద్

వచ్చేవారం స్పెషల్

**సరికొత్త వ్యసనం**

# ఇది మంచి సమయం



**5.7.2018 నుండి 11.7.2018 వరకు శ్రీ విలంబి నామ సంవత్సరం, దక్షిణాయనం, గ్రీష్మ ఋతువు, నిజజ్యేష్ఠ మాసం, కృష్ణపక్షం.**

**5.7.2018 గురువారం**

తిథి: సప్తమి రా. 1.07 వరకు
నక్షత్రం: ఉత్తరాభాద్ర పూర్తి
వర్జ్యం: ప. 3.36-5.18 వరకు
దుర్ముహూర్తం : ప. 9.57-10.49 వరకు. మ. 3.10-4.02 వరకు
రాహుకాలం:మ. 1.45-3.22 వరకు
మంచి సమయం : ప. 11.00 నుండి 12.05 వరకు
సూర్యోదయం: 5.36కి
సూర్యాస్తమయం: 6.39కి

**6.7.2018 శుక్రవారం**

తిథి: అష్టమి రా. 1.23 వరకు
నక్షత్రం: ఉత్తరాభాద్ర ఉ.6.54 వరకు
వర్జ్యం: రా. 7.17-8.56 వరకు
దుర్ముహూర్తం:ప.8.13 నుండి 9.05 వరకు. మ. 12.33-1.25 వరకు
రాహుకాలం: ప.10.30-12.08 వరకు
మంచి సమయం: లేదు
సూర్యోదయం: 5.37కి
సూర్యాస్తమయం: 6.39కి

**7.7.2018 శనివారం**

తిథి: నవమి రా. 12.50 వరకు
నక్షత్రం:రేవతి ఉ. 7.40 వరకు
వర్జ్యం: రా. 3.39-5.15 వరకు
దుర్ముహూర్తం : ఉ. 5.37-7.20 వరకు
రాహుకాలం: ప. 8.53-10.30 వరకు
మంచి సమయం: ప.8.30-10.35 వరకు
సూర్యోదయం: 5.37కి
సూర్యాస్తమయం: 6.39కి

**8.7.2018 ఆదివారం**

తిథి: దశమి రా. 11.31 వరకు
నక్షత్రం:అశ్విని ఉ. 7.38 వరకు
వర్జ్యం: సా. 4.55-6.28 వరకు
దుర్ముహూర్తం: సా. 4.53 నుండి 5.45 వరకు
రాహుకాలం: సా. 5.00-6.38 వరకు
మంచి సమయం: మ.1.50-2.45 వరకు
సూర్యోదయం: 5.37కి
సూర్యాస్తమయం: 6.39కి

**9.7.2018 సోమవారం**

తిథి: ఏకాదశి రా. 9.27 వరకు
నక్షత్రం: భరణి ఉ. 6.50 వరకు.కృత్తిక తె. 5.21 వరకు
వర్జ్యం: సా. 6.05-7.35 వరకు
దుర్ముహూర్తం : మ. 12.32 నుండి 1.24 వరకు.మ. 3.09-4.01 వరకు
రాహుకాలం: ఉ. 7.11-8.52 వరకు
మంచి సమయం: లేదు
సూర్యోదయం: 5.37కి
సూర్యాస్తమయం: 6.39కి

**10.7.2018 మంగళవారం**

తిథి: ద్వాదశి సా. 6.46 వరకు
నక్షత్రం: రోహిణి రా. 3.15 వరకు
వర్జ్యం : సా. 7.57-9.25 వరకు
దుర్ముహూర్తం:ప.8.12-9.04 వరకు రా. 11.02-11.52 వరకు
రాహుకాలం: మ. 3.22-4.59 వరకు
మంచి సమయం: లేదు
సూర్యోదయం: 5.37కి
సూర్యాస్తమయం: 6.39కి

**11.7.2018 బుధవారం**

తిథి : త్రయోదశి మ. 3.34 వరకు
నక్షత్రం:మృగశిర రా.12.43 వరకు
వర్జ్యం: ప. 8.06-9.42 వరకు
దుర్ముహూర్తం : ప. 11.40 నుండి 12.33 వరకు
రాహుకాలం: మ.12.07-1.45 వరకు
మంచి సమయం: మ.12.50-2.30 వరకు
సూర్యోదయం: 5.38కి
సూర్యాస్తమయం: 6.39కి

* మన సంప్రదాయం ముఖ్యం.




## లలితా జ్యువెల్లరి పరిచయం చేస్తోంది..
## స్మార్ట్ బుకింగ్ పథకం!

### మొత్తం నగదును ఒకసారి చెల్లించి,
### తర్వాత.. తరుగు లేకుండా నగలు కొనుగోలు చేసుకోండి.

5 నెలల నుంచే ఫలితం!
11 నెలల తర్వాత నగను కొనేటప్పుడు,
14% లేదా 16% వరకు తరుగున్న నగ అయినప్పటికీ..
1% తరుగు కూడా చెల్లించనక్కర్లేదు.

## ఇది ఒక కలల పథకం!

నగదు ఆదా అవడంతోపాటు, చెల్లించే నగదుకు ఏమాత్రం తరుగు లేకుండా పూర్తిస్థాయి బంగారం లభిస్తుంది.

కస్టమర్ GST చెల్లించాల్సి ఉంటుంది.

**5 నుంచి 11 నెలలలోపు ఎప్పుడైనా ఈ పథకాన్ని ముగించుకుని లబ్ధి పొందొచ్చు!**

| 5 నెలల ఆఖరులో | 5% వరకు తరుగు ఉన్న అన్ని నగలను, తరుగు చెల్లించకుండా కొని లబ్ధి పొందొచ్చు. |
|---|---|
| 6 నెలల ఆఖరులో | 6% వరకు తరుగు ఉన్న అన్ని నగలను, తరుగు చెల్లించకుండా కొని లబ్ధి పొందొచ్చు. |
| 7 నెలల ఆఖరులో | 7% వరకు తరుగు ఉన్న అన్ని నగలను, తరుగు చెల్లించకుండా కొని లబ్ధి పొందొచ్చు. |
| 8 నెలల ఆఖరులో | 8% వరకు తరుగు ఉన్న అన్ని నగలను, తరుగు చెల్లించకుండా కొని లబ్ధి పొందొచ్చు. |
| 9 నెలల ఆఖరులో | 9% వరకు తరుగు ఉన్న అన్ని నగలను, తరుగు చెల్లించకుండా కొని లబ్ధి పొందొచ్చు. |
| 10 నెలల ఆఖరులో | 10% వరకు తరుగు ఉన్న అన్ని నగలను, తరుగు చెల్లించకుండా కొని లబ్ధి పొందొచ్చు. |
| 11 నెలల ఆఖరులో | అన్ని రకాల నగలను, ఆ రోజుకు ఎంత తరుగు ఉన్నా కానీ, తరుగు ఏమాత్రం చెల్లించకుండా కొని లబ్ధి పొందొచ్చు. |
| 11 నెలల ఆఖరులో | వజ్రాభరణాలకు ప్రత్యేక వెసులుబాటు: క్యారెట్‌కు రూ.1000 తగ్గింపు, V.A. లో 50% తగ్గింపు. |

- మీరు చెల్లించే నగదును మీ అభిప్రాయం మేరకు నగదు రూపంగానూ లేదా బంగారం రూపంగానూ ఆదా చేసుకోవచ్చు.
- మీ పాత నగలను ఇచ్చి కూడా ఈ పథకంలో చేరొచ్చు.

## లలితా జ్యువెల్లరి మార్ట్ ప్రై. లిమిటెడ్

హైదరాబాద్ : 6-3-883, SBR సౌక్, రాజీవ్‌గాంధీ విగ్రహం ఎదురుగా, సోమాజిగూడ సర్కిల్. ఫోన్: 040 - 6748 6677.

వైజాగ్ : 29-1-75/1, ఆర్‌టీసీ బస్టాండ్, ద్వారకా నగర్. ఫోన్: 0891-6600001.

తిరుపతి : 481/482, రెడ్డి అండ్ రెడ్డి కాలనీ, మాస్కో రోడ్డు. (V.V. మహల్ రోడ్డు). ఫోన్: 0877-666 0505 / 0606 / 7888.

చెన్నై • మదురై • తిరుచ్చి • పుదుచ్చేరి • కుంభకోణం • రామనాథపురం • కోయంబత్తూరు • సేలం • నాగర్‌కోయిల్ • ఈరోడ్ • తిరువళ్లూరు • బెంగళూరు

www.lalithaajewellery.com

# ఒక చిన్నమాట







'దేవుడి కళ్ళముందు అందరూ సమానమే'అనే నానుడి ఒకటి ఉంది.హెచ్చుతగ్గుల్లేకుండా అందరినీ సమానంగా కలిపే విషయాన్ని 'ఈక్వలైజర్' అంటారు. ప్రస్తుతం మనదేశంలో అందరికీ ఉపయుక్తంగా ఏమాత్రం వివక్షలేకుండా కోటీశ్వరుడివద్దనైనా భిక్షగాడివద్దనైనా లభించేది ప్లాస్టిక్.

ప్లాస్టిక్ లేని ఇల్లు, ఫ్యాక్టరీ, కార్యాలయం, విద్యాలయం, భోజనాలయం ఆ మాటకొస్తే ఏ ఆలయమూ లేదు. పరిశోధనాలయమూ లేదు.

ప్రపంచంలోని మొత్తం ప్లాస్టిక్‌ను తొలగించామంటే జీవితం స్తంభించిపోతుంది. ఆ స్థానంలో మరే పదార్థమూ వాడలేని స్థితి. అంత పదార్థం లోహం కానివ్వండి, గ్లాసు కానివ్వండి, మట్టి కానివ్వండి లభ్యమయ్యే ప్రసక్తే లేదు.

అంతెందుకు? అంతరిక్షయానాలు ప్లాస్టిక్ లేకుండా జరగగలవా? వ్యోమగాములు తమ పరిసరాలను చక్కగా చూడగలగటానికి, ప్రాణవాయువు పీల్చుకోవటానికి, సుఖంగా పయనించటానికి ప్లాస్టిక్ ఎంతో సాయపడుతుంది.

ప్లాస్టిక్స్ లేకపోతే అంతరిక్ష పరిశోధన ఈనాడున్నంత స్థాయికి చేరుకొనేది కాదు.అంతరిక్ష యాత్రికులు ధరించే హెల్మెట్లు,వైజార్లు, సూట్లు (దుస్తులు అందామా?) వారి సీట్లు ప్లాస్టిక్‌తోనే ఉంటాయి.

వాటికున్న మృదుత్వం (సులభంగా వంగే గుణం) నమ్మకంగా పనికివచ్చేతత్వం మరో పదార్థంలో దొరికేది కష్టం. ప్లాస్టిక్ ఇంత వినియోగంలోకి రాకముందు, ప్రారంభంలో అంతరిక్ష నౌకల తయారీకి అల్యూమినియం ఎక్కువగా వాడేవారు.

కాని అంతరిక్షయానం సుదీర్ఘంగా సాగటానికి అంతరిక్ష ప్రసారణ (రేడియేషన్) గొప్ప ఆటంకమవుతుంది. దానినుండి రక్షణ కల్పించటంలో అల్యూమినియం ప్లాస్టిక్‌తో సరితూగలేదు. అంతరిక్షనౌకలు తయారుచేయటంలో ప్లాస్టిక్ స్థానంలో మరే పదార్థం వాడినా వాటి బరువు ఎక్కువవుతుంది.

అంతరిక్షపరిశోధనకు కావలసిన పరికరాలు, ఉపకరణాలు, సరంజామా అన్నీ ప్లాస్టిక్‌తో తయారవుతున్నందున ప్రపంచదేశాలు మరింతగా అంతరిక్ష పరిశోధనకు ముందుకు వస్తున్నందున అంతరిక్ష యానంలో ప్లాస్టిక్ వాడకం మరింత ఎక్కువవుతుంది అనేది నిర్వివాదాంశం.

అంతరిక్షంలో వ్యర్థ పదార్థాలు ఇప్పటికే కోకొల్లలుగా ఉన్నాయన్న మాటా తథ్యమే. పర్యావరణ రక్షణలో అదీ ఒక భాగమే. చేయగలిగినదేముంది అన్న ధోరణిలో మౌనం వహిస్తున్నారు. (చర్చలు జరుగుతాయి. పరిష్కారమార్గాలే కనిపించవు)

అంతరిక్షం నుండి భూమికి వచ్చామంటే ఇంత ప్రయోజనకరంగా ఉండి మన జీవితాలను సుఖవంతం చేస్తున్న ప్లాస్టిక్ మనకే ప్రాణాంతకంగా మారింది. అతిశక్తిసంపన్నుడైన భస్మాసురుడు తన నెత్తినే చెయ్యిపెట్టుకొనే పరిస్థితి నెలకొంది.

ఈ బాధను తొలగించే మార్గమూ లేదు, భరించే మార్గమూ లేదు. ఇరవయ్యో శతాబ్దంలో ఏడు ఎనిమిది దశకాల వరకు సామాన్యులు ప్లాస్టిక్‌ను ముఖ్యంగా క్యారీబ్యాగ్‌లు,ప్లేట్లు, కప్పులు, గ్లాసులు ఒకసారి వాడిపారేసే వస్తువులు వాడేవారు కాదు.

అవి అందుబాటులో లేవు. చాలా దుకాణాలలో వస్తువులు కాగితపు పొట్లాలలో ఇచ్చేవారు. బజారుకెళ్ళేవారు విధిగా ఒక సంచి పట్టుకుపోయేవారు. అప్పుడు విదేశాలకు అంటే అభివృద్ధిచెందిన దేశాలకు వెళ్తేవాళ్ళు ఇచ్చే క్యారీబ్యాగ్‌లు నాణ్యతలో, మన్నికలో, ఆకర్షణలో ఎంత బాగా ఉండేవంటే వాటిని అపురూపంగా దాచుకొనేవారు.

మళ్ళీ మళ్ళీ ఉపయోగపడే ప్లాస్టిక్ బ్యాగ్‌లు అవి.

నెమ్మది నెమ్మదిగా తొమ్మిదవ దశాబ్దం నాటికి మనదేశంలో కూడా క్యారీబ్యాగ్‌లు విపరీతంగా వచ్చేశాయి. అవి ఇంట్లోనూ పనికివచ్చేవి.

ఆ తర్వాత పల్చటి బ్యాగ్‌లు అన్ని దుకాణాల్లో లభ్యమవటమేకాదు మనం కూడా బ్యాగ్‌ల ప్యాకెట్ కొనుక్కొనే వీలుండేది. రోడ్లమీద వస్తువులు అమ్మేవారు, కూరగాయలు, పండ్లు, మిఠాయి దుకాణాలు, హోటళ్ళు అన్నిచోట్లా బ్యాగ్‌లు ప్రత్యక్షం.

షాపింగ్ వెళ్ళాలని బ్యాగ్‌లు పట్టుకెళ్ళేవారు ఏ క్రీస్తుపూర్వంనాటివారో అనిపించే వాతావరణం నెలకొంది. విందులు, వినోదాలు అయినా, పెళ్ళిళ్ళు ఐనా విస్తరాకులు, పళ్ళేలు మాయమైపోయాయి.

ఒకసారి వాడిపడేసే సరంజామా తయారుగా ఉంటే ప్లేట్లు, గ్లాసులు శుభ్రపరచుకోవటాలు, జాగ్రత్తలు ఎందుకొచ్చిన తలనొప్పి అని ఎవరైనా అనుకొంటారు. డ్రింకుల సీసాలు, మంచినీళ్ళ సీసాలు అన్నీ ప్లాస్టిక్. యూజ్ అండ్ త్రో జీవితమెంత సౌకర్యవంతంగా ఉంది అని అందరూ అనుకొనేకాలం చెల్లిపోయింది.

ఫ్రాంకెన్ స్టెయిన్ సృష్టించిన రాక్షసుడు తననే కబళించటానికి వచ్చినట్లు మనకు అపురూపంగా, అసామాన్యంగా, అనేక విధాలుగా ఉపయోగపడుతున్న ప్లాస్టిక్ పర్వతాకారాల్లో పెరుగుతున్న చెత్తకుప్పల రూపంలో మన జీవితాలతో, ఇతర ప్రాణులతో చెలగాటమాడుతోంది. పర్యావరణాన్ని సహించలేనంతగా కలుషితం చేస్తోంది.

ఈ చెత్త నశించదు. కాల్చాలని ప్రయత్నించినా థర్మల్ పవరుంటే గాని కాలదు. కాలినా విషవాయువులు వెదజల్లుతుంది. దానిని మళ్ళీ వినియోగించటానికి రీసైకిలు చేద్దామంటే అన్ని ప్లాస్టిక్కులూ రీసైకిల్ కావు. ఆ ప్రక్రియా విషవాయువులతో కూడుకొన్నదే కాదు, ఆ రీసైకిల్ అయిన వస్తువులు మరింత ప్రమాదకరంగా మారుతాయి.

ఇప్పటికి 25 రాష్ట్రాలు ప్లాస్టిక్‌ను నిషేధించాయి. ఇటీవల మహారాష్ట్ర నిషేధించింది. పౌరుల బాధ్యత ఉంది. అధికారుల బాధ్యతా ఉంది.వేరువేరుగా చెత్త కుండీలు పెట్టడం మాట అటు ఉంచి ప్లాస్టిక్‌లో ఏది ఎక్కువ ప్రమాదకరమో ఏదికాదో ఎవరైనా వివరిస్తున్నారా? మైక్రాన్లు అంటే ఎవరికి తెలుసు? ఏ బ్యాగ్ ఎన్ని మైక్రాన్లో ఎవరు అంచనా వేస్తారు?

ప్రజలు త్యాగం చేసి ఒకసారి వాడిపడేసే వస్తువులను కొనం వాడం అనుకొన్నా ఏవి సురక్షితమో ఏవి కావో వాటిని అనుమతించి, నిషేధించే (తయారీ ముందే) బాధ్యత ప్రభుత్వానిదే కదా! ఇది సమస్యకు పరిష్కారంకాదు.

కాని ఉడతాభక్తి తీరులో ఉంటుంది. ముందే తయారీ నిషేధిస్తే వెదురు లేకపోతే వేణువు మోగదు అని, సమస్య పరిష్కారమవుతుంది కదా!



డాక్టర్ జె.భాగ్యలక్ష్మి
E-mail: jbhagyalakshmi43@yahoo.in

# నాలో ఆత్మ విశ్వాసాన్ని పెంచి నా జీవితాన్ని మార్చేసింది

నా పేరు శైలజ. మేము హైదరాబాద్‌లో ఉంటాము. నా వయస్సు ప్రస్తుతం 24 సం॥లు. నాకు చిన్నప్పుడే బాల నెరుపు మొదలయింది. అంటే తెల్లజుట్టు. ఇది తగ్గడానికి, కనబడకుండా ఉండడానికి నేను చెయ్యని ప్రయత్నం లేదు. ఎన్నో మందులు వాడాను. చిన్నప్పుడే తెల్ల వెంట్రుకలు ఉండడంతో అందరూ నన్ను వెక్కిరించేవారు. ఆ బాధతో హెయిర్ డై వాడడం మొదలు పెట్టాను. దీనివల్ల నాకు విపరీతంగా జుట్టు రాలడం, ఎలర్జీలు మొదలయ్యాయి. ఈ బాధ భరించలేక అవి కూడ మానేశాను. నాకు అనూస్ బ్లాక్ ఎక్స్‌పర్ట్ గురించి తెలిసి, వాడడం మొదలు పెట్టాను. అది నాలోని ఆత్మ విశ్వాసాన్ని పెంచి నా జీవితాన్ని మార్చేసింది. దీనిని రెగ్యులర్‌గా వాడడం వల్ల నా జుట్టు రాలడం తగ్గడమే కాక ఒత్తుగా పెరిగింది. నా తెలుపు జుట్టు కూడ బాగా తగ్గిపోయి నేచురల్‌గానే నలుపు జుట్టుగా మారింది. హెన్నాతో కూడిన బ్లాక్ ఎక్స్‌పర్ట్ వాడకం ఇప్పుడు ఎప్పుడో ఒక్కసారి తప్ప చాలవరకు తగ్గిపోయింది. మొదట వారం రోజులకొకసారి పెట్టేదాన్ని, ఇపుడు 15 రోజులనుంచి నెలకొకసారి పెడుతున్నానంతే ఇపుడు నాలో ఆత్మవిశ్వాసం పెరిగింది. బ్లాక్ ఎక్స్‌పర్ట్ నేను ఇపుడు వాడేది తెల్లజుట్టు కోసం కాదు, జుట్టు రాలకుండా మరియు జుట్టు చక్కగా మెయింటెయిన్ చెయ్యడం కోసం హెయిర్‌ప్యాక్‌లా వాడుతున్నాను. ఈ ప్యాక్ వాడినప్పుడల్లా నా జుట్టు ఒత్తుగా పట్టుకుచ్చులా మెరుస్తూ ఉంటుంది. అనూస్ సిస్టర్స్ చెప్పినట్లు అందులో ఉండే హెన్నా కండిషనింగ్‌గా, ఇండిబ్లాక్ డాండ్రఫ్‌కు మరియు డెడ్‌స్కిన్‌కు ఎక్స్‌ఫోలియేటర్‌గా పని చేస్తున్నదన్న సంగతి స్వయంగా ఉపయోగించిన తరువాత అర్థం అయింది.ఇపుడు అది పెట్టుకోవడం ఒక పనిలా కాకుండా ఇష్టమైన చర్యలా మారింది. ఇంత చిన్న పిల్లను పత్రికా ముఖంగా నా ఫోటోతో సహా అభిప్రాయం చెప్పే ధైర్యం చేస్తున్నానంటే ఒకటే కారణం... నాలా ఇబ్బంది పడేవారందరికీ కెమికల్స్ అసలు లేని ఇంత మంచి 100% నేచురల్ ప్రొడక్ట్ అనూస్‌లో దొరుకుతుందని. ఇంకా దీనికోసం మనం అనూస్‌కు వెళ్ళనవసరంలేదు, బజార్లో ఈ ప్రొడక్ట్ కొనుక్కొని, అనూస్‌బ్లాక్ ఎక్స్‌పర్ట్ అప్లికేషన్ లింక్ యు ట్యూబ్‌లో చూసి నేర్చుకొని, సొంతంగా ప్రొడక్ట్ ఇంట్లోనే ఉదయం పెట్టుకొని, పనులు ముగియగానే చక్కగా తలస్నానం చేస్తే చాలు నల్లని ఫ్రెష్ జుట్టు మన సొంతం అవుతుంది. ఇంత తక్కువ ధరతో ఇంత మంచి ప్రొడక్ట్‌ను అందరికీ అంధుబాటులోకి తెచ్చిన అనూస్ సిస్టర్స్‌కు, అనూస్‌కు మనస్ఫూర్తిగా అభినందనలు. ఇలాంటి మంచి పనులు ఇంకా ఎన్నో చేస్తూ మాలాంటి వారికి చేయూతనివ్వాలని నేను నా అభిప్రాయం చెప్పడానికి ధైర్యం చేశాను. మీరంతా అందంతో పాటు ఆరోగ్యం కూడ కాపాడుకోవాలని ఆశిస్తూ....

-మీ శైలజ



www.anoos.com



నా తెలుపు జుట్టుతో    పట్టులాంటి నా నల్లని జుట్టుతో




## కెమికల్ హెయిర్ డైకి 'నో' చెప్పండి

### కెమికల్స్ ఏమాత్రం లేని బ్లాక్ ఎక్స్‌పర్ట్ 100% నేచురల్ బ్లాక్ హెయిర్ కలర్ ట్రై చేయండి

- ఇది జుట్టుకు సహజమైన నలుపు రంగును ఇవ్వడంతో పాటు తెలుపు జుట్టును తగ్గిస్తుంది.
- ప్రకృతి సిద్ధమైన పదార్థముల వల్ల దీనిని ముఖ చర్మం మీద (గడ్డం, మీసాలకు) కూడ ఎటువంటి సందేహం లేకుండా వాడవచ్చు.
- ఇది జుట్టుకు కలర్‌తో పాటు కండిషనింగ్‌ను ఇచ్చి, చక్కని ఎక్స్‌ఫోలియేటర్‌గా పనిచేస్తుంది.
- జుట్టు రాలకుండా, డాండ్రఫ్ రాకుండా కాపాడుతుంది
- ఈ ప్రొడక్ట్ పి.పి.డి అండ్ గ్లూటెన్ ఫ్రీ. 100% వేగాన్, సల్ఫేట్ ఫ్రీ.

ఫ్రీ అప్లికేషన్ కొరకు కాల్ చేయండి
70972 98070

- అనూస్ ప్రొడక్ట్స్ ఆన్‌లైన్‌లో కూడ లభ్యమవుతాయి www.anoos.com
- అనూస్ హెర్బల్ ప్రొడక్ట్స్ మీ దగ్గరలోని సూపర్ మార్కెట్స్‌లోగాని, షాపులోగాని పొందాలంటే, పదే పదే అడిగి ఒత్తిడి పెంచండి.
- అనూస్ వీడియోస్‌కై మీ వాట్సప్ నంబరును ఈ 91000 34054 కు షేర్ చేయండి.
- అనూస్ బ్లాక్ ఎక్స్‌పర్ట్ అప్లికేషన్‌కై ఈ క్రింది లింక్‌ను క్లిక్ చేయండి : https://www.youtube.com/watch?v=JluUHIbfGxk&t=29s

**మా సేవలకై మీ ప్రశ్నలను ఈ నంబరుపై 99596 16106 సంప్రదించండి – అనూస్ సిస్టర్స్**

**ANOO'S**
SALON & CLINIC — Since 1982
TELANGANA | ANDHRAPRADESH
KARNATAKA | TAMILNADU | USA

**Watch Anoo's Programme**
Every Friday in TV'9 at 12.30 PM
Every Saturday in STAR MAA at 7.30 AM
Every Saturday in HMTV at 1.30 PM.

*Services & International Beauty School Courses: 99596 16106*
*Product Enquiries: 9100034054*

# మోడీతో ఢీ ఎవరు

నాలుగేళ్ళక్రితం జరిగిన యుద్ధంలో పలువురిని ఓడించి ఒకరు విజేతగా నిలిచారు. ఓడిపోయినవారంతా తిరిగి అవకాశం ఎప్పుడు దొరుకుతుందా, తదుపరి యుద్ధం ఎప్పుడు వస్తుందా, అని ఎదురుచూశారు.గత యుద్ధంలో తమకు జరిగిన అవమానానికి ప్రతీకారం తీర్చుకోవాలనుకున్నారు వారు ఎదురుచూస్తున్న సమయం రానేవచ్చింది. నాడు దెబ్బతిన్న లేదా ఓడిపోయిన రాజులకు ఒక సందేహం మొదలైంది.

ఒంటరిగా ఆ విజేతను గెలవలేము అనే నిర్ణయం మనసులో ఏర్పడింది.నాటియుద్ధంలో ఓడిపోయినవారిని,ఆ యుద్ధం తర్వాత కొత్తగా ఆ విజేతతో శతృత్వం తెచ్చుకున్నవారిని కలుపుకునిపోతే తప్పించి రాబోయే యుద్ధం గెలవలేమని అర్థంచేసుకున్నారు.

ఇప్పుడు ఇరుపక్షాలు తమ తమ గుడారాలను వేసుకుని యుద్ధభూమికి ఇరువైపులా మోహరించి నిలబడ్డారు.ఒకవైపు 'నేనే నా సైన్యానికి సర్వసేనానిని,యుద్ధంలో ముందుండి నడిపించేది నేనే' అని స్పష్టమైన ప్రకటన చేస్తున్నాడు. తన శంఖారావం వినిపిస్తున్నాడు.

రెండవవైపున పలుప్రాంతాలనుండి వచ్చిన చిన్న చిన్న పాలకులంతా తమతమ గుడారాలను ఏర్పాటుచేసుకున్నారు. వారి వారి గుడారాలకు వారే సైన్యాధిపతులు.

ఎవరికి వారు సైన్యాధిపతులుగా రంగంలోకి దిగితే గెలవలేమని తెలుసు.

కాబట్టి అందరూ కలిసి ఒక సర్వసైన్యాధిపతిని ఎంచుకుని అతనికింద పనిచేయాలి. కాని సర్వసైన్యాధిపత్యం ఎవరికి అప్పగించాలనేదాని దగ్గర ఏకాభిప్రాయం కుదరటంలేదు. యుద్ధం ముంచుకొస్తున్నా మరోసారి ఓడిపోతామన్న భయం వెంటాడుతున్నా శత్రుసేనలు సర్వసైన్యాధిపతిని ముందుకు తీసుకురాలేకపోతున్నారు.చదవటానికి ఒకజానపదకథలా అనిపించినా ఇది నేడు భారతదేశ

**మోడీని ఎదుర్కోవాలంటే ఏకాభిప్రాయం**

రాజకీయరంగపు వాస్తవ పరిస్థితి.లోక్‌సభ ఎన్నికలకున్న కాలం సరిగా 10 నెలలకు మించిలేదు. పైగా ముందస్తు ఎన్నికలు నిర్వహించాలనేఆలోచన ప్రధాని నరేంద్రమోడీ మనసులో బలంగా వుందన్న సంకేతాలు వచ్చాయి.

ముందస్తు ఎన్నికలకు ఆంధ్ర, తెలంగాణ, ఒడిషా, తమిళనాడు వంటి ప్రాంతీయపార్టీ అధికారంలో వున్న రాష్ట్రాలు 'సై' అంటున్నాయి.

కాబట్టి నవంబరులో ఎన్నికలు జరిగే అవకాశం కన్పిస్తోంది.అలా చూసినపుడు ఎన్నికలకు నికరంగా మిగిలింది వంద నుండి 150 రోజులు మాత్రమే. అయినా ప్రతిపక్ష శిబిరంలో సమిష్టిపోరాటపు ఉత్సాహం తప్పించి, సమిష్టిగా ఎదుర్కొనే ఆలోచన కనిపించటంలేదు.

2014లో వున్న 'సీన్' నరేంద్రమోడీకి ఇప్పుడు లేదన్నది అందరికీ తెలిసినదే. అదే సమయంలో నరేంద్రమోడీ మీద దేశప్రజలలో ఆశ ఇంకా నిలిచే వుంది. ఆయన చెప్పిన వాగ్దానాలన్నీ నెరవేర్చలేకపోయినా, దేశం గురించి ఆలోచిస్తున్న నేతగా, అవినీతిరహిత పాలన అందిస్తున్న ప్రధానిగా నరేంద్రమోడీని అంగీకరిస్తున్నారు.

ఇటీవలికాలంలో వస్తున్న సర్వేలు చెపుతున్నదీ అదే. అయితే ఆ ఆదరణ గతంలో కన్నా తక్కువ. పైగా ఆయనకున్న ఆదరణ బి.జె.పి.కి లేదు.నరేంద్రమోడీని ఎలాగైనా గద్దె దించాలన్న ఆలోచన ప్రతిపక్షాలలో బలంగా వుంది.

రాజకీయంగా ఆ ఆలోచన సరైనదే. అందుకు తగిన యత్నం ఇటీవల చేశారు కూడా. ఉత్తరప్రదేశ్‌లోని ఉపఎన్నికల్లో ఆ రాష్ట్రంలోని ప్రధానపక్షాలు ఎస్.పి, బి.ఎస్.పి, ఆర్.ఎల్.డి, కాంగ్రెస్‌లు కలగలిసి లోక్‌సభ స్థానాలలో బిజెపిని ఓడించాయి. బీహారులో కూడా అదే జరిగింది.

కర్ణాటకలో కాంగ్రెస్, జెడి(ఎస్)లు కలిసి బిజెపిని అధికారంలోకి రాకుండా అడ్డుకున్నాయి.

**ప్రధాని అభ్యర్థి ఎంపికలోనే పేచీ**

2014 నాడు మిత్రపక్షంగా వున్న తెలుగుదేశం ఇప్పుడు మోడీ వ్యతిరేకకూటమితో చేతులు కలుపుతున్నది. శివసేన కూడా మోడీ తరహా రాజకీయాలను వ్యతిరేకిస్తున్నది.

ఇలా చూసినపుడు దాదాపుగా 60 నుండి 65 శాతం ఓట్లు బిజెపి వ్యతిరేకపార్టీల చేతుల్లోనే వున్నాయి. కాబట్టి నరేంద్రమోడీని ఓడించటం 'లెక్కల' ప్రకారం మహా సులభం.

అయితే 'నరేంద్రమోడీని నేను ఢీకొంటా' అని చెప్పగలిగిన సర్వసేనాధిపతి ప్రతిపక్షాలకు లభించటంలేదు. లోక్‌సభ ఎన్నికలు దేశవ్యాప్తంగా జరిగేవే అయినా ఈసారి ప్రభుత్వం ఏర్పాటులో కీలకపాత్ర ఉత్తరప్రదేశ్, బీహార్‌లది మాత్రమే. కాంగ్రెస్ పార్టీ చేసుకున్న 'సెల్ఫ్ గోల్స్' వల్ల దక్షిణాదిరాష్ట్రాలలో తన పట్టును కోల్పోయింది. దక్షిణాదిరాష్ట్రాలలో బిజెపి వ్యతిరేక ఓటు బలంగావుంది. కాని ఆ ఓటును కాంగ్రెస్‌కి వేస్తామనటంలేదు.

తాజాసర్వేలో దక్షిణాది రాష్ట్రాలలో రాహుల్‌గాంధీకి ఆదరణ ఎక్కువగా వుంది. ప్రాంతీయ పార్టీల నేతలకన్నా రాహుల్‌గాంధీనే ప్రధాని అభ్యర్థిగా కోరుకుంటున్నారు. కాని రాహుల్‌గాంధీని ప్రధాని అభ్యర్థిగా ప్రకటించగలిగిన పరిస్థితిలో కాంగ్రెస్ పార్టీనే లేదు.

అలాగే సొంతంగా బిజెపిని ఎదిరించగలిగిన శక్తి నాలుగైదు రాష్ట్రాలకు ఆవల లేదు.

మిగిలిన రాష్ట్రాలన్నింటిలో కాంగ్రెస్ పార్టీ కనీసం రెండవస్థానంలో కూడా నిలవటం లేదు. ఆ పార్టీ సాంప్రదాయ ఓటుబ్యాంక్‌ని ఇతర ప్రాంతీయపార్టీలు తన్నుకుపోయాయి.

పైగా తాను ప్రజలను నడిపించగలిగిన నేతను అని రాహుల్‌గాంధీ నమ్మించలేకపోతున్నాడు.

ఇతరులెవరో చెప్పినట్లు ఆడుతూ తన హిందూ గుర్తింపుకోసం దేవాలయాలచుట్టూ తిరుగుతూ, ఆ దేవాలయాలలో ఎలా ప్రవర్తించాలో తెలియక మరింత నగుబాటు తెచ్చు



బి.జె.పి. ఓ ఉగ్రవాద పార్టీ. మతం పేరుతో దేశప్రజలను విభజిస్తున్నది.
-మమతా బెనర్జీ, బెంగాల్ సి.ఎమ్.



నమాజులో ముస్లిమ్‌లు చేసే వివిధ భంగిమలు యోగాసనాల వంటివే. -మహమూద్ ఆలీ,
తెలంగాణ ఉపముఖ్యమంత్రి

కుంటున్నారు. ఫలితంగా కాంగ్రెస్ ప్రాంతీయ పార్టీలమీద ఆధారపడాల్సివస్తోంది. రాజకీయంగా నిలదొక్కుకునేందుకు ప్రాంతీయపార్టీలకు ఎక్కువ సీట్లు వదులుకోవాల్సిన పరిస్థితి. వచ్చే ఎన్నికల్లో 200 సీట్లకు మించి పోటీ చేయలేకపోవచ్చు ఆ పార్టీ.

200 సీట్లలో 100 సీట్లు గెలుచుకోవటం అంత సులభం కాదు. 100 కన్నా తక్కువ సీట్లు వస్తే ఆ పార్టీ ప్రధాని అభ్యర్థిత్వం మీద ఆశలు వదులుకోవాల్సిందే.

కాబట్టి ఇప్పుడు ప్రాంతీయ పార్టీ నేతలదే హవా. ఎవరి రాష్ట్రంలో వారు బలంగా వున్నారు ప్రాంతీయపార్టీ నేతలు. నారా చంద్రబాబు నాయుడు, కె.చంద్రశేఖరరావు,మమతాబెనర్జీ, అఖిలేష్ యాదవ్, మాయావతి, నవీన్ పట్నాయక్, కుమారస్వామి వంటివారంతా ఆ యా రాష్ట్రప్రజలను ఆకట్టుకునే నేతలు.

కాబట్టి వారిలో ఎవరో ఒకరికి నాయకత్వం అప్పగించాలి. కాని ఆ నాయకత్వం ఎవరికి అప్పగించి తాము వెనక్కితగ్గాలన్న దగ్గరే సమస్య ఏర్పడుతోంది. మోడీని ఓడించాలి, ప్రధాని పదవిని కాంగ్రెస్‌కి ఇవ్వకూడదు అనే రెండు అంశాలమీద ప్రాంతీయపార్టీలలో ఏకాభిప్రాయం ఉంది.

కాని మోడీని ఢీకొనటానికి ఎవరిని ముందుంచాలనేదానిలో ఏకాభిప్రాయం లేదు. అసలు అన్ని పార్టీలు ఎన్నికలముందే ఒక అవగాహనకు వచ్చి అన్ని నియోజకవర్గాలలో ఒకే ఒక ఉమ్మడి అభ్యర్థిని నిలబెట్టగలిగితే విజయం ప్రతిపక్షాలదే.

అటువంటి చర్చలు మొదలు కూడా కాకముందే "ఎన్నికలముందు సీట్ల సర్దుబాట్లకు అసలు అవకాశమే లేదు"అంటూ ఎన్.సి.పి. నేత శరద్‌పవార్ చేసిన ప్రకటన ప్రతిపక్ష శిబిరంలో గందరగోళం లేపింది.

ప్రధానిపదవిమీద ఎంతోకాలంగా కన్నేసిననేత శరద్‌పవార్. వయసురీత్యా ఆ పదవినిదక్కించుకునేందుకు పవార్‌కి ఇదే ఆఖరి చాన్స్. ఆ ఒక్క ఛాన్స్‌ని ఎన్నికలముందు సీట్ల సర్దుబాటు పేరుతో వదులుకోవటం ఆయనకు ఇష్టం లేదు.

యు.పి, బీహార్ తర్వాత అధిక సీట్లున్న రాష్ట్రం మహారాష్ట్ర. అయితే అందులోని 40 సీట్లలో శరద్ పవార్ 10-12 సీట్లు మించి గెలవలేడు.

వాస్తవంలో మమతాబెనర్జీ తప్పించి మిగిలిన ప్రాంతీయ పార్టీ నేతలెవరూ సొంతంగా గెలవగలిగినది 10-15 సీట్లు మాత్రమే. ఆ కొద్దిపాటి సీట్లతో ప్రధానిపదవి దక్కాలనుకోవడం దురాశే.

అధికసీట్లున్న యు.పి.లో అఖిలేష్, మాయవతి చేతులు కలిపితే, వారికి కాంగ్రెస్, ఆర్.ఎల్.డి. మద్దతుగా నిలిస్తే 50 సీట్లు గెలుచుకునే అవకాశం ఉంటుంది. బీహారులో ఆర్.జె.డి., కాంగ్రెస్ కలిసి 30 సీట్లు గెలుచుకునే అవకాశం ఉంది.

ఒక్క మమతా బెనర్జీకి మాత్రమే బెంగాల్‌లోని 42 సీట్లలో 35 వరకు దక్కే అవకాశముంది.

## తటస్థుడిగా ప్రణబ్‌ముఖర్జీకి ఆశ

ప్రాంతీయపార్టీల నేతలలో మరో సాటి నేతను సర్వసేనానిగా అంగీకరించేందుకు మనసు ఒప్పనివారు. పైగా ఈ ప్రాంతీయ పార్టీలేవీ కూడా మరో ప్రాంతీయపార్టీకి ప్రచారంలో బలం అందించలేనివి.

ఒక్క బహుజన పార్టీ మాత్రమే ఒకటికన్నా ఎక్కువ రాష్ట్రాలలో ఓట్లను కలిగివున్నది. తన ఓటుబ్యాంక్‌ని మరో పార్టీకి బదిలీ చేయించగలిగిన శక్తి మాయావతికి మాత్రమే వుంది.

ఇక మిగిలినవాటిలో తెలుగుదేశం చివరికి తెలంగాణలోకూడా ప్రభావంచూపలేదు. తృణమూల్ కాంగ్రెస్ బెంగాల్ అవల ఏమీ చేయలేదు. పైగా ఈ ప్రాంతీయపార్టీలన్నింటికి రాష్ట్రస్థాయిలో సైద్ధాంతిక అభ్యర్థి కాంగ్రెస్. ఆ యా ప్రాంతీయపార్టీల పుట్టుక కాంగ్రెస్ వ్యతిరేకత ద్వారానే.

ఈ నేపథ్యంలో ఎవరో ఒకరిని నరేంద్ర మోడీతో ఢీకొనే నేతగా ప్రకటించాల్సిన అవసరం ప్రతిపక్షాలది.గెలవగలమన్న నమ్మకం గట్టిగా వుంటే తప్పించి అటువంటి సాహసం ఎవరూ చేయరు.

2019లో మోడీని ఢీకొని ఓడిపోతే దానితో వారి నాయకత్వం రాష్ట్రస్థాయి లోనూ బలహీన పడుతుందనే భయం వుంది వారికి.

ఏ భయం లేకుండా ఎప్పుడయినా, ఎక్కడైనా మోడీతో ఢీ అనే ఏకైక ప్రాంతీయ నేత ఆప్ పార్టీ నేత అరవింద్ కేజ్రీవాల్. కాని కేజ్రీవాల్‌ని మిగిలిన ప్రతిపక్షాలు సీరియస్‌గా తీసుకోవటంలేదు.

మమతాబెనర్జీ, మాయావతిలిద్దరూ ప్రజాబలం గలవారే కాని ఎప్పుడు ఎటువంటి నిర్ణయం తీసుకుని, చిన్నవిషయాలకే అలిగి వెళ్ళిపోతారో తెలియదు. పైగా ఇతర నాయకులు చెప్పినదానికి అనుగుణంగా నడుచుకోరు.

మాయావతిని ముందు నిలపటం సరైన ఎత్తుగడ. ఆమె దళిత ఓటును ఏకం చెయ్యగలిగిన శక్తివంతమైన నేత.

ఆమెకున్న బహు జన ఓటుబ్యాంక్‌కి ఇతర పార్టీల ఓట్లు జత కూడితే యు.పి.ని ఒక ఊపు ఊపగలదు. కాని ఆమె పెట్టే కఠిన నిబంధనలను అంగీకరించలేవు మిగిలిన పార్టీలు.

యు.పి.లో తన పార్టీకి కనీసం 50 సీట్లు కావాలన్నది ఆమె పట్టుదల.

ఇప్పటికే ఆమె మధ్యప్రదేశ్‌లో కాంగ్రెస్‌తో జత కట్టనని తేల్చిచెప్పింది.కాంగ్రెస్ పార్టీ తిరిగి కోలుకుంటే తమ పార్టీలకు దెబ్బ అనేది మాయావతితో సహా అన్ని ప్రాంతీయ పార్టీల భయం.

కాబట్టికాంగ్రెస్‌పార్టీ తమ అదుపులోవుండే పార్టీగా చూడాలని ప్రాంతీయపార్టీలు అనుకుంటున్నాయి. కర్ణాటకలో అధికసీట్లు దక్కించుకున్నా ముఖ్యమంత్రి పదవిని ప్రాంతీయపార్టీ జె.డి.(ఎస్)కి ఇవ్వాల్సిన పరిస్థితి కాంగ్రెస్‌ది. ఆ స్థాయిలోనే ఆ పార్టీని అదిమి వుంచాలన్నది అన్ని ప్రాంతీయపార్టీల ఎత్తుగడ.

ఎన్నికలకుముందు ఎవరోకరిని ప్రధాని అభ్యర్థిగా నిలిపేందుకు గతంలో ఒక ఆలోచన జరిగింది. నాడు బీహార్ ముఖ్యమంత్రి నితీష్‌కుమార్‌కి ఆ స్థానం ఇవ్వాలనుకున్నాయి ప్రతిపక్షాలు.కాని నితీష్ మహాఘట్‌బంధన్‌ని వదిలి ఎన్.డి.ఎ.లోచేరినతర్వాత ఇక ఆయనకు ఆ అవకాశం పోయినట్టే.

మిగిలిన ప్రాంతీయపార్టీ నాయకులలో ఎవరో ఒకరిని సర్వసేనానిని చేయటం కుదరటంలేదు.

అందుకే బహుశా ప్రతిపక్షపార్టీలు తమ ప్రధాని అభ్యర్థిని ప్రకటించే ఆలోచన చెయ్యక, ఎన్నికల తర్వాత ఫలితాలను బట్టి ఎవరో ఒకరిని ప్రధానిగా ఎన్నుకుందామనే ఆలోచన చేస్తారు.

లోక్‌సభ ఎన్నికల ఫలితాల తర్వాతనే 2004లో యు.పి.ఎ. ఏర్పడిన విషయం గుర్తుపెట్టుకోవాలి.

## నాడు ఇందిరాగాంధీ స్థానంలో నేడు మోడీ

నాడు యు.పి.ఎ. ఏర్పాటులో కీలకపాత్ర పోషించిన సి.పి.ఎమ్. నేత సుర్జిత్‌సింగ్ వంటివారు నేడు లేరు.నాడుకూడా ఎన్నికల్లో గెలిచిన వ్యక్తులలో ఒకరిని ప్రధానిగా ఎన్నుకోలేదు. కాంగ్రెస్ పార్టీ తమ నేతగా మన్మోహన్ సింగ్‌ని చివరి క్షణంలో నామినేట్‌చేసి ప్రధాని పదవిలోకూర్చోబెట్టింది. ఈసారికూడా అటువంటిపద్ధతే తప్పదన్నది సీనియర్ నేతల అభిప్రాయం.

అందుకే ఎవరికివారు తమ అనుభవాన్ని, రాజకీయ ఎత్తుగడలను చివరి క్షణంలో ప్రయోగిద్దామనుకుంటున్నారు.

తమలో తాము ఎటూ తేల్చుకోలేక మధ్యేమార్గంగా నా వైపు మొగ్గకపోతారా! అనే ఆశ పవార్,ప్రణబ్‌వంటివారికి ఉంది. దళితవర్గాలకు పదవిదక్కే అవకాశముంది కాబట్టి ఈసారి ప్రధాని పదవిని మేమెందుకు ఆశించకూడదన్న ఆలోచన మాయావతితోపాటుగా మాజీ స్పీకర్ మీరాకుమార్, సుశీల్‌కుమార్ షిండే వంటి నేతల మనసుల్లో వుంది.

ప్రతిపక్షంలో నెలకొన్న ఈ గందరగోళమే నరేంద్ర మోడీకి కలిసివస్తున్న అంశం. స్పష్టమైన ఎజెండా,నేతృత్వం కలిగిన ఎన్.డి.ఎ.దానిని నడిపే నరేంద్ర మోడీ కావాలో, కలగూరగంప వంటి ప్రతిపక్షాలు కావాలో తేల్చుకోండన్న ప్రశ్న నరేంద్రమోడీ వేసే అవకాశముంది.

ఇదే 1970ల్లో ఇందిరాగాంధీ వేసిన ప్రశ్న. ఇప్పుడు ఇందిరాగాంధీ స్థానంలో నరేంద్రమోడీ వున్నాడు.నాటి కాంగ్రెస్‌స్థానంలో బిజెపి వుంది. 1971 ఎన్నికల్లో ఆ వాదనతో కాంగ్రెస్‌ని గెలిపించింది ఇందిరాగాంధీ. అదే వాదనతో 1977 ఎన్నికల్లో ఓడిపోయింది. ఓటర్లు ప్రతిపక్ష 'కిచిడీ'ని ఎన్నుకున్నారు. మరి ఈసారి ఏ చరిత్ర పునరావృతమవుతుందో!

**డా॥ దుగ్గరాజు శ్రీనివాసరావు**

దశదిశలా నవ్వులు కురిపించే

# కామెడీ కథల పోటీ

## ఒక్కో కథకి నజరానాగా

## ₹10,000 బహుమతి

## అలా పది కథలకు

## లక్ష రూపాయల బహుమతులు

ప్రచురణకు తీసుకున్న ప్రతి కథకు ₹ 2,000



నవ్వగలిగిన ఏకైక ప్రాణి మనిషి ఒక్కడే! నవ్వు మానవజాతికే గొప్ప వరం. 'నవ్వు, నవ్వించు' అన్నారు. నవ్వు ఓ గొప్ప టానిక్.

శరీరంలో ఎక్కడ నలతగా వున్నా సరే, నవ్వితే ఆ నొప్పి తగ్గుతుందనేది ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయవేత్తల పరిశోధనల్లో తేలింది. అందుకే నవరసాలలో ఒకటైన నవ్వును అందరికీ పంచేందుకే ఈ కామెడీ కథల పోటీ. ఆరోగ్యాన్ని, ఆయుష్షును పెంచే ఈ ఛాలెంజీ పోటీలో రచయిత(త్రు)లందర్నీ పాల్గొనవలసిందిగా కోరుతున్నాం.

### : నిబంధనలు :

మీ కామెడీ కథ, స్వాతి సపరివార పత్రికలో బొమ్మతో సహా, ప్రచురణలో రెండు పేజీలుమాత్రమే రావాలి.అనగా మీ వ్రాతప్రతి **ఆరు అరఠావులకు** మించకుండా వుండాలి. కాగితానికి ఒకవైపున మాత్రమే రాయాలి.

ప్రతి అరఠావుకు సుమారుగా ఇరవై ఐదులైన్లు ఉండాలి.

1. కామెడీ కథల ఎంపికలో స్వాతి సంపాదకునిదే తుది నిర్ణయం. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావు లేదు. ఈ పోటీ గడువు తేదీని పొడిగించేందుకుగానీ, పోటీని రద్దు చేసేందుకుగానీ, స్వాతి పబ్లికేషన్స్ యాజమాన్యానికి సర్వహక్కులూ ఉన్నాయి.
2. అనువాదాలూ, అనుకరణలు, ఇతర పత్రికలకి పంపబడి పరిశీలనలో ఉన్న రచనలను పంపవద్దు.
3. కామెడీ కథలు తమ స్వంతమే అని, అముద్రితమని, తమ స్వదస్తూరితో రాసిన హామీ పత్రాన్ని విధిగా జత పరచాలి.
4. బహుమతి యోగ్యం కానివాటిని సాధారణ ప్రచురణకు తీసుకునే హక్కు మాకుంది.
5. ప్రచురణార్హం కాని కథలను తిప్పి పంపగోరువారు తగినన్ని స్టాంపులు అంటించిన స్వంత చిరునామా గల కవరు జతపరచాలి. 'కామెడీ కథల పోటీ'కి అని కవరుమీద స్పష్టంగా రాయాలి.

మీ కామెడీ కథలను ఎడిటర్, స్వాతి సపరివార పత్రిక, అనిల్ బిల్డింగ్స్, సూర్యారావుపేట, పోస్ట్ బాక్స్ 339, విజయవాడ 520 002కు పంపాలి



కామెడీ కథలు మాకు చేరవలసిన ఆఖరు తేది : **10. 8. 2018**

# అవాంఛిత - ఎక్సెస్ హెయిర్‌కి చెక్ చెప్పండి



**Angels** [Since 1991] Advanced Clinic Pvt. Ltd.
HAIR, SKIN & BODY CARE

చికాకు, చిరాకు, నలుగురిలో చెప్పుకోలేని బాధతో ఇంకెంత కాలం బాధపడతారు? నవ నాగరిక ప్రపంచంలో ఎన్నో వినూత్న మార్పులు.... లైరా-ఐ-ND Yag Long Pulsed Laser ద్వారా పై పెదవి, చిన్, చీక్స్, చెస్ట్, స్టమక్‌పై వచ్చే అవాంఛిత రోమాలతోపాటు శరీరంపై ఏ ప్రాంతంలో వచ్చే ఎక్సెస్ హెయిర్‌నైనా శాశ్వతంగా తొలగించుకోండి.

## ఒక గంటలో మిమ్మల్ని మీరే గుర్తు పట్టలేనంత యంగ్ లుక్....
## ఇక మీకే సొంతం... సిలికాన్ సిస్టమ్® ద్వారా బాల్డ్ హెడ్‌పై హెయిర్













ఎక్కడ చూసినా ఒక్కటే సమస్య?
హెయిర్ ఊడిపోతోందని... పలుచబడుతోందని...
బట్టతల వచ్చేస్తోందని...
మీ హెయిర్ సమస్యలన్నింటికీ ఫుల్‌స్టాఫ్
## స్టెమ్‌సెల్ థెరపీతో...

## సన్నగా.... స్లిమ్‌గా...
యూనివర్సల్ టెక్నాలజీస్ అయిన సెల్యులైట్ థెరపీ, బాడీఫార్మర్, ప్రొటీన్ థెరపీస్‌తో అధిక బరువు, అధిక పొట్టకు గుడ్ బై చెప్పండి. నాజూకుగా మారండి





**GSH మరియు Advanced Skin Peels ద్వారా Face and Entire Body కాంప్లెక్షన్‌ను ఇంప్రూవ్ చేసుకోండి**

## ఒక గంటలో వత్తైన, తీరైన ఐబ్రోస్ శాశ్వతంగా మైక్రో పిగ్మెంటేషన్ థెరపీ ద్వారా


ముందు


తరువాత

పంజాగుట్ట : 9848113694, హైదరాబాద్ : 9959666699, విజయవాడ : 9848252499, విశాఖపట్నం : 9573544699, నెల్లూరు : 8886322119, భీమవరం : 8886644448, తిరుపతి : 8886622228, రాజమండ్రి : 8886611118, కరీంనగర్ : 7337363679, బెంగళూరు : 9845566799, చెన్నై : 9840046599, కోయంబత్తూర్ : 9244415899, తిరుచ్చి : 9677127799, మధురై : 9840352499

హెయిర్, స్కిన్, బాడీకేర్ సొల్యూషన్‌కై హెల్ప్‌లైన్ : 92464 74849 040-46474849 /98481 13694

- పింపుల్స్ > మచ్చలు > హోల్స్ > పులిపిర్లు > పిగ్మెంటేషన్
- అక్కడక్కడ వచ్చిన తెల్ల మచ్చలకు మైక్రో పిగ్మెంటేషన్ ద్వారా ఇన్‌స్టెంట్ రిజల్ట్స్
- తీరైన వత్తైన ఐబ్రోస్ ఒక గంటలోనే
- వెయిట్ రిడక్షన్
- ఫేస్ లిఫ్టింగ్
- కలర్ ఇంప్రూవ్ మెంట్

ALL DAYS WORKING 9 A.M to 7 P.M ALL SERVICES ARE UNDER SUPERVISION OF DOCTORS.
www.angelsclinic.in | www.angelscosmetic.co.in | e-mail : angels@angelsclinic.in

## Say Good Bye to Scars / Holes
Meso Therapy ద్వారా నునుపైన Skin పొందండి.



Angels Cosmetic Surgery & Aesthetic Centre
Road No.2, Banjarahills, Cell : 88866 33339

# రాధామాధవం

**అతడి మెత్తటి అడుగుల చప్పుడే చెబుతున్నాయి నా దగ్గరనే ఉన్నాడనీ! నులివెచ్చని వేళ్ళు నా కళ్ళు మూయడానికి ప్రయత్నిస్తున్నాయి! అతడి వెచ్చని ఊపిరి నా కంఠాన్ని వేడెక్కిస్తోంది. కనులు మూసిన వేళ్ళు నెమ్మదిగా కంఠం మీదుగా హృదయం మీదకు వచ్చేశాయి. ఆ సమయంలో...**

"మేడమ్! నన్ను ప్రేమిస్తారా?" నా ముందు మోకాళ్ళపై మోకరిల్లి దీనంగా దోసిలి పట్టి అమాయకంగా అడుగుతున్న మాధవుని చూసి ఒక్కసారి పక్కున నవ్వేశాను.

"ప్రేమించానుగా!" అందంగా జవాబిచ్చాను.

"నా ప్రేమను స్వీకరిస్తారా?" మరో ప్రశ్న వేశాడు.

"స్వీకరించానుగా!" సమాధానం చెప్పాను.

"పెళ్ళి చేసుకుంటావా?" మళ్ళీ అడిగాడు.

"చేసుకున్నానుగా!" ప్రేమగా జవాబిచ్చాను.

"జీవితాన్ని పంచుకోమంటారా?"

"పంచుకోమనేగా తొలిరాత్రి పడకగదికి వచ్చింది!" ఓరకంట చూశాను.

"తాకవచ్చునంటారా?" కుడిచేతిని అందుకొని పెదవులకందించాడు. అతడి సన్నని మీసకట్టు స్పర్శకు తనువు పులకరించిపోయింది.

"మాధవ్!" మత్తుగా నా గొంతు నాకే గమ్మత్తుగా వినిపించింది.

"రాధా!" పాలగ్లాసునందుకొని మల్లెల పాన్పువైపు నడిపించాడు.

అతడు పాడినపాట నాకు అత్యంత ప్రీతిపాత్రమైన మధురాతిమధురగీతం మదిలో మెదిలింది.

అదే పాట మంద్రంలో పాడుతుంటే మైకం కమ్మింది! తమకంతో కళ్ళు తెరిచిన నాకు నిజమైన మాధవుడే కనిపించాడు. 'చల్లగాలిలో... యమునా తటిపై శ్యామసుందరుని మురళీ... మురళీ...

డిమ్‌లైటింగ్‌లో యమునాతీరం సాయంత్రంలా ఉంది! మనసా వాచా కర్మణా త్రికరణశుద్ధిగా నాలో లీనంకావడానికే వేణుగానలోలుడు సమాయత్తమౌతున్నాడు. సన్నగా చప్పుడు చేయని ఏ.సి. గాలి మలయమారుతంలా ఉంది! కళ్ళు మూసుకుంటే మురళీ మోహనుని మోహనరూపు సాక్షాత్కరించింది.

కళ్ళు తెరచి చూద్దును గదా నా మాధవుడు కనిపించలేదు. సన్నగా పాట వినిపిస్తోంది. తరువు తరువు కడ దాగి దాగి.. సన్నరయు కన్నుగవ మురుపులవే...

కన్నుగవ మురుపులను మెరిపించడానికి తరువుల చాటున, లలితానికుంజముల మాటునుండి తొంగి తొంగి చూసే కనులు కనిపిస్తే గదా...

మురిసి... మురిసి... నా వెనుక దరిసి... కనులు మూయుకెంగేళులవే...

పాట సమీపానికి వచ్చేసింది! అతడి మెత్తటి అడుగుల చప్పుడే చెబుతున్నాయి నా దగ్గరనే ఉన్నాడనీ! నులివెచ్చని వేళ్ళు నా కళ్ళు మూయడానికి ప్రయత్నిస్తున్నాయి! అతడి వెచ్చని ఊపిరి నా కంఠాన్ని వేడెక్కిస్తోంది. కనులు మూసిన వేళ్ళు నెమ్మదిగా కంఠం మీదుగా హృదయం మీదకు వచ్చేశాయి.

తనువంతా జలదరించింది. పులకరించింది! డిమ్‌లైట్లు ఆరిపోయాయి. వీణానాదాలు శరీరంపై నర్తించాయి! వేణుగానాలు మదిలో రవళించాయి. రాధ ఓడిపోయిందో...

మాధవుడు ఓడిపోయాడో... ఎవరు గెలిచారో.. ఎవరు ఓడిపోయారో అంతుబట్టే లోపు తూరుపున వెలుగురేకలు విచ్చుకున్నాయి.

'చల్లగాలిలో... యమునాతటిపై' హమ్మింగ్ చేసుకుంటూ బాగా పొద్దెక్కిన తరువాత అటాచ్డ్ బాత్‌రూమ్‌వైపు అభ్యంగనస్నానం కోసం అడుగులు వేశాను. సరిగ్గా మూడు సంవత్సరాల క్రితం మాధవ్ పాడే పాటే నా జీవితాన్ని మారుస్తుందని అనుకోలేదు! మాధవ్ నాకు సంవత్సరం జూనియర్!

నేను ఫైనల్ డిగ్రీలో ఉండగా అతడు రెండవ సంవత్సరం చదువుతున్నాడు. అతడు పాటలు బాగా పాడతాడనీ, ప్రైజులు కూడా తెచ్చుకున్నాడని వాళ్ళు వీళ్ళు అంటుంటే వినేదాన్ని. ఆ రోజు మాత్రం ప్రత్యక్షంగా అతడు పాడిన పాట వినగలిగాను.

అంతర్ కళాశాలల పాటల పోటీ జరుగుతోంది.

సూర్యప్రసాదరావు





ఆఖరి పీరియడ్ జరుగుతోంది.

ఇంతలో "చల్లగాలిలో..." పై పంచమంలో ఆరు నొక్క శృతిలో ఆడిటోరియంలో మొదలైన ఆలాపన కాలేజీలో చల్లగాలి వీయించింది."యమునా తటిపై.. శ్యామసుందరుని మురళి"

"ఉల్లము ఝుల్లుమనే మధుగీతులు మెల్లమెల్ల చెవి సోకునవే... చల్లగాలిలో...

చల్లగాలిని, మాధవుని కోసం ఎదురుచూసే ఎన్నో కనుదోయిలను, వారి అంతరంగ వేదనాతరంగాలను చక్కగా పరిచయం చేస్తున్నాడు.

రెండవ చరణం మొదలైంది! పొదరిళ్ళమాటు నుండి తరువుల వెనకకు తప్పుకున్నాడు. తనకోసం వెదకి విసిగి వేసారిన రాధ కళ్ళను చిగురుటాకుల వంటి వ్రేళ్ళతో మూసివేశాడు.

ఆమె మూసినకనులు తెరవలేదు. కనులు తెరిస్తే మళ్ళీ ఎక్కడ మాధవుడు మాయమౌతాడోనని అలాగే ఉండిపోయింది. చల్లగాలి ఆగలేదు. మురళీస్వరం వినిపించకపోలేదు.

పాట అయిపోయింది! రాధా మాధవ ప్రణయాన్ని కళ్ళముందు సాక్షాత్కరింపచేసిన పాటకు తన్మయత్వం చెందిన శ్రోతలు ఇహంలోకి వచ్చేశారు. చప్పట్లతో ఆడిటోరియం దద్దరిల్లింది.

మాధవ్ కళ్ళు తెరిచాడు. అర్ధనిమీలిత నేత్రాలతో సభకు శిరసు వంచి నమస్కరించాడు.

ఎందరో రాధలు స్టేజిపైకి పరిగెత్తారు. అతడిని అభినందించడానికి! నేనూ స్టేజీ ఎక్కాను.అతడి కళ్ళల్లోకి చూశాను. ఆడపిల్లను చూస్తే జడిసే బెదిరే చూపులు, చిగురాకు పెదవులు, నూనూగు మీసాలు, సిగ్గుపడుతున్న ముఖారవిందం క్షణకాలం తన్మయత్వం కలిగించింది. హఠాత్తుగా అతడిని హత్తుకున్నాను. కంగ్రాట్స్ చెప్పాను.

నా గుండెల చప్పుడు అతడికి తెలిసిందో లేదో గానీ అతడి హృదయస్పందన నాకు గిలిగింతలు పెట్టింది. క్షణంలో ప్రేక్షకులలో కలిసిపోయాను!అంతే! అతనికి నేను కనిపించలేదు.మళ్ళీ అతడునాకుతారసపడలేదు. ఇంతలో ఫైనల్ ఎగ్జామ్స్ వచ్చేశాయి.

డిగ్రీ పూర్తికాగానే ఎమ్.ఏ. చదువుకోసం పట్టణం వెళ్ళవలసివచ్చింది. ఎమ్.ఏ. తెలుగు కూడా ఫస్ట్ క్లాసులో పాసయ్యాను. పూర్వవిద్యార్థులకు లెక్చరర్‌గా అవకాశమిచ్చే ఆనవాయితీ మేనేజ్‌మెంట్ కల్పించడంచేత అదే కాలేజీలో తెలుగు లెక్చరర్‌గా జాయిన్ అయ్యాను.

కాలేజీలో ప్రవేశించగానే క్షణకాలం అతడు మదిలో మెదిలాడు. ఈపాటికి డిగ్రీ పూర్తిచేసి పీ.జి చేస్తుంటాడు! అతడి గురించి వివరాలు ఎవరికి తెలుస్తాయి? ఎవరిని అడగాలి? ఏమని అడగాలి?

విద్యాసంవత్సరం ప్రారంభమైన నెలరోజులకు అతడు పుస్తకాలతో కాలేజీ కారిడార్‌లో ఎదురుపడ్డాడు కొలీగ్ కళ్యాణితో క్లాసుకు వెళ్తుంటే తారసపడ్డాడు. నేను అతడిని చూశాను.

క్షణకాలం గుండె లయ తప్పింది. అతడు నన్ను

చూశాడు. పలకరించే ధైర్యం చేయలేదు.

కళ్యాణి మాధవ్‌ను పలకరించింది. "ఏరా! మాధవ్! బాగున్నావా?" మాధవ్ ఒక్కసారి ఉలిక్కిపడ్డాడు.

"బాగున్నా అక్కా! నువ్వు ఎలా ఉన్నావ్?" పాలిపోయిన మొహంతో నన్ను చూశాడు.

"బాగున్నానురా!మీ క్లాసుకు కొత్తగా ఈ తెలుగు మేడమ్ వస్తోంది. పాఠం బాగా చెబుతుంది కనీసం ఈ సంవత్సరమైనా డిగ్రీ పూర్తిచేయరా!" సలహా ఇచ్చింది కళ్యాణి. "అలాగేనక్కా! నమస్తే మేడమ్!" విష్ చేసి మాధవ్ వెళ్ళిపోయాడు. "మాధవ్ నీకు తెలుసా?" ఆశ్చర్యంగా అడిగాను.

"తెలుసా...ఏమిటే?వాడునాకు తమ్ముడు లాంటివాడు. నాకంటే ఒక్క ఏడు చిన్న! రెండేళ్ళక్రితం అంతర్ కళాశాల పాటలపోటీలో పాడిన పాటే వాడిని పిచ్చివాడినిచేసింది. పరీక్షలు రాయలేదు. ఏదో పోగొట్టుకున్న వాడిలా తిరిగే వాడు! లాభంలేదని వాడికి ఇష్టమయిన లలిత సంగీత శిక్షణాలయంలో అమ్మజాయిన్ చేయించింది.

పాటలు నేర్చుకుంటూ,పాడుతూ పాడుతూఅంతా మరిచిపోయేవాడు. ఎన్నో ప్రైజులు తెచ్చుకున్నాడు. కానీ డిగ్రీ పూర్తిచేయలేదు!" కళ్యాణి నేనాశించిన మాధవ్ వివరాలు అడగకుండానే అందించింది.

"ఎందులో తప్పాడు?"ఉండబట్టలేక అడిగాను.

"ఎందులోనా... తెలుగులోనే తప్పాడు. అదీ స్పెషల్ తెలుగులో! మొక్కుబడిగా పాఠం చెప్పేవాళ్ళ పాఠం నచ్చదు! మనసుపెట్టి చెప్పేవాళ్ళ దగ్గర విన డానికి ఇష్టపడతాడు.

నువ్వు చక్కగా మనసుపెట్టి పాఠం చెబుతావని తెలుసు!అందుకే నేనే రమ్మని కబురుచేశాను"కళ్యాణి నావైపు ప్రశ్నార్థకంగా చూసింది.ఇంతలో క్లాస్‌రూమ్‌లు వచ్చేశాయి. నేను క్లాస్‌లో ప్రవేశించాను.

'మాధవ్ పాడిన పాటే పిచ్చివాడిని చేసిందా?నేను ఇచ్చిన గాఢాలింగనము పిచ్చివాడిని చేసిందా! ఎంతో తీవ్రమైన ప్రభావం చూపితేతప్ప మగవాడు సాధారణ జీవితం నుండి వైదొలగడు! అర్థాంతరంగా చదువు మానివేయడు! తన స్పర్శ అతనిలో ప్రకంపనలు పుట్టించింది. అతడు తనను మర్చిపోలేదు. తాను మాధవ్‌ను మరిచిపోతేగదా!'

మరో వారంరోజులకు ఫైనల్ ఇయర్ తెలుగు క్లాసుకు వెళ్ళాను. అందులో సుమారు ముప్పైమంది విద్యార్థులు ఉన్నారు. వారిలో ఇరవైమంది అమ్మాయిలు, ఏడుగురు ఎనిమిదిమందో అబ్బాయిలున్నారు. చెప్పబోయే పాఠం 'రాధికాసాంత్వనము' మనసు పెట్టి చెప్పడం ప్రారంభించాను.

"అది విరిసిన పున్నమి వెన్నెల! అది వీచిన తెమ్మెర ఊయల. అది చల్లని సైకత వేదిక... అట సాగెను విరహిణి రాధిక..."

తాదాత్మ్యంలోకి ప్రవేశించబోయే ముందు ఏదో పిలుపు వినిపించింది. "మే ఐ కమ్ ఇన్ మేడమ్!"

"ఎస్! కమిన్!" క్లాసులోకి వచ్చినవాడిని చూసి క్షణం గతుక్కుమన్నాను... మాధవ్! అల్లంతదూరాన చివరి బెంచీలో కూర్చుని కనిపించీ కనిపించకుండా కనిపిస్తూ పాఠం వింటున్నాడు. కొంచెం విరామం రాగానే ఒకమ్మాయి లేచి నిలబడింది.

"మేడమ్! మీకభ్యంతరం లేకపోతే రాధాకృష్ణుల మీద మన మాధవ్ ఒక పాట పాడతాడు!రాధాకృష్ణుని పాట పాడమని అడిగే పాట పాడతాడు!"

ప్రశ్నార్థకంగా మాధవ్ వైపు చూశాను "నాకు కావలసిందీ... అదే!" "చాలా రోజులైంది మేడమ్! మాధవ్ కమ్మని పాట విని! ఎప్పుడూ ఏదో ఒక రికార్డింగ్‌కు వెళ్తూ ఉంటాడు! లైవ్ ప్రోగ్రామ్‌లలో పాల్గొంటాడు. మీరు వచ్చిన దగ్గరనుండే రెగ్యులర్‌గా క్లాసులకువస్తున్నాడు!ప్లీజ్!పర్మిట్ చేయండి! మేడమ్!" మరో అమ్మాయి అభ్యర్థించింది.

"సరే!" నేను ఆనందంగా తల పంకించడం ఆలస్యం మాధవ్ పాటపాడడం ప్రారంభించాడు. "పాట పాడుమా...కృష్ణా...పలుకు తేనెలొలుకు నటుల...

అప్పటికే చుట్టూఉన్న క్లాసుల పిల్లలంతా మా క్లాస్ రూమ్‌ముందు గుమిగూడారు. నెమ్మదిగా వారిని లోపలకు నిశ్శబ్దంగా రమ్మని సైగచేశాను.

చరణం మొదలయ్యేసరికి కారిడార్లో తిరుగుతున్న ప్రిన్సిపల్‌తో సహా ఖాళీగా ఉన్న స్టాఫంతా రూమ్‌లోకి వచ్చేశారు. నేను కూడా వేదిక దిగి ముందు వరుస బెంచీలో వాళ్ళతో కూర్చున్నాను.

సామవేదసారము... సంగీతమె సాహిత్యమెగా

దానికంత మధునామము..పాట గూర్చిపాడుమా!

పాట పూర్తయ్యేసరికి కిక్కిరిసిన క్లాస్‌రూమ్ చప్పట్లతో దద్దరిల్లిపోయింది. వెంటనే ప్రిన్సిపల్‌గారు వేదికమీదకు వచ్చి మమ్మల్ని అభినందించింది.

మాధవ్ వారానికోసారో... రెండుసార్లో కాలేజీకి వచ్చేవాడు. పెద్ద సింగర్స్‌తో కలిసి స్టేజీ ప్రోగ్రామ్స్ ఇవ్వడానికి వెళ్ళేవాడు. నెలరోజులు ఫారిన్ ట్రిప్ గడిపి వచ్చాడు.

"మాధవ్ ఇంటికి వెళ్దాం... వస్తావా! దారిలోనే ఉంది!" కాలేజీ నుండి ఇంటికి వెళ్తుంటే కళ్యాణి ప్రపోజల్ పెట్టింది.

"నేనెందుకులే!" అనలేక అనలేక అన్నాను!

"వాడెలాగూ స్టేజీ ప్రోగ్రామ్స్‌కని వెళ్ళి ఉంటాడు. వాడి అమ్మగారిని పరిచయం చేస్తాను!"

"నాకు ఎందుకు పరిచయం చేయడం?" గాభరాగా అన్నాను.

"రాధా! నువ్వు నా దగ్గర దాచకు! వాడు నిన్ను ఆరాధిస్తున్నాడు. నువ్వు వాడిని ఇష్టపడుతున్నావు. వాడి పాటకు ప్రేరణ నువ్వు! ప్రత్యక్షంగా అది ఋజువైంది. నాకు జ్ఞాపకంలేదనుకోకు!

నీ గాఢాలింగనం వాడిని పిచ్చివాడిని చేసింది! మళ్ళీ నిన్ను చూసిన తరువాతే మధుర గాయకుడుగా మారుతున్నాడు. నువ్వు వాడికి సహ ధర్మచారిణివైతే వాడు గానగంధర్వుడు అవుతాడు!" నా కళ్ళల్లోకి నిశితంగా చూసింది.

"కానీ... కళ్యాణీ! మాధవ్ కంటే నేను సంవత్సరం పెద్దదానిని!" సందేహంగా అన్నాను.

"కృష్ణుని కంటే రాధ పెద్దదే! కానీ రాధా మాధవుల జంట ప్రేమికుల కలల పంట!

రాధకు కృష్ణుడంటే ప్రాణం! మాధవ్‌కు రాధంటే ప్రాణం! ప్రాణంలో ప్రాణంగా ఆత్మలో ఆత్మలా విలీనమైపోయారు కనుకనే వారి ప్రేమతత్త్వం అమరమయింది. ప్రేమికులకు అద్భుతమైన నిర్వచనంలా మిగిలిపోయారు!" ఆవేశంగా అనేసింది.

ఇంతలో మాధవ్ ఇల్లు రానేవచ్చింది.

"పిన్ని! ఈవిడ రాధాదేవి! మా తెలుగు లెక్చరర్! నాతోబాటే కాలేజీలో జాయిన్ అయింది.మన మాధవ్ క్లాసుకు వెళుతుంది!" కళ్యాణీ నా గురించి చెప్పగానే ఆమెకు నమస్కరించకుండా ఉండలేకపోయాను.

"చక్కగా ఉన్నావమ్మా! కూర్చో! కాఫీ తెస్తాను!" ఆమె కిచెన్‌లోకి వెళ్ళిపోయింది.

కళ్యాణి నన్ను మాధవ్ రూమ్‌లోకి పట్టుకువెళ్ళింది. మాధవ్ సాధించిన ప్రైజ్‌లతో,మొమెంటోలతో నిండిపోయింది! ప్రఖ్యాత గాయనీ గాయకులు, మ్యూజిక్ డైరెక్టర్లతో తీయించుకున్న ఫొటోలు అలరించాయి! స్నాక్స్,టీలతోబాటు మాధవ్ పాటలున్న రెండు సీడీలు నాకు ఇచ్చి సెలవు తీసుకుని వచ్చేస్తుంటే ఆమె కళ్యాణితో అన్న మాటలు నాకు వినిపించకపోలేదు. "ఈ అమ్మాయి నా కోడలైతే ఎంత బాగుంటుందో?"

సరిగ్గా నెలరోజులకు నేను ఒంటరిగా లాంగ్వేజెస్ స్టాఫ్‌రూమ్‌లో ఉండగా మాధవ్ వచ్చాడు. "గుడ్ ఈవినింగ్ మేడమ్...!" మాధవ్ విష్ చేశాడు.

"గుడ్ ఈవినింగ్!" చదువుతున్న పుస్తకం పక్కన పెట్టి 'కూర్చోమని' చెప్పాను.

"మీరేమీ అనుకోనంటే... ఓ విషయం అడగాలని



ప్రజాస్వామ్యవ్యవస్థను నియంతృత్వ వ్యవస్థగా మార్చటంలో హిట్లర్, ఇందిరాగాంధీలు ఇద్దరూ ఇద్దరే.

-అరుణ్‌జైట్లీ, కేంద్రమంత్రి



అధికారంలోకి రాకముందు జి.ఎస్.టిని ఎందుకు వ్యతిరేకించిందీ బి.జె.పి. చెప్పాలి.

-పి.చిదంబరం, కాంగ్రెస్ నేత



## భయపడ్డాను

రాజస్థాన్‌లో పుట్టి, ముంబయిలో చదువుకున్న సోనాక్షిసింగ్ రావత్ 'నా లవ్ స్టోరీ'అంటూ తెలుగు వారి ముందుకువచ్చింది. ఇంతకుముందు వాణిజ్య ప్రకటనల్లో తళుక్కుమన్న తార.

"మొదటిరోజు షూటింగ్‌లో చాలా భయపడిపోయాను. సినీ బృందం అందించిన సహకారంతో త్వరగా ఇక్కడ ఇమిడిపోయాను.

తెలుగు సినీ అవకాశంవచ్చాక ఇక్కడి పరిశ్రమ గురించి తెలుసుకోవడాన్ని ఆరంభించాను. కొన్ని సినిమాలు చూశాను. ఎన్టీఆర్, అల్లుఅర్జున్‌లు అంటే ఇష్టం. డ్యాన్స్ బాగా చేస్తారు. తెలుగులో మంచి సినిమాల్లో నటించాలన్నదే నా కోరిక" అని చెప్పింది.

## నచ్చితే నటిస్తా

బుల్లితెర యాంకర్‌గా ఫేమ్ అయి, గ్లామరస్ రూపంతో ఆకట్టుకున్న అనసూయ సినిమాల్లోనూ అవకాశాలు అందుకుంటున్నది.

'రంగస్థలం'లో రంగమ్మత్త పాత్ర తర్వాత వరుస అవకాశాలు వస్తున్నాయట- ఇప్పటికే మూడు సినిమాల్లో నటిస్తోంది. "పాత్ర నచ్చితేనే సినిమా చేస్తాను. మిడిల్ ఏజ్ అని కాదు-ఎటువంటి పాత్రలోనైనా నటించడానికి సిద్ధంగావున్నాను. పాత్ర నచ్చితే తప్పకుండా నటిస్తాను" అంటున్న అనసూయ మరో అవకాశాన్నీ అందుకున్నది.



వచ్చాను!" తలదించుకునే అన్నాడు.

"ఏమీ అనుకోనులే! చెప్పు"

"ఏమీ అనుకోనంటే... ఏమీ అననంటేనే చెబుతాను" సిగ్గుపడుతున్నాడు. "సరే! అడుగు" ఏమి అడగబోతున్నాడో ఊహించాను.

"నేను మిమ్మల్ని ప్రేమించాను! పెళ్ళి చేసుకుంటాను!" గబగబా పాఠం అప్పచెప్పినట్టు అప్పచెప్పాడు. "నీకంటే నేను ఒక సంవత్సరం పెద్దదానిని!" సూటిగా అన్నాను. "రాధ మాధవుని కంటే పెద్దదే! నా పాటకు ప్రేరణ మీరు! మీరు నన్ను ఇష్టపడుతున్నారు లేకపోతే అలా కౌగిలించుకునేవారు కాదు! నాకు మీరు కావాలి!" ఆవేశంగా అన్నాడు!

ఇంతలో కళ్యాణి ప్రవేశించడంతో మాధవ్ నిష్క్రమించాడు. ఆమెతో జరిగిందంతా చెప్పాను.

నేనూ ఒక్కదానినే సంతానం! మాధవ్ ఒక్కడే కొడుకు! సంవత్సరం వయసు తేడా తప్పు కాదనడానికి అభ్యంతరం లేదనిపించింది! అందుకే ఓకే చెప్పేశాను!వేసవి సెలవుల్లో మా వివాహం జరిగిపోయింది! మా మొదటి వివాహ వార్షికోత్సవాన్ని ఆడియో కంపెనీవాళ్ళు కమర్షియల్‌గా మలచుకున్నారు. యువగాయనీ గాయకుల రసవత్తర గీతాలతో స్పాన్సర్స్ ప్రోగ్రామ్‌గా మార్చేశారు.

దాదాపు సమవయస్కులైన మ్యూజిక్ డైరెక్టర్లు, దంపతులైన గాయక, నాట్య సెలబ్రిటీలతో ప్రోగ్రామ్ వీనులవిందుగా పసందుగా ముగిసింది.

మాకై ప్రత్యేకించిన గదిని చేరుకునేసరికి రాత్రి ఒంటిగంట కావచ్చింది. గదికి ముందుంచిన హోటల్ వారి ట్యాగ్ చూసి నవ్వుకున్నాను.

'జస్ట్ మ్యారీడ్... డోంట్ డిస్టర్బ్' ఆనందం అంతరంగలో అర్ణవంలా ఉప్పొంగుతోంది. సంతోషంగా తరంగాలతో ఉవ్వెత్తున లేస్తోంది! ఆమనిలా జీవితం హాయిగా ఉందనిపిస్తోంది.

"థ్యాంక్యూ మాధవ్!" గుండెలకు హత్తుకుని పెదవులపై పెదవులుంచాను.

"ఎందుకు రాధా?" అమాయకంగా అడిగాడు.

"ఇంతటి రసవత్తరమైన, మధురాతిమధురమైన జీవితాన్ని అందించినందుకు!"

"నేను నీకు థ్యాంక్స్ చెప్పాలి! నువ్వు లేకపోతే పాటలేదు. పాటలేకపోతే నేను లేను. నేను లేకపోతే ఈ జీవితమే లేదు. అందుకే నేను పాడే ప్రతీపాటా నీకే అంకితం!"

కౌగిలిలో కరిగిపోయిన మాకు కాలమే తెలియలేదు. "ఓ పాటపాడవా! రాధా!" తేరుకున్న తరువాత కోరరాని కోరిక కోరాడు. "నేనా... పాటపాడడమా... నీముందా?" ఆశ్చర్యంగా చూశాను.

"అవును రాధా! ఆరునెలలు స్నేహం చేస్తే వారు వీరౌతారు, మన సంసారజీవితం ప్రారంభించి సంవత్సరమైంది. మంద్రంలో తాదాత్మ్యం జోడించి ఎవరు పాడినా బాగుంటుంది. నాకోసం ఓ పాట పాడవా!" గడ్డంపుచ్చుకుని బ్రతిమిలాడాడు. గొంతు సవరించుకున్నాను! మంద్రంలోనే పాడాను!

"పొదల మాటున పొంచి పొంచి... ఎదను దోచిన వేణుగానం ఒలకబోసిన రాగసుధకు... మొలకెత్తిన లలిత గీతి..."

కొద్దిపాటి రాగానికే మాధవ్ పులకించిపోయాడు. శృతి, లయబద్ధంగా తాళజ్ఞానం ఉన్న ఆ గీతానికి! "ఎవరూ లేని... యమునా తటిని... ఎక్కడో ఏకాంతమందున నీవునేనై... నేను నీవై... పరవశించే ప్రణయ గీతి... పాడమని నన్నడుగదగునా!"

"మన వివాహ వార్షికోత్సవం సందర్భంగా అమూల్యమైన బహుమతి ఇస్తున్నాను!" తనకు ఓ నిర్మాత ప్రెజెంట్ చేసిన టూ బెడ్‌రూమ్ ఫ్లాట్ కీస్" అందించాడు. వానిని గుప్పెట్లో పెట్టుకొని మాధవ్ కళ్ళలోకి చూస్తూ అన్నాను.

"నేను కూడా నీకో అపురూపమైన బహుమానం అందివ్వబోతున్నాను!"

"ఏమిటో... అది..." ఉత్సుకతగా చూశాడు.

"వేణుగానం చేయడానికి ఓ బుల్లి మాధవుడు నా కడుపులో రూపుదిద్దుకుంటున్నాడు..." ఆబగా అతడి దక్షిణహస్తాన్ని కడుపుపై ఉంచుకున్నాను.

మాధవ్ ముఖంలో పున్నమికాంతులు పదహారు కళలతో వెల్లివిరిశాయి! చల్లగాలిలో యమునాతటిపై శ్యామసుందరుని మురళీరవం మధురాతిమధురంగా వినిపించింది!



# అంతా రాజకీయమే

## 1 చివరికి వాస్తు సందేహం

గెలిచినంతకాలం ఎందుకు గెలుస్తున్నామనే ఆలోచన కలగలేదు బి.జె.పికి. అంతా తమ ప్రచారం తీరు, మోడీ ఆకర్షణతో గెలుస్తున్నామనుకున్నారు. కాని కాలం ఎప్పుడూ ఒకేలా ఒకరివైపే నిలవదు. గెలుపులు ఆగిపోయి, వరుసగా ఉపఎన్నికల ఓటములు మొదలయ్యాయి బి.జె.పికి.

గెలుపుకు చెప్పుకున్నంత సులభంగా ఓటమికి కారణాలు తెలియవు కదా. ఇప్పుడు ఓటమి ఎవరి మీద వెయ్యాలో అగ్రనాయకులకు తెలియటంలేదు. చివరికి ఆ ఓటమి భారం ఆఫీసు వాస్తుమీద వేస్తున్నారు. ఈ మధ్యనే బి.జె.పి.తన పార్టీ ప్రధాన కార్యాలయాన్ని కొత్తభవనంలోకి మార్చుకుంది.

అంతకుముందు వున్న అశోకారోడ్డులోని ఆఫీసు సరిపోవటంలేదని, సరికొత్త ఐదంతస్తుల భవనం దీన్‌దయాళ్ మార్గ్‌లో కట్టుకున్నారు. ఆ కొత్త ఆఫీసుకి వెళ్ళినప్పటినుండి ఓడిపోతున్నాం కాబట్టి దాని వాస్తు బాగోలేదని ఎవరో చెప్పారట. ఇప్పుడు వాస్తు నిపుణులను పిలిపించి వాస్తు లోపాలను సవరించి, 2019 ఎన్నికలకు వెళ్ళాలనుకుంటున్నారు. ◆

## 4 గెలుపుకు 'ఆకర్ష'

ఐదేళ్ళు పరిపాలన తర్వాత ఏ పార్టీ అయినా తాను చేసిన వాగ్దానాలు ఏమేరకు నెరవేర్చిందీ చెప్పుకోవాలి.తాము సాధించినవి చూపించి ఓటర్లను ఆకట్టుకోవాలి.

కాని తెలంగాణలో ఓటర్లను తాము నేరుగా ఆకట్టుకోలేమనే నిర్ణయానికి టి.ఆర్.ఎస్. వచ్చింది. అందుకే ఇతర పార్టీనాయకులమీద ఆకర్షణ మంత్రం ప్రయోగిస్తున్నాడు కె.సి.ఆర్.

కాంగ్రెస్, టి.డి.పిలోని నాయకులను ఒప్పించి గులాబీతోటలోకి వచ్చి నిలబడేలా చేస్తున్నాడు.

గతంలో ఎమ్.ఎల్.ఎలుగా, ఎమ్.పిలుగా ఇంకా ఇతర పదవులలో పనిచేసిన ఆ నేతలద్వారా కొన్ని సామాజిక వర్గాలను తమ పార్టీకి ఓటువేసేలా చేయించుకోవాలన్నది కె.సి.ఆర్. ఎత్తుగడ.

ఆ నాయకులు పార్టీ ఫిరాయించకపోతే ఆ వర్గాలు టి.ఆర్.ఎస్‌కి ఓటు వెయ్యవు.ముఖ్యంగా బి.సి. వర్గాల ఓట్లు రావనుకుని, ఆ వర్గాల నాయకులమీద ఆకర్ష మంత్రాలు తీవ్రంగా ప్రయోగిస్తున్నారు.

ఇప్పటికే నాగేందర్ వంటి నేతలు ఆ ఆకర్షణకు పడిపోయారు. ఎన్నికల్లోగా ఇంకా ఎందరు నేతలు ఆకర్షితులవుతారో లెక్కపెట్టటం కష్టం. ◆

## 5 ఎదురు తగులుతాయి

ఆంధ్రకు అన్యాయం చేసింది విభజన అనే దానిమీద ఏకాభిప్రాయం వుంది. కాని ఆ అన్యాయం చక్కదిద్దటంలో రాష్ట్రంలోని పార్టీలలో ఏకాభిప్రాయం లేదు.

న్యాయం మేము మాత్రమే చెయ్యగలమని ఏ పార్టీకి ఆ పార్టీ అనుకోవటంవల్లనే ప్రతి అభివృద్ధి అంశం రాజకీయమవుతోంది.

కడప ఉక్కు ఫ్యాక్టరీ ఉద్యమం, నిరాహారదీక్షలు అన్నీ రాజకీయపరమైనవే. ఒక పార్టీ అధికారంలో వున్నప్పుడు మరో పార్టీ అడ్డుకుంటుంది.కడప ఉక్కు హక్కు అనే తెలుగుదేశం పార్టీ గతంలో కడప ఉక్కు ఫ్యాక్టరీ పెడితే అక్కడి పర్యావరణం మొత్తం దెబ్బ తింటుంది అంటూ నానా హడావుడీ చేసింది.

ఇప్పుడు ఆ ఫ్యాక్టరీ పెట్టకపోతే ఎలా అంటుంది! ప్రైవేట్‌రంగంవారిని తెస్తే ఊరుకోం అంటారు. మరో ప్రైవేట్ కంపెనీని తెచ్చి కడపలో పెట్టాలన్న యత్నం రహస్యంగా చేస్తారు.

ఎలాగైనా రాజకీయంగా పైచేయి సాధించాలన్న తపనే తెలుగుదేశానిది.

దీనివల్ల ప్రతి పార్టీ గత చరిత్ర తవ్వి బయటకు తీయాల్సివస్తోంది. ఆ గతచరిత్రలో అన్ని పార్టీలకు ఎదురుదెబ్బలు రానున్నాయి.ఆంధ్ర ప్రజలు మాత్రం అభివృద్ధికి నోచుకోరు. ◆

## 2 కాంగ్రెస్... అజాద్ కాశ్మీర్

జమ్మూ-కాశ్మీర్ రావణాసురకాష్టంగా మారటానికి కారణం 1947లో కాంగ్రెస్ అనుసరించిన విధానం. నాటినుండి నేటివరకు కాశ్మీర్‌ని పరిష్కారం లేని సమస్యగా నిలిపింది కాంగ్రెస్ పార్టీనే.

ఆ సమస్యను తాము పరిష్కరించరు. ఇతర పార్టీలు ఏవైనా భిన్నమార్గంలో పరిష్కరిద్దామనుకుంటే వారికి సహకరించరు.

ఎవరు ఏ కొత్త పద్ధతిలో పరిష్కరిస్తామన్నా దానిని వ్యతిరేకించటం, పాకిస్తాన్‌కి అనుకూలంగా ప్రకటనలు చెయ్యటం కాంగ్రెస్ నేతలు చేసే పని.

గత ఏడు దశాబ్దాలుగా అదే కాంగ్రెస్ విధానం. సమస్య ఎంత జటిలమవుతున్నా, ఎన్నో విలువైన ప్రాణాలు పోతున్నావారి ఆలోచనలు మారవు.

అందుకు సాక్ష్యం తాజాగా ఆ పార్టీ నేత సైఫుద్దీన్ సోజ్ ఇటీవల చేసిన ప్రకటన.

జె & కె ప్రభుత్వం పతనమై రాష్ట్రం రాష్ట్రపతి పాలనలోకి వెళ్ళగానే సైఫుద్దీన్ సోజ్ కాశ్మీరీలు స్వతంత్రం కోరుకుంటున్నారని ప్రకటించాడు. ఎవరి నుండి స్వాతంత్ర్యం! అదెలా సాధ్యం! అనే ఆలోచన ఆ కాంగ్రెస్ నేతకు లేదు.

మీ దేశ నేతే అజాద్ కాశ్మీర్ అంటున్నారు కదా అంటుంది పాకిస్తాన్.మణిశంకర్ అయ్యర్ పద్ధతిలోనే సైఫుద్దీన్ సోజ్‌ని కాంగ్రెస్ పార్టీ వాడుకుంటున్నది మైనారిటీ ఓటుబ్యాంక్ కోసం. ◆

## 3 హిందీ మమత

థర్డ్ ఫ్రంట్ అసలు రూపుదిద్దుకుంటుందో, ఒకవేళ రూపుదిద్దుకున్నా గెలుస్తుందో లేదో తెలియదు కాని థర్డ్ ఫ్రంట్ తరఫున తానే ప్రధాన మంత్రి అభ్యర్థిని అనే సంకేతాలు బెంగాల్ ముఖ్య మంత్రి మమతా బెనర్జీ ఇస్తోంది.

అందుకే ఇప్పుడు మమతా బెనర్జీ మీడియా ముందుకు వచ్చినప్పుడు హిందీలో మాట్లాడుతోంది. ముఖ్యంగా నరేంద్రమోడీమీద వ్యక్తిగతంగా,ఎన్.డి.ఎ. ప్రభుత్వ విధానాలమీద విమర్శలు చెయ్యాలంటే హిందీని మాత్రమే ఎంచుకుంటున్నది.

ఇంతకు ముందు కలకత్తాలో వుండగా బెంగాలీ తప్పించి మరొక భాషమాట్లాడేది కాదు.కాని ఇప్పుడు నేషనల్ మీడియాతో కలకత్తాలో మాట్లాడినా హిందీలోనే మాటలు. ఢిల్లీలో పెత్తనం చెయ్యాలంటే హిందీ భాషమీద పట్టు అవసరం. ఆ పట్టు తాను సాధించానన్న విషయం తెలియచెప్పేందుకే మమత హిందీ మీద వల్లమాలిన ప్రేమ కురిపిస్తోంది. ◆

## 6 ముందస్తు సందడి

ముందస్తు ఎన్నికలు వస్తాయో లేదో తెలియదుగాని ప్రధాని నరేంద్ర మోడీ నీతీ ఆయోగ్ మీటింగ్‌లో ప్రస్తావించిన జమిలి ఎన్నికల ప్రతిపాదనను ప్రాంతీయ పార్టీ నేతలు ఆయుధంగా వాడుకుంటున్నారు. ఇప్పుడు ప్రతి ప్రాంతీయ పార్టీ నేత కార్యకర్తలకు ముందస్తు హెచ్చరికలు చేస్తున్నారు.

కార్యకర్తలు, చోటా మోటా నాయకులందరికీ ప్రత్యక్షంగా, వీడియో కాన్ఫరెన్సింగ్ ద్వారా ముందస్తు కొరడా కొడుతున్నారు.

అందరూ సిద్ధంగా వుండాలి. ఏ క్షణంలో అయినా ఎన్నికల ప్రకటన రావచ్చు జాగ్రత్త అంటున్నారు. ఇదంతా పార్టీ యంత్రాంగాన్ని అప్రమత్తం చెయ్యటం కోసమే అన్న సంగతి తెలిసిందే.

తమాషా ఏమిటంటే అధికారంలో వున్న టి.డి.పి., టి.ఆర్.ఎస్. పార్టీల నేతలు చంద్రబాబు నాయుడు, కె.సి.ఆర్‌లు తప్పించి మిగిలిన పార్టీల వారెవరిలోనూ ఈ ముందస్తు హడావుడి కనిపించటంలేదు. అధికారం నిలబెట్టుకోవటం వారికి అంత అవసరం.

అందుకే పట్టును ఏమాత్రం వదులుకోదలచుకోవటంలేదు ఆ ఇద్దరు నేతలు.





# నా నీతో నిత్య

ఒక కూతురు, తల్లిని బ్రతికించుకునేందుకు
ఏ కూతురూ చేయని త్యాగం చేస్తుంటే,
మరో తల్లి తన ఏకైక కుమారుడ్ని మామూలు మనిషిని
చేసేందుకు పడే తపన అనిర్వచనీయం!
వాళ్ళిద్దరి మధ్య ఒప్పందం కుదిరితే ఆ యువతి తల్లి బతుకుతుంది
ఆ మరో తల్లి కొడుకు మామూలు మనిషవుతాడు!
కానీ ఆ ఒప్పందమే క్రిటికలయ్యేసరికి ఆ ఇద్దరూ ఆలోచనలో పడ్డారు
ఆ తర్వాత ఏం జరిగిందో తెలియాలంటే

## సాయిరాం ఆకుండి

సెన్సేషనల్ సీరియల్

చదవండి

వచ్చేవారమే ప్రారంభం!

# మానసిక బలం



ఇంతకుముందుతరాలు ఎదిగిన తీరూతెన్నులకు నేటిపరిస్థితి పూర్తిగా భిన్న మయినది. నేటితరం పిల్లలకు ముందుతరాలవారి ఊహలకు సైతం అందనంతటి సౌకర్యాలున్నాయి. వాటితోపాటు వారికి పోటీకూడా ఎక్కువ.

స్కూల్లో వేసినదగ్గరనుంచి ప్రతి దశలోనూ వారు ఏదో ఒక విధంగా పోటీ ఎదుర్కొంటూనే వుంటారు. ఈ క్రమంలో వైఫల్యాలూ సహజమే.

వాటిని ఎదుర్కోవాలంటే వారిలో మానసికంగా దృఢత్వధోరణి వుండితీరాలి.

బాగా చదువుతారు, అన్ని వనరులూ అందుబాటులో వున్నాయి, అంతులేనంత ప్రతిభ వుంది, నైపుణ్యాలూ ఎన్నో ఉన్నాయి-అని పిల్లల గురించి గర్వంగా చెప్పుకుంటాము.కాని అద్భుతమైన భవిష్యత్తుకు ఇవన్నీ ఉన్నంతమాత్రాన సరిపోదు.

భవిష్యత్తు విజయవంతంగా సాగాలన్నా, తనలోని సకలసామర్థ్యాలకు సానపెట్టాలన్నా, వీటి నడుమ తలెత్తే ఒత్తిళ్ళను, వైఫల్యాలను ఎదుర్కోవాలన్నా వారికి అందుకు తగిన మానసిక బలం వుండి తీరాలి. ఆ దిశగా అంటూ పిల్లల్లో మానసిక దృఢత్వాన్ని పెంచే దిశగా తల్లిదండ్రులు కొన్ని చర్యల్ని తప్పనిసరిగా చేపట్టాలి.

జీవనగమనంలో వైఫల్యాల తీరూతెన్నూ పిల్లలకు అర్థం అయినా, కష్టపడినా కొన్ని విషయాలు వారికి అనుకూల మార్గాన్ని ఇవ్వలేకపోతాయి. ఇటువంటి సందర్భాలలో పిల్లల్లో అనుకూల దృక్పథాన్ని పెంచాల్సిన బాధ్యత, మెంటల్ మేకప్ అభివృద్ధి చేయాల్సిన పనితనం తల్లిదండ్రులపై ఆధారపడివుంటుంది.

## సాధించే విజయాలపట్ల

విజయం సాధించడానికి అందుబాటులోగల అవకాశాలను మెరుగుపరుచుకునేందుకు వారిని ప్రోత్సహిస్తుండాలి. ఒకవేళ వైఫల్యాలు, ఓటములు ఎదురైతే వాటినుంచి మరిన్ని విషయాలు నేర్చుకుని, మరింత కష్టపడగల అనుకూల వైఖరిని వారిలో నూరిపోయాలి. దీర్ఘకాలంలో సాధించే విజయాలపట్ల ఆశావహంగా సాగేలా చేయూత ఇవ్వాలి.

ఏ వైఫల్యం ఎదురైనా దానికి పిల్లల్ని దోషులుగా చెయ్యకూడదు. వారికి అటువంటి అభిప్రాయం కలిగేవిధంగా సైతం మాట్లాడకూడదు.పరిస్థితి సానుకూలంగా లేదంటూ గట్టిగా ఏడ్చేసేపరిస్థితిని రానీయవద్దు. ఏదైనా చెడ్డ నిర్ణయం తీసుకున్నప్పుడు,ఫలితం సరిగ్గా లేనప్పుడు అది అలా తనవల్లే జరిగిందంటూ దోషిని చేసి మాట్లాడనేకూడదు.

తన అంత బాగా చదవకపోయినా మరో విద్యార్థికి తనకంటే ఓ సబ్జెక్టులో మార్కులుతక్కువ వచ్చినంతమాత్రాన తప్పులేదని వివరించాలి. స్కూల్లో పెద్దగా తెలియని పిల్లలకంటే తక్కువమంది స్నేహితులు ఉన్నంతమాత్రాన తక్కువవాడు కాదని తెలియజెప్పాలి. టీచర్లు, ఇతరులపట్ల ఫేవర్ చేస్తున్నంత మాత్రాన బాధితుడు కాదని వివరించాలి.

ఏ పనికైనా తగిన ప్రయత్నాలు అవసరమని, అందుకోసం చొరవ చూపాలని, తమమార్గంలో



## బాధ్యత ప్రాముఖ్యం

ప్రతి విషయానికీ బాధ్యత వహించే తత్వం పిల్లల్లో మానసిక దృఢత్వాన్ని సమకూర్చుతుంది. పిల్లలకు పనులు అప్పగిస్తే, ఆలస్యంగా చేస్తారు. సరిగ్గా చెయ్యకపోవచ్చుకూడా అనుకుంటూ వారికి ఏదీ చెప్పకపోతే వారిలో బాధ్యతాయుత ధోరణి ఏర్పడదు. పనులు తప్పించుకోగల బాధ్యతారాహిత్యం ఏర్పడుతుంది.

కేర్‌ఫ్రీ బాల్యాన్ని పిల్లలకు అందిస్తున్నామనుకుంటారు కాని, దీనివల్ల వారిలో బాధ్యత బీజాలు పడవని అర్థంచేసుకోలేకపోతుంటారు. చిన్నప్పటినుంచి వారి వయస్సుకు తగినట్లుగా పనులు అప్పగిస్తుండాలి.

అలా వయస్సుకు తగినట్లు పనులు చేయడంవల్ల వారికి భారంగావుండదు.

తాము బరువు మోస్తున్నామన్న భావం వారిలో తలెత్తదు. పైగా పనులు అప్పగించారన్న బాధ్యత పెరుగుతుంది. ఎదిగేకొద్దీ బాధ్యతగల వారిగా తయారవుతారు.



లభించిన అవకాశాలను అందిపుచ్చుకోవాలని, ఒక వేళ అనుకున్నది సాధించలేకపోయినా,కోరిన ఫలితం దక్కకపోయినా నిరాశ చెందక, సదరు పరిస్థితిని అధిగమించే ప్రయత్నంచేయాలని వారికి అమ్మా నాన్నలు వివరించాలి.

తిరస్కారం, వైఫల్యం, అన్యాయంవంటివన్నీ జీవితంలో ఎదిగే క్రమంలో భాగంఅని వారికి బోధించాలి. మానసికంగా పిల్లల్ని దృఢంగా తీర్చిదిద్దేక్రమంలో కరుణతో, జాలితో ఇచ్చే పిల్లల పార్టీలకు చెల్లుచీటీ చెప్పాలి.వారిమార్గంలో ఎన్నివైఫల్యాలు, తిరస్కారాలు ఎదురైనా ఎప్పుడూ అనుకూల చర్యలతోనే సాగాలని వారికి పదేపదే తెలియజెప్పుండాలి.

అన్యాయాలన్నవి ఒక్కోసారి ఎదురవుతాయన్న అవగాహన వారికి ఉండాలి.

## అపరాధ తాయిలాలు వద్దు

అనేకమంది తల్లిదండ్రులు ఎన్నో సందర్భాలలో అపరాధభావానికి గురవుతుంటారు. తాము తమ పనులరీత్యా పిల్లలతో సరిగ్గా మాట్లాడలేకపోతున్నామనో, వారితో ఎక్కువ సమయం గడపలేకపోతున్నామనో అపరాధభావంతో ఫీలవుతూ ఏదో ఒక రకంగా దాన్ని భర్తీచేయాలని భావిస్తుంటారు.

పిల్లలు ఏవైనా కోరినప్పుడు విషయాలు వివరించే బదులు, ఖరీదైన బహుమతులు కొనిస్తుంటారు. కఠినంగా వ్యవహరించాల్సిన సందర్భాల్లోసైతం మెతక వైఖరి అనుసరిస్తుంటారు. ఇటువంటి ప్రవర్తన పిల్లల్ని బలహీనపరుస్తుంది.

కాబట్టి తల్లిదండ్రులు ఇటువంటి పరిస్థితులను సమర్థవంతంగా ఎలా ఎదుర్కోవాలో ఆలోచించాలి తప్ప, తమకు తాము గిల్టీగా ఫీలయి ఇంకోవిధంగా లోటు భర్తీ చేయాలని అనుకోకూడదు.

ఇటువంటి అపరాధభావంతో అమ్మానాన్నలు చేసే పనులు పిల్లలకు మరోవిధంగా సంజ్ఞలు ఇస్తాయి. గిల్టీగా ఫీలవడంలో తప్పులేదని,అదేపద్ధతిలో తామూ వ్యవహరించవచ్చని భావిస్తారు. ఇటువంటి పరిస్థితి పిల్లల్లో ఎటువంటి మార్పు తెస్తుంది?వాళ్ళు తమకు కావాల్సిన దానికోసం ఎమోషనల్ బ్లాక్‌మెయిల్‌కు దిగుతారు. తప్పులు అనేవి జరుగుతాయని, మన స్పర్థలు, విభిన్న అభిప్రాయాలన్నవి కూడా సహజమని పిల్లలకు సోదాహరణంగా తెలియజెప్పాలి.

అపరాధభావం అన్నది సహజ దృక్పథమని, కాని అదే భావాన్ని కొనసాగించడమెంత మాత్రం మంచిది కాదని స్పష్టంగా తెలియజేయాలి.

## వారే ప్రపంచమా?

పిల్లలు జీవితంలో అంతర్భాగం. వారు లేని జీవితం లేకపోవచ్చు. కాని, వారితోపాటు ఇతరత్రా జీవితమూ వుండి ఉంటుంది. కొందరు తల్లిదండ్రులు తమ జీవితాన్ని పిల్లల చుట్టూనే తిప్పేస్తుంటారు. వారే లోకం అన్నట్లుంటారు. పిల్లలకు సంబంధించిన ప్రతి చిన్న పనినీ తమ భుజాలపై వేసుకుంటుంటారు. ఎవరి పనులు వారికి వుంటాయి.

## వైఫల్యాలకు అవకాశం

వారు అస్సలు నొచ్చుకోకుండా వారికి గూడు మాదిరి ఎన్నాళ్ళు పరిరక్షిస్తారు? తనకు తాను పనులు చేయడం నేర్పించాలి. నడక నేర్పిస్తాం, ఆ నేర్చుకోవడంలో తప్పటడుగులు వుంటాయి, కొన్నిసార్లు పడిపోతారు. వాళ్ళేలేస్తారు.

దెబ్బతగిలితే ఏడుస్తారు. అలా అని నడక మాన్పించరు కదా.నడక నేర్చేశాక పిల్లలు పరుగెత్తుతారు. పడతారు. మళ్ళీ దెబ్బలు. ఐనా ప్రయత్నం ఆగదు. అంటే అభ్యాస ప్రక్రియలో పడిపోవడమన్నది అతిసహజం.పిల్లల్ని ఓ పరిరక్షణా వలయంలో వుంచి అనుక్షణం కాచుకుని వుంటే జీవితం ఆందోళనమయం అయిపోతుంది.

ఎవరి షెడ్యూల్స్,ఎవరి లక్ష్యాలు వారికి వుంటాయి. ఇది పిల్లలకు తెలియాల్సిన అంశం.అన్నీ తామే అయిపోతే వారిలో స్వతంత్ర వైఖరి లోపించి, ఆధారపడే తత్వం అలవడుతుంది. స్వంతంగా పనులు చెయ్యలేరు, స్వయంగా నిర్ణయాలూ తీసుకోలేరు. ఇదో మానసిక బలహీనత అయిపోతుంది.

ఫలానా పరిస్థితినుంచి నేనెలా ప్రయోజనాన్ని పొందగలను అన్న ఆలోచన స్థానే ఆ పరిస్థితినుంచి ఎలా బయటపడాలి, ఎలా ఎదుర్కోవాలి అన్న దృక్పథం కావాలి. కాబట్టి పిల్లలకు సంబంధించిన పనులు అన్నింటినీ నేరుగా చేసే బదులు దైనందిన కార్యక్రమాల్లో వారినీ భాగస్వామ్యం చేయాలి.

ఉదాహరణకు ఇంట్లో వారెన్నో పనులుచేసే వీలు ఉంటుంది. ఇల్లు క్లీన్‌చేయడంలో సాయం చేయడం, టేబుల్ సర్దడం, దుమ్ముదులపడంవంటి అనేకానేక పనుల్లో వారిని భాగం చేస్తుండాలి.

వారికంటూ ఓ షెడ్యూల్ ఇవ్వనక్కర్లేదు. అవసరాన్ని బట్టి,పరిస్థితిని అనుసరించి మార్పులు చేర్పులతో పనులను సాగించాలని వివరించాలి.అది పనులైనా,టీ.వీ. చూసే సమయమైనా,తమ గదిని, ఆహారాన్ని పంచుకునే విషయమైనా సరే. అంటే తమకు కావాల్సినవాటిని డిమాండ్‌చేసే బదులు, తామూ భాగమై స్వయంగా సాధించుకోవాలన్న గుణాన్ని వారికి అలవరచాలన్నమాట.

## క్రమశిక్షణ, శిక్ష

క్రమశిక్షణ వేరు, శిక్షించడం వేరు. క్రమశిక్షణ పేరిట పిల్లల్ని శిక్షిస్తుంటే వారిలో ఆత్మస్థైర్యం సంగతలా వుంచి ఆత్మన్యూనతాభావం ఏర్పడుతుంది. తప్పులకు సఫరవడం శిక్ష. కాని క్రమశిక్షణ అంటే మంచి భవిష్యత్తుకోసం వేసే అడుగులు.

పనిష్మెంట్ల భయంతో పిల్లల్ని పెంచడం అంటే క్రమశిక్షణతో పెంచడంలాంటిది కాదు. క్రమశిక్షణతో పెరిగిన పిల్లలు మంచి నిర్ణయాలు, ఛాయిస్‌లు తీసుకోగలుగుతారు.

భయంతో పెరిగే పిల్లలు ఇటువంటి ఛాయిస్ తీసుకోగల ధైర్యం చెయ్యలేరు. పిల్లల్లో వ్యక్తిగతంగా క్రమశిక్షణ నేర్చుకునే నైజాన్ని అలవరచగలగాలి. తాము దగ్గర లేకపోయినా,చక్కని నిర్ణయాలుతీసుకోగల క్రమశిక్షణ అందివ్వడంలో తల్లిదండ్రులు ముందుండాలికాని, పనిష్మెంట్లివ్వడంలో కాదు.

వెలుపల ప్రపంచాన్ని చూడడంవల్ల ఆత్మవిశ్వాసం మరింతగా పెరుగుతుంది. అంటే సౌకర్యం కంటే ఎక్స్‌పోజర్ ముఖ్యం. ఆటలు వాళ్ళకెన్నో నేర్పుతాయి. 'ఏమవుతుందో' అన్న భయాన్ని వారికి దూరంగా వుంచాలి.

కంఫర్ట్‌జోన్ అనేది సురక్షితంగా వుంచవచ్చు కాని సందేహాత్మకంగా తీర్చుతుంది.

వైఫల్యం తర్వాత ఎలా నిలదొక్కుకోగలిగారన్న విషయంలో పిల్లలకు ఇంట్లోని పెద్దవాళ్ళే రోల్ మోడల్స్ కావాలి. భయాలను దూరంగావుంచితే, పిల్లలు ధైర్యంగా ఎదుగుతారు. కంఫర్ట్‌జోన్‌నుంచి వాళ్ళను వెలుపలకు తీసుకురావడంద్వారా భయాలను ఎదుర్కోగల శక్తిని అందించాలి.

## విలువలు

జీవితంలోని రోజువారి పనుల్లో నిమగ్నమైన పెద్దవాళ్ళు పిల్లలకు ముఖ్యమైన విలువల ప్రాముఖ్యాన్ని వివరించడాన్ని విస్మరిస్తుంటారు. జీవితంలోని విలువలు, ప్రాధాన్యాల విషయంలో ఖచ్చితత్వాన్ని వారికి అవగతం చేయాలి. అర్థవంతమైన జీవితాన్ని గడిపే బలాన్ని వారికి ఇవ్వాలి.

'పేరెంటింగ్' అనేది చెప్పుకోవడానికి సులువుగా ఉండవచ్చు కాని, ఆచరణలో అనేక కష్టాల్ని ఎదుర్కోవాల్సివుంటుంది. ఈ నిబంధనలను పిల్లల పెంపకంలో మనస్సులో పెట్టుకుంటే వారిని తెలివితేటలతో, ఆత్మవిశ్వాసంతో చక్కని పౌరులుగా తీర్చగలరు. వారికి మంచిచెడుల విచక్షణ బాగా తెలుస్తుంది. ఈ విచక్షణ వుంటే జీవితంలో వారు విజయులే అవుతారు.

టి.నీలిమ



# పరదేశీ ప్రేమకథ



గొర్లి శ్రీనివాసరావు
Cell : 9163340600

"ఆమదర్ శాంతి..ని...కేతన్... ఆ... ఆ... ఆ.... అమదర్ శాంతి... ని...కేతన్... సె జె షాబ్ హోతె అపాన్... అమదర్ షాబ్ హోతె అపాన్. అమదర్ శాంతి..ని...కేతన్... ఆ... ఆ... ఆ... అమదర్ శాంతి... ని..కేతన్..." బెంగాలీ పాట శ్రావ్యంగా వినిపిస్తోంది.

ఎత్తుగా పెరిగిన చెట్ల కొమ్మల సందుల్లోనుంచి సూర్యకిరణాలు ఏటవాలుగా పడి భూదేవిని వెచ్చగా ముద్దాడుతున్నాయి. తెల్లటి బట్టలు ధరించిన ఆశ్రమిక్‌లు ఉదయకాలపు ప్రార్థనలో మనసుని నిమగ్నం చేశారు. ఏక కంఠంతో వారు గానంచేసే ప్రార్థనాగీతం ప్రకృతిని పలకరిస్తోంది.

ఆ గీతాన్ని టాగోర్ విశ్వభారతి కోసం రచించాడట. విశ్వభారతి శాంతికేతన్‌లో ఉన్న విశ్వవిద్యాలయం.

శాంతినికేతన్‌లోని ఆశ్రమిక్‌లందరూ తాము ఒక గొప్ప విశ్వవిద్యాలయానికి చెందినవారమనే స్ఫూర్తి హృదయాల్లో నింపుకోడానికి తను రచించిన ప్రార్థనా గీతం పనికివస్తుందని ఆయన ఉద్దేశ్యం కాబోలు!

ఆశ్రమిక్‌లు అంతా క్రమపద్ధతిలో నుంచున్నారు. ప్రఫుల్ తన వరసలో చిట్టచివర నుంచున్నాడు పెదాలు కదిపైనా పాటను గానం చేస్తున్నట్లు నటిద్దామంటే ఆ పాట వినడం అదే మొదటిసారి అతనికి.

అందులోనూ అతనికి బెంగాలీ ఉచ్చారణ ఇంకా పట్టుబడటానికి సావకాశం లేదు, ఎందుకంటే అదే అక్కడ అతని మొదటిరోజు! అందరూ చేతులు జోడించి తన్మయత్వంతో గానం చేస్తుంటే అతను చేతులు కట్టుకుని దిక్కులు చూడసాగాడు. అప్పుడు కనిపించింది అతనివంక ఉరిమి చూస్తున్న బెంగాలీ సుందరి.

పెద్ద పెద్ద కళ్ళతో కోపాన్ని అభినయిస్తూ అతనికి ఏదో సైగ చేయసాగింది. కనుబొమలు పైకెత్తి 'ఏమిటి' అన్నట్లు చూశాడు.

తన చేతులను కళ్ళతో చూపించి అతనివైపు ఒక కోపపు చూపు విసిరింది. వెంటనే అతనికి అర్థమైంది, తనను చేతులు జోడించమంటోందని.

వెంటనే అతను కూడా చేతులు జోడించి తన్మయత్వంతో ఉన్నట్లు కళ్ళు అరమూసి తలను అటూ ఇటూ తిప్పసాగాడు మెల్లగా.

కొంచెంసేపు అలా జరిగిన తర్వాత ఆమె శాంతించిందా! లేదా! అని చూడడానికి ఓ కన్ను తెరిచి ఆమె వైపు దొంగచూపు ఒకటి చూశాడు.

ఆమె అతన్నే గమనిస్తున్నట్లుంది, అతని దొంగ చూపు పసికట్టి కిసుక్కున నవ్వి మళ్ళీ గంభీరంగా పాటలో మునిగిపోయింది... కానీ అప్పటికే అతని హృదయానికి డ్యామేజీ జరిగిపోయింది.

ఆమె నవ్వు అతని గుండెలను తాకి మధురమైన గాయం చేసింది. ప్రార్థనాగీతం అయిపోయిన తర్వాత ఆశ్రమిక్‌లు అందరూ తమ తమ క్లాసులవైపుకి వెళ్తున్నారు.

ఆ గుంపుని తప్పించుకుని ఆ సుందరి వైపు వెళ్ళి మాట కలుపుదామనుకున్నాడు ప్రఫుల్. కాని అతని ఆలోచనలకి బ్రేక్ వేస్తూ అతని చెయ్యి దొరకపుచ్చుకుని ఆఫీసుకు



వెంటబెట్టుకుని తీసుకెళ్ళాడు బెనర్జీ. అతను ప్రఫుల్‌కి ఫైన్ ఆర్ట్స్‌లో పాఠాలు చెప్పబోయే గురువు.

బెనర్జీ గనుక కొంచెం అవకాశం ఇస్తే ఆ బెంగాలీ సుందరిని పరిచయం చేసుకునివద్దామనుకున్నాడు ప్రఫుల్. కానీ ఆ బెంగాలీ 'మోషె' అతనికి అవకాశం ఇస్తేనా! 'కమ్ మిస్టర్ రాబ్' అంటూ అతన్ని బలవంతంగా చెయ్యి పట్టుకుని గుంజుకుంటూ వెళ్ళిపోయాడు. ఈ రాబ్ ఏమిటి మధ్యలో, ఓహో రావుకి వచ్చిన తిప్పలా అనుకుని విషాదంగా నవ్వుకున్నాడు ప్రఫుల్ రావు. 'నన్ను ఓ క్షణం వదిలిపెట్టరా నాయనా, నీ కాళ్ళకు నమస్కారం' అంటూ తన ప్రయత్నలోపం లేకుండా ఇంగ్లీషులోనూ, హిందీలోనూ చెప్పాడు.

అతని ఉచ్చారణ బెనర్జీకి అంతుపట్టినట్లు లేదు. అయినా మర్యాద మేళవించిన చూపుతో అతన్ని నవ్వుతూ పరికించి, 'ఓకె, ఓకె' అంటూ మరింత వేగంగా లాక్కుపోయాడు.

అతని వెంట లాక్కునిపోబడుతూనే, వెనక్కి తిరిగి చూశాడు ప్రఫుల్, తన బెంగాలీ సుందరి కోసం. ఆమె బూరెల్లాంటి బుగ్గలతో నవ్వుతూ మాట్లాడుతూ ఉంది తన స్నేహితురాలితో.

తెల్లటి చీరను బెంగాలీ స్టైల్‌లో కట్టింది. ఆ చీరకు ఉన్న ఎర్రటి అంచు భలే అందంగా అమరింది. పొడవాటి చేతులతో ఉన్న ఆమె ఎర్రటి బ్లౌజ్ అదనపు ఆకర్షణగా ఉంది. ఆమె కుడి మణికట్టుకి నల్లటి స్ట్రాప్ ఉన్న చిన్నగడియారం ఉంది.

ఆమె గడియారంవైపు ఒకసారి చూసి చిన్నగా తలపై కొట్టుకుని స్నేహితురాలితో ఏదోచెప్పి వెళ్ళిపోయింది. వెళ్తూ వెళ్తూ కసాయివాడు ఈడ్చుకుపోతున్న బకరాలా ఉన్న అతనివైపు ఒక అందమైన దరహాసపు చూపు విసిరి వెళ్ళింది.

అతని గుండెకు మరో దెబ్బ తగిలేసరికి అది తీయుగా మూలిగింది...! 'సరేలే, నేను ఇక్కడేగా ఉండేది. నాకు దొరకకుండా ఎలా తప్పించుకుంటుంది లే' అనుకుని తనను లాక్కుపోతున్న బెంగాలీ బాబుని అనుసరించాడు ప్రఫుల్.

విశ్వభారతిలో చేరాలని, ఫైన్ ఆర్ట్స్ కోర్సులో ఒక డిప్లొమా సంపాదించాలని ప్రఫుల్‌కు ఎప్పటి నుంచో కోరిక. అతను ఫైన్ ఆర్ట్స్‌లో గ్రాడ్యుయేషన్ చేశాడు, బెనారస్ హిందూ యూనివర్సిటీనుంచి.

అప్పట్లో అతనికి చిత్రలేఖనం ఒక ముఖ్యమైన హాబీగా ఉండేది. దానిలో డిప్లొమా కోర్సు చేయడానికి దేశంలోని అనేక యూనివర్సిటీలను వడబోశాడు.

వాటిల్లో అతని దృష్టిని విశేషంగా ఆకర్షించింది విశ్వభారతి యూనివర్సిటీ. రబీంద్రనాథ్ ఠాగోర్ నెలకొల్పిన శాంతినికేతన్ విశ్వవిఖ్యాతి కలది. దాని గురించి అతను ఎన్నో విన్నాడు.

అందుకే ఇక్కడ విద్యాభ్యాసంలో ఉండే గొప్పదనాన్ని నేరుగా చూసి ఆస్వాదించే అవకాశం రావడం తన అదృష్టంగా భావించాడు. కాని విశ్వభారతిలో అడ్మిషన్‌కోసం ప్రయత్నిస్తున్నప్పుడు అతనికి ఎన్నో ఆందోళన కలిగించే విశేషాలు తెలిశాయి.

బోల్‌పూర్ గ్రామాన్ని ఆనుకుని ఉన్న శాంతినికేతన్ బయటకు కనిపించేటంత శాంతి నిలయం కాదని, ఎప్పుడూ ఏవో అల్లర్లు, జరుగుతుంటాయని తెలిసి ఆశ్చర్యపోయాడు. ఆ అల్లర్లు జరగడానికి ముఖ్య కారణం ఆశ్రమిక్‌లు అని వినేసరికి ఆ ఆశ్చర్యం రెట్టింపు అయింది.

విశ్వభారతి యూనివర్సిటీలో చదువుకునే విద్యార్థులను 'ఆశ్రమిక్'లు అంటారు.

ఒకప్పుడు శాంతినికేతన్ ప్రపంచదేశాల్లో గొప్ప పేరు సంపాదించుకోవాలని, విశ్వంలోని విద్యాలయాలన్నిటిలోనూ తలమానికంగా నిలవాలని ఆశించిన గురుదేవ్ ఠాగోర్ ఆశయాలకు విరుద్ధంగా ఈనాడు విశ్వభారతి విశ్వవిద్యాలయం ప్రమాణాలపరంగానేగాక అనేక విధాలుగా దిగజారిందనే వార్తలు వినవచ్చాయి.

అయినాగాని వాటిని పట్టించుకోకుండా శాంతినికేతన్‌కి ప్రఫుల్ రావడానికి కారణం అతని తల్లి భారతి. ఆమెకు శరత్ సాహిత్యం అంటే చాలా ఇష్టం. ఆ ఇష్టంవల్లే ఆమె బెంగాలీ పేరులా అనిపించే 'ప్రఫుల్ల చంద్ర' అనే పేరు పెట్టింది తన ఒక్కగానొక్క కొడుక్కి. దానికి 'రావు' అని తగిలించాడు వాళ్ళ నాన్న మదన్‌మోహన్, తన తండ్రి పేరు సూర్యారావులో కొంతైనా వాడుదామని.

అయితే మరీ పాతకాలం పేరులా ఉంది అని దాన్ని మధ్య కట్‌చేసి మడతెట్టి ఇలా ప్రఫుల్ రావు అని ఉంచాడు. తల్లికి బెంగాలీ సంస్కృతిపై ఉన్న అభిమానం అతన్ని ఇలా శాంతినికేతన్‌వైపుకి నడిపించింది అనడంలో అతిశయోక్తి లేదు.

బెనర్జీ గబగబా నడుచుకుంటూ వెళ్ళి ప్రఫుల్‌ని విశ్వభారతి అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసులోకి తీసుకెళ్ళాడు. మొదటి అంతస్తులో ఉన్న ఫైన్ ఆర్ట్స్ హెడ్ దగ్గరకు ప్రఫుల్‌ని తీసుకెళ్ళి అతని ముందు ఎల్.కె.జి పిల్లాడిని నుంచోబెట్టినట్లు నిలబెట్టాడు.

హెడ్‌తో బెనర్జీ బెంగాలీలో ఏవో మాట్లాడాడు. కనుగుడ్లు పెద్దవి చేస్తూ ఆ హెడ్ మాటిమాటికీ ప్రఫుల్‌వైపు పరిశీలనగా చూస్తూ హావభావాలు పుష్కలంగా పండిస్తూ ఏవేవో అడిగాడు. వాటికి మరింత స్ఫూర్తిమంతంగా, ఉత్సాహంగా సమాధానాలు చెప్పాడు బెనర్జీ. చివరికి బెనర్జీ హెడ్ గారిని సమర్థవంతంగా ఒప్పించాడు. తర్వాత తన హ్యాండ్ బ్యాగ్‌లో ఉన్న కాగితాలు తీసి హెడ్ గారికి చూపించాడు.

ఆయన వాటిల్లో తను సంతకం పెట్టాల్సిన కాగితాలపై సంతకాలు పెట్టి ప్రఫుల్ అడ్మిషన్ కన్‌ఫర్మ్ చేసి ఆ కాగితాలు బెనర్జీకి తిరిగి ఇచ్చేశాడు. హెడ్ గారికి తను భారీగా ధన్యవాదాలు చెప్పి ప్రఫుల్‌చేతకూడా చెప్పించాడు బెనర్జీ.

ఆ గదినుంచి బయటకు వస్తూ బెనర్జీ నవ్వుముఖంతో కంగ్రాట్స్ చెప్తూ ప్రఫుల్‌వైపు చేయిచాచాడు కరచాలనం కోసం. అతను కొంచెం మొహమాటంగా చేతిని అందిస్తే దాన్ని దొరకపుచ్చుకుని అదేపనిగా ఊపి కరచాలనం అంటే ఏమిటో రుచిచూపించాడు.

అక్కడనుంచి ప్రఫుల్‌ని జనరల్ అడ్మినిస్ట్రేటివ్ బిల్డింగ్‌వైపుకి నడిపించాడు బెనర్జీ.

విశాలమైన బయటప్రదేశం. ఎటుచూసినా పచ్చని చెట్లు, రంగురంగుల దుస్తులు ధరించిన విద్యార్థులు, భుజాలకు గుడ్డ సంచీలు తగిలించుకుని కుర్తాపైజమాలలో ఉన్న టీచర్లను చూసి ఏదో మాయాప్రపంచంలోకి నడిచివచ్చినట్లు ఆశ్చర్యపోయాడు ప్రఫుల్.

అంతలోనే బెనర్జీ అడ్మినిస్ట్రేటివ్ బిల్డింగ్‌లోకి దారితీశాడు. అక్కడ మేడపైన ఉన్న ఒక గదివైపుకి నడిపించాడు. అది ఒక పెద్ద హాలు. దానిలో ఒక



## అన్నీ అబ్బురాలే

తెలుగులో స్టార్ హీరోల సరసన వరుస అవకాశాల్ని పొందేసి, కెరీర్‌లో జిగేల్ జిగేల్‌మంటూ కొనసాగుతున్న పూజాహెగ్డె తన సినీ ప్రయాణంలో ఎక్కువసార్లు అబ్బురపడడమే తప్ప, మితిమీరిన కష్టాలు, సవాళ్ళు ఎదుర్కోలేదని చెప్తూ, నవ్వులు విరజిమ్మింది.

"సెట్‌లో సవాళ్ళు, కష్టాలు ఎవరికైనా వుంటాయి. అక్కడ శ్రమించడం నాకూ ఇష్టమే. అయితే అక్కడకు చేరుకునే క్రమంలో అనేకమందికి ఎన్నో అనుభవాలు ఎదురవుతుంటాయి.

నా విషయంలో మాత్రం పరిశ్రమలోకి ప్రవేశించడం మొదలుకుని అన్నీ అనుకోకుండానే జరిగిపోతున్నాయి. ఊహించని సంఘటనలతో ఆశ్చర్యపోతుంటాం కదా" అని తెలిపింది.

## అనుకోకుండా వచ్చేశా

అమ్మానాన్నలు వైద్యులు కావడంతో కన్నడ అమ్మాయి ప్రణీత కూడా సహజంగానే డాక్టర్ కావాలని కోరుకున్నది. టెన్త్ తర్వాత అభిప్రాయం మార్చేసుకుని ఇంజినీర్ కావాలనుకున్నదట కాని, చివరకు యాక్టర్ అయింది.

"మొదట్లో యాడ్ ఫిలిమ్స్‌లో నటించాను. కన్నడంలో 'పోకిరి' సినిమా ద్వారా హీరోయిన్ అయ్యా. మంచి బ్యానర్‌లో, మంచి హీరోలతో, మంచి పాత్రలు చేయడమనేది అంత తేలికైన విషయం కాదు. ఈ విషయంలో నేను అదృష్టవంతురాలిని.

నాది కష్టపడి పనిచేసే తత్వం. నాకు తెలియని విషయాలను ప్రతి ఒక్కరి దగ్గరనుంచీ నేర్చుకునే ప్రయత్నాలు చేస్తుంటా" అంటూ వివరించింది.



పెద్ద టేబుల్ దగ్గర సోడాబుడ్డి కళ్ళద్దాలతో కూర్చుని ఉన్నాడు మరో బెంగాలీ బాబు.

"రాజ్‌దా! ఈ అబ్బాయికి మన హాస్టల్‌లో మంచి రూమ్ ఇవ్వు. సింగిల్ ఆక్యుపెన్సీ ఉంటే సరే, లేకుంటే డబుల్ ఆక్యుపెన్సీ అయినా సరే" అన్నాడు బెనర్జీ బెంగాలీలో.

"ఇప్పుడు రూమ్‌లు ఎక్కడ దొరుకుతాయి. ఒక సారి రూమ్‌లు ఇస్తే ఖాళీ చేయడంలేదు విద్యార్థులు. ఒకదాని తర్వాత మరో కోర్స్ చేస్తూ ఈ విశ్వభారతికి గబ్బిలాయిల్లా వేలాడుతూ ఉన్నారు.

ఒకవంక ఉద్యోగాలు లేవు బెంగాల్‌లో. వేరే చోటికి పోవడానికి వీళ్ళు సిద్ధంగా ఉండరు" అంటూ బెంగాలీలో గొణుగుతూ పక్కనే ఉన్న అల్మరా తెరిచి అందులోనుంచి ఒక లావుపాటి బౌండ్ రిజిస్టర్ తీసి టేబుల్‌పైపెట్టి దానిలో వెతకడం మొదలెట్టాడు.

తెరిచివున్న పేజీల్లోకి తొంగిచూసిన ప్రఫుల్‌కి కళ్ళు తిరిగాయి. అందు లోని ఎంట్రీలు కొన్ని కొట్టేసి ఉన్నాయి. కొన్నిటి పక్కన కొశ్చన్ మార్కులు. కొన్నిటిచుట్టూ పెన్సిల్‌తో రౌండ్ చుట్టి ఏదో రాసి ఉంది.



సమాజానికి నేనేదైనా మంచి చేయాలనుకుంటే రాజకీయాలలోకి రాకుండానే చేయగలను. -కపిల్‌దేవ్, క్రికెటర్



సినీరంగంలో మగపెద్దల డిమాండ్లకు లొంగనందున నేను చాలా ప్రాజెక్టులు వదులుకోవాల్సి వచ్చింది. -మల్లికా శరావత్, నటి

ఇంకా కంప్యూటర్స్ వాడడం మొదలుపెట్టలేదా వీళ్ళు అనుకున్నాడు ప్రఫుల్. ఈ రిజిస్టర్ అంతా వెతికితేగాని, తనకు హాస్టల్ రూమ్ ఉందో లేదో చెప్పడానికి ఈ రాజ్‌దాదాకి వీలుపడదు.

దానికోసం గంటలు కాదు, వారాలు పట్టేట్లు ఉంది అనుకున్నాడు నీరసంగా! ఈలోగా బెనర్జీ నాన్‌స్టాప్‌గా మాట్లాడుతూనే ఉన్నాడు రాజ్‌దాతో.

నోట్లో ఉన్న పాన్ నములుతూ, ఆ రుచిని ఒక వంక ఆస్వాదిస్తూనే, మరోవంక బెనర్జీ మాటలను సంగీతం వింటున్నట్లుగా తలతాటిస్తూ మధ్యలో ఏవో శబ్దాలు చేస్తూ రిజిస్టర్‌లోని పేజీలను తిప్పుతూ ఉన్నాడు రాజ్‌దా.

'వీళ్ళకి అర్జెంట్ అంటే అర్థం తెలీదా! ఏ పనైనా ఇంత తాపీగా చేస్తారా!' అనుకున్నాడు ప్రఫుల్.

తనకు కనబడ్డ బెంగాలీ సుందరి గురించిన ఆకర్షణ ఒకవైపు, ఎరక్కపోయి వచ్చి ఈ బెంగాలీ వాళ్ళ మధ్య ఇరుక్కుపోతున్నానేమో అనే భయం మరోవైపు చెరోచెయ్యిపట్టి వ్యతిరేకదిశలో గుంజుతున్నట్లు ఫీలయ్యాడు ప్రఫుల్.

అక్కడినుంచి వెళ్ళిపోదామంటే తనకోసమే వాళ్ళు పనిచేస్తున్నారనే తలంపుతో మొహమాటంగా నిల్చుండిపోయాడు. హాస్టల్ గదిగురించి వెతుకులాడుతుంటే ప్రఫుల్‌కి ఆ రోజు తను బోల్‌పూర్ చేరడం గుర్తుకువచ్చింది. ప్రఫుల్ ఆ రోజు ఉదయమే బోల్‌పూర్ స్టేషన్‌లో ట్రైన్ దిగి, ముందుగానే నెట్‌లో బుక్ చేసుకున్న హోటల్‌కి నేరుగా వెళ్ళిపోయాడు.

ఎందుకన్నా మంచిదని హోటల్ రూమ్ రెండు రోజులకు బుక్ చేసుకున్నాడు. కావాలంటే మరో రెండురోజులు పెంచుకోవచ్చు అనుకున్నాడు.

యూనివర్సిటీ ఫైన్ ఆర్ట్స్ డిపార్ట్‌మెంట్‌లో తనకి అడ్మిషన్ కన్‌ఫర్మ్ చేసినప్పటినుంచి ఆ డిపార్ట్‌మెంట్ లోని ఫ్యాకల్టీ అయిన బెనర్జీతో 'ఇమెయిల్స్'లో కాంటాక్ట్ మెయిన్‌టెయిన్ చేస్తూ ఉన్నాడుకాబట్టి యూనివర్సిటీకి వెళ్ళి ముందే అతన్ని కలుసుకున్నాడు.

ప్రఫుల్ గురించి ముందుగానే వివరాలు తెలుసుకున్న బెనర్జీకి అతనిలో ఒక మంచి విద్యార్థి కనిపించాడు. తనకి పేరు తీసుకురాగలిగిన మంచి చిత్రకారుడు ప్రఫుల్‌లో దాగి ఉన్నాడని విశ్వసించాడు బెనర్జీ. అందుకే అతని గురించి చాలా శ్రద్ధ తీసుకుంటున్నాడు. ఆ రోజు ఉదయాన్నే ఆశ్రమిక్‌లు అందరూ అసెంబులై విశ్వభారతి ప్రార్థనాగీతం పాడే దగ్గరకు వచ్చెయ్యమని, అక్కడనుంచి అతని అడ్మిషన్ ఫార్మాలిటీస్ పూర్తిచేయిస్తానని చెప్పాడు. అలాగే అతనికి హాస్టల్‌లో వసతి చూపించే పనికూడా నెత్తిన వేసుకున్నాడు బెనర్జీ.

'నోయ్' అన్నాడు సోడాబుడ్డి కళ్ళద్దాల రాజ్‌దా, నోట్లో పాన్ నములుతూవుంటే వచ్చిన లాలాజలాన్ని ఒక్క గుటకలో మింగుతూ, బయటకు కొన్ని తుంపర్లు వెదజల్లుతూ!

'అనుకున్నంతా అయింది. హాస్టల్‌లో రూమ్ గోవిందా గోవింద' అనుకున్నాడు ప్రఫుల్.

బెనర్జీ ఊరుకోలేదు. మళ్ళీ బ్రతిమిలాడాడు గట్టిగా బెంగాలీలో. రాజ్‌దాని కాలర్ పట్టుకుని కొడతాడా ఏంటి అన్నట్లు భయపడ్డాడు ప్రఫుల్. కానీ అతను భయపడినట్లుగా రాజ్‌దాకి ఆ మాటలు కోపం తెప్పించినట్లు లేవు. ఒక చిరుదరహాసం ముఖాన మొలిచింది. బెంగాలీలో ఏదో మాట్లాడాడు.

బెనర్జీ ఆ మాటలకు సంతోషించి రాజ్‌దాకి ధన్యవాదాలు చెప్పి, మిస్టర్ రాబ్, యు విల్‌గెట్ యువర్ రూమ్ నెక్స్ట్ మంత్' అన్నాడు ఆనందంగా. అక్కడికి ఏదో జాక్‌పాట్ కొట్టినంత ఆనందాన్ని ముఖంలో పండిస్తూ!

అతను అంత ఆనందంగా చెప్తుంటే ఇక బాగోదని ప్రఫుల్ కూడా రాజ్‌దాకి థ్యాంక్స్ చెప్పాడు.

"ఇప్పుడేం చేద్దాం" అన్నాడు బెనర్జీ ఇంగ్లీషులో.

"నేను రూమ్‌కి వెళ్ళి కొద్దిసేపు రెస్ట్ తీసుకుంటాను" అన్నాడు ప్రఫుల్.

"నో నో ముందు నా గది చూపిస్తాను. తర్వాత నీకు కావలసిన వస్తువులు, కొనుక్కోవలసిన పుస్తకాలు లిస్ట్ ఇస్తాను. కొన్ని ఇక్కడ దొరుకుతాయి. మరికొన్ని కోల్‌కతాలో దొరుకుతాయి.

అవి నీ వీలునుబట్టి తెచ్చుకోవచ్చు. అయినా నీకు సిటీలలో ఉండడం ఇష్టమా, లేక ఇలాంటి చిన్ని ఊర్లలో ఉండడం ఇష్టమా" అడిగాడు బెనర్జీ.

బెనర్జీకి, తనకి ఒక పదేళ్ళ వ్యత్యాసం ఉంటుందేమో అనుకున్నాడు ప్రఫుల్ అతనివైపు సాలోచనగాచూస్తూ. ప్రఫుల్‌కంటే ఆరంగుళాలు ఎత్తు తక్కువ ఉంటాడు బెనర్జీ. బరువుమాత్రం ప్రఫుల్‌కంటే ఎక్కువే!

చామనఛాయ, సున్నగా దువ్విన జుత్తు, లూజుగా ఉన్న లాల్చీ, భుజాన ఉన్న ఒక గుడ్డ సంచీ. కళ్ళు చాలా చురుకుగా ఉన్నాయి.

"ఏమి ఎనర్జీరా బాబూ వీడికి! వీడు బెనర్జీ కాదు, ఎవరెడీ ఎనర్జీ!! నన్ను ఇప్పట్లో వదిలేలా లేడు. వీడి ప్రేమ మండిపోనూ! నా మానాన నన్ను వదిలేస్తే నా స్పేస్ నేను ఎంజాయ్‌చేస్తాను కదా, ఇలా ప్రతిదాంట్లోకి జోక్యం చేసుకోకపోతే..." అనుకున్నాడు. కానీ బెనర్జీ తనకు చాలా సాయం చేస్తున్నాడు అన్నది గుర్తుకువచ్చి తన అసహనానికి తనను తానే నిందించుకున్నాడు.

"సరే పదండి..." అంటూ తెచ్చిపెట్టుకున్న నవ్వుతో అతన్ని అనుసరించాడు ప్రఫుల్.

దారిపొడవునా బెనర్జీ మాట్లాడుతూనే ఉన్నాడు. అతను హిందీలో మాట్లాడినా, ఇంగ్లీషులో మాట్లాడినా బెంగాలీ ఉచ్చారణలాగానే అనిపిస్తూ ఉండటంతో చాలావరకు అర్థంకాలేదు ప్రఫుల్‌కి.

యథాలాపంగా ఊ కొడుతూ, చుట్టుపక్కల కలియచూస్తూ అతనితోపాటు నడిచాడు.

ఉదయాన్నే కనబడిన బెంగాలీ సుందరి మళ్ళీ కనిపిస్తుందేమో అని ఆశగా ఒళ్ళంతా కళ్ళు చేసుకుని చూసినా ప్రయోజనం లేకపోయింది.

పోనీ బెనర్జీని అడిగి తెలుసుకుందామా అంటే ఆమె వివరాలు ఏమీ తెలియవు.

ప్రార్థనా గీతం పాడుతున్న మిగిలిన ఆశ్రమిక్‌ల లాగానే ఆమెకూడా ఆశ్రమిక్ అయితే అక్కడి హాస్టల్ లోనే ఉండి ఉంటుంది అనుకున్నాడు. అయితే ఆమె ఉండే లేడీస్ హాస్టల్ దగ్గర కాసేపు తచ్చట్లాడితే లంచ్‌టైమ్‌లో ఆమె కనిపించే అవకాశం లేకపోలేదు. బెనర్జీని లేడీస్ హాస్టల్ దగ్గరకు తీసుకువెళ్ళమని

అడిగితే ఎలా ఉంటుంది అనే ఆలోచన తటాలున వచ్చింది! కానీ లేడీస్ హాస్టల్ చూపించమంటే బెనర్జీ ఏమనుకుంటాడో అన్న అనుమానం వచ్చింది.

అతను తన క్లాస్‌మేట్‌గానీ, మరో స్టూడెంట్‌గానీ కాదు, ఓపెన్‌గా మాట్లాడటానికి! పైగా రేపు పాఠాలు చెప్పబోయే గురువుకూడాను. ఫస్ట్ ఇంప్రెషన్‌లోనే తనంటే తేలిక అభిప్రాయం కలిగితే, ఇంకేమన్నా ఉందా? అనుకున్నాడు. అంతలోనే బెనర్జీ ఒకచోట ఆగి, చుట్టూ ఒకసారి కలియచూశాడు.

"ఏమైంది?" అన్నాడు ప్రఫుల్.

"నీకు చెప్పానుకదా, కాలాభవన్. అంటే ఇదే..." అన్నాడు బెనర్జీ గర్వంగా చూస్తూ.

"కళాభవన్!" అన్నాడు ప్రఫుల్.

"అంటే బిల్డింగ్ ఆఫ్ ఆర్ట్స్" అన్నాడు ఏదో అర్థమయినట్లుగా తల తాటిస్తూ.

"నో, నో కాలాభవన్. అంటే బ్లాక్ కలర్‌లో ఉండే బిల్డింగ్" అన్నాడు చమత్కారంగా.

బెనర్జీ ముఖంలో విరిసిన నవ్వులో కొంటెతనం కనిపించింది ప్రఫుల్‌కి.

అతను అలా అనేసరికి అప్పటివరకు పరధ్యానంగా ఉన్న ప్రఫుల్ తాము నుంచున్న ప్రదేశంచుట్టూ ఉన్న బిల్డింగ్స్ నల్లటి పెయింట్‌చేసి ఉండటం గమనించాడు. వాటి గోడలపై తెల్లటి రంగులో మ్యూరల్స్ చిత్రించి ఉన్నాయి.

బెంగాలీ సుందరి నుంచి తన ఆలోచనలను ఆ కాలాభవన్‌వైపు మరల్చాడు ప్రఫుల్. "అవును కాలా భవన్" అంటూ ప్రఫుల్ కూడా నవ్వేశాడు.

"ఇదికాక కళాభవన్ అని కూడా ఒకటి ఉంది. చూపిస్తా పద" అంటూ తీసుకువెళ్ళాడు.

అక్కడకు తీసుకునివెళ్ళాక "నీకు దీనిగురించి కొద్దిగా చెప్తా విను. ఇక్కడ మనదేశం గర్వించే గొప్ప గొప్ప కళాతపస్వులు పనిచేశారు.

నందలాల్ బోస్, బినోద్ బిహారీ ముఖోపాధ్యాయ్, సోమనాథ్ హోరె, రామ్ కింకర్ బైజ్‌లాంటి మహనీయులు ఇక్కడ తమ కళాసృష్టి చేశారు. అటువంటి మహనీయులు పనిచేసినచోట నువ్వుకూడా పని చెయ్యబోతున్నావు" అన్నాడు బెనర్జీ.

చాలా అద్భుతం అనిపించింది అతనికి. అంత బోల్డ్‌గా అలా పెయింట్ చేసిన సృజనాత్మకతకు, దాన్ని వికసించేలా చేసిన ఆ విశ్వభారతి వాతావరణానికి అచ్చెరువొందాడు.

తనకు చిత్రలేఖనంపైన ఉన్న అభిరుచిని ఎంతటి శిఖరాగ్రానికైనా చేర్చే సత్తా ఆ మట్టికి, ఆ గాలికి అక్కడి గురువులకు ఉందని నమ్మకం కుదిరింది. ఒళ్ళంతా పులకరించింది. బెనర్జీవైపు ఆరాధనగా చూశాడు. అతని కళ్ళకు బెనర్జీ తనకంటే ఒక అడుగు ఎత్తుగా ఉన్నట్లు అనిపించింది.

"వండర్‌ఫుల్" అన్నాడు అప్రయత్నంగా!

"యస్. ఇంకా ఇక్కడ చాలా విశేషాలు ఉన్నాయి. ఇందిరాగాంధీ కూడా ఇక్కడ చదువుకుంది, నీకు తెలుసా" అన్నాడు బెనర్జీ.

"తెలియదు" అన్నాడు ప్రఫుల్ నిజాయితీగా!

"పద చూపిస్తాను. లేడీస్ హాస్టల్ ఇక్కడకు దగ్గరే" అంటూ దారితీశాడు బెనర్జీ.

అనుకోకుండా తన మనసులోని కోరిక ప్రకారం లేడీస్ హాస్టల్‌వైపుకి తీసుకెళుతున్న బెనర్జీని ఒక ఆప్తుడిని చూసినట్లు చూశాడు.

ఉత్సాహంగా అతను చెపుతున్న ప్రతి మాటకు, అది అర్థమయినా కాకపోయినా ఊ కొడుతూ నడిచాడు ప్రఫుల్. అప్పటివరకు నిస్సారంగా అనిపించిన పరిసరాలు అందంగా, ఆహ్లాదకరంగా కనిపించసాగాయి ప్రఫుల్‌కి.

**ఇంకా ఉంది**



## నాలుగేళ్ళు మర్చిపోయా

వినడానికి గొంతు, చూడడానికి రూపం రఫ్ అండ్ టఫ్‌గా వున్న సాయిపల్లవి తొలిచిత్రంలోనే బోల్డెంతమంది అభిమానులను పోగుచేసుకోగలిగింది. టెలివిజన్ షోల్లో 'ఢీ'కొట్టి, పాపులర్ అయిపోయి, ఆపైన చదువుకే ప్రాధాన్యం ఇచ్చి మెడిసిన్ కోసం విదేశాలకు వెళ్ళిపోయింది.

"మాది ఊటీ దగ్గర్లోని ఊరు. అమ్మ డ్యాన్సర్ కావడంవల్ల నాకూ చిన్నప్పటినుంచి చాలా ఇష్టం. చాలా డ్యాన్స్ కార్యక్రమాల్లో పాల్గొనేదాన్ని.

టీ.వీ షోల్లో పాల్గొన్నా. ముందు చదువు పూర్తి చేయాల్సిందేనని నాన్న చెప్పడంతో జార్జియా వెళ్ళిపోయాను. నాలుగేళ్ళలో సినిమాల ఆలోచన పూర్తిగా మర్చిపోయా. తర్వాతి విషయాలు మీకు తెలిసినవే" అంటూ నవ్వేసింది.

## అలా మొదలైంది

సినిమారంగంతో ఏమాత్రం సంబంధం లేని కుటుంబంనుంచి వచ్చిన నివేదాథామస్ చిన్నతనం నుంచీ ఆటపాటల్లో, నాట్యంలో ముందుండేదట. తాను సినిమాల్లోకి ఎలా వచ్చిందో వివరించింది.

"నేను చెన్నైలో మౌంట్ ఫోర్ట్ స్కూలులో చదువుతున్నప్పుడు పిల్లల ఫెస్టివల్‌కు వచ్చిన తమిళనటి పూర్ణిమా ఇంద్రజిత్ నన్ను చూశారు. ఆమెకు తెలిసినవాళ్ళు నా వయస్సున్న పాపకోసం వెతుకుతున్నారని, అమ్మా నాన్నలతో మాట్లాడారు.

అలా 2002లోనే మలయాళ సినిమాలోకి ప్రవేశించాను. బాలనటిగా కేరళ ప్రభుత్వంనుంచి అవార్డు అందుకున్నాను. అక్కడినుంచి నెమ్మది నెమ్మదిగా నా సినీ ప్రయాణం మొదలై, తెలుగు 'జెంటిల్‌మెన్' సినిమాతో ఊపందుకున్నది" అంటూ వివరించింది నివేదా థామస్.



# అలియా భట్

చిన్న వయస్సులోనే పెద్ద విజయాలు చవి చూస్తున్న అలియాభట్ తన అందచందాలు, వ్యక్తిగత ఇష్టాల జాబితా విప్పింది.

- **నా అందాల కార్యక్రమం :** నా అందాల పరిరక్షణలో నీటి పాత్ర ఎంతో ఉంటుంది. వీలయినంత ఎక్కువ నీరు తాగుతుంటా
- **చర్మ పరిరక్షణకోసం :** వైప్స్‌తో మేకప్ శుభ్రంగా తుడిచేసుకుంటాను. దీనివల్ల నా చర్మానికి గాలి బాగా ఆడుతుంది
- **నా శిరోజాల పరిరక్షణకు :** ప్రతి రెండు రోజులకు ఒకసారి జుట్టు వాష్ చేసుకుంటాను. పని లేనట్లయితే ప్రతి మూడురోజులకు ఒకసారి తలస్నానం చేస్తుంటా. ఆరోగ్యవంతమైన ఆహారం నా జుట్టును మంచి కండిషన్‌లో ఉంచుతుంటుంది
- **నా మేకప్ బాక్స్‌లో ఉండేవి :** మెబెల్లైన్ కాజల్, బేబీ లిప్స్, విభిన్న లిప్ షేడ్స్, లిప్‌స్టిక్స్
- **నా ఫేవరెట్ బ్యాగ్ బ్రాండ్ :** మనకు అవసరమైన వస్తువులన్నింటినీ ఉంచుకునేందుకు వీలయిన సైజు బ్యాగ్ ఉండాలి. అది అందంగానూ వుండాలి. సరికొత్త సమ్మర్ కలెక్షన్ కాప్రెస్‌వారివి బ్రైట్‌గా, స్టయిలిష్‌గా ఉంటాయి. కాప్రెస్ బ్యాగ్‌లు బహుళ ఉపయోగాలతో ఉంటాయి. ప్రయాణాల్లో అనువైనవి
- **నా మేకప్ మంత్ర :** లెస్ ఈజ్ మోర్
- **ఆహార ప్రాధాన్యాలు :** శాకాహారానికే నా ప్రాధాన్యం. ఇది ఆరోగ్యపూరిత జీవితానికి ఉపకరిస్తుంది
- **ఫేవరెట్ స్నాక్స్ :** ఫ్రెంచ్ ఫ్రైస్
- **వ్యాయామ కార్యక్రమాలు :** పిలేట్స్‌తో కలిపి జిమ్మింగ్ ఇష్టం. నా డైలీ రొటీన్, డైట్‌లను పర్సనల్ ట్రైనర్ పర్యవేక్షిస్తారు
- **నా స్టైల్ స్టేట్‌మెంట్ :** వైట్ టీషర్ట్ ధరిస్తాను. దీన్ని తిరుగులేని క్లాసిక్‌గా ఫీలవుతాను
- **నచ్చే డిజైనర్లు :** మనీష్ మల్హోత్రా, ప్రబాల్ గురంగ్
- **ఫేవరెట్ పర్‌ఫ్యూమ్స్ :** గుస్సి, డొల్చె
- **ఆరాధించే స్టైల్ ఐకాన్లు :** కరణ్‌జోహార్. మా అమ్మ. తన కనీస సౌందర్య పద్ధతుల్లో నాకెప్పుడూ స్ఫూర్తిగా వుంటుంది

A real leader wears Velcro instead of Teflon where acceptance of responsibility is concerned

# అనిల్

## బొమ్మల పజిల్

మూడు పిల్ల చేపల్లో ఏది తల్లి చేపను చేరగలదో గుర్తించండి.






## స్వేచ్ఛ, చనువు అవసరం

తప్పులు చేయడం అనేది పిల్లల సహజనైజం.తెలిసో, తెలియక తప్పులు చేస్తారు. కొందరైతే ఆపైన గ్రహిస్తారు కూడా. ఐతే అలా తప్పు చేసినప్పుడు, తాము తప్పుచేశామని తెలుసుకున్నప్పుడు, దాని గురించి ధైర్యంగా తల్లిదండ్రులతో చెప్పగల స్వేచ్ఛ, చనువు పిల్లలకు ఉండాలి.

చెప్పడంవల్ల అమ్మానాన్నలు కొడతారనో, తిడతారనో భయపడితే తప్పును సరిదిద్దుకోగల అవకాశాన్ని వాళ్ళు కోల్పోతారు.

ఎవరికి చెప్పుకోవాలో తెలియక తోటిపిల్లలతో చర్చిస్తుంటారువాళ్ళదీ తెలిసీ తెలియని వయస్సే కావడంతో మరింత తప్పుదారిపట్టించే అవకాశం వుంటుంది. కాబట్టి, తల్లిదండ్రులు పిల్లలకు అన్నివిషయాలనూ చర్చించ గల చనువును చిన్నవయస్సు నుంచీ ఇస్తుండడం మంచిది.

## పొదుపుపై అవగాహన

పిల్లలకు డబ్బు విలువగురించి, పొదుపుగురించి చిన్నతనంనుంచీ అవగతం చేస్తుండాలి.

చిన్నవయస్సులోనే వారికో డబ్బుల డిబ్బీ ఇచ్చివారికి ఇచ్చిన డబ్బునుంచి, దానిలో కొంత వేస్తుండమని ప్రోత్స హిస్తూ, అలా దాచిన డబ్బుతో వారికి నచ్చేవి ఏవైనా కొనుక్కోవచ్చని చెప్తుంటే, పొదుపు చేయడం ఎలాగో, అది అవసరానికి ఏ విధంగా పనికివస్తుందో వారికి అర్థం అవుతుంది.

పిల్లలకు ఎప్పుడూ అమ్మానాన్నలే రోల్ మోడల్స్ కాబట్టి, పొదుపు విషయంలోనూవారికిఆదర్శంగానిలవాలి. ఆర్థిక ప్రణాళికలకు చిన్నతనం లోనే బీజం వేయడంవల్ల ఎదిగేకొద్దీ పిల్లల్లో ఆర్థిక క్రమశిక్షణ ఏర్పడుతుంది.

## భూమిలోపల

భూమి లోపల ఏమివుంటుంది? భూమి పొర దిగువున ఉండే ప్రాంతాన్ని 'భూ ఆవరణ' అంటారు. దీనిలో ద్రవరూపం లోని శిలలతో కూడిన చిక్కని పాకంలాంటిది వుంటుంది.

దీనినే 'శిలాద్రవం' అంటారు. ఈ ప్రాంతం భూమికి నలభై కిలోమీటర్లనుంచి 3,000 కిలోమీటర్ల లోతుదాకా వుంటుంది.

శిలాద్రవం అత్యధిక ఉష్ణోగ్రతతో వుంటుంది. భూమిపొర సగటు ఉష్ణోగ్రత 22 డిగ్రీల సెల్సియస్ అనుకుంటే, లోపలి ఉష్ణోగ్రత 1500 నుంచి మూడు వేల దాకా వుంటుంది.

ఈ శిలాద్రవంలో ఖనిజాలు, అల్యూమినియం, ఆక్సిజన్, సిలికాన్ వంటివి వుంటాయి.ఇనుము, నికెల్ వుంటాయి.

## ఎమోషన్ల నియంత్రణ

చిన్నవయస్సులో పిల్లలకు ఏం కష్టనష్టాలుంటాయి,వారికేం బరువుబాధ్యతలు వుంటాయి అనుకుంటే తప్పు.

పిల్లల్లో ఎమోషన్లుఎక్కువ. వాళ్ళడిగినదానికి 'నో' చెప్పిన ప్రతిసారీ వాళ్ళకు కన్నీళ్ళు వస్తాయి.

కోపం కట్టలు తెగుతుంది. ఆ కోపాన్ని, ఆవేదనను, నిస్సహాయతను ఏదో ఒక ప్రతికూల పంథాలో వ్యక్తం చేస్తుంటారు. ఇటువంటి ఎమోషన్లను మేనేజ్ చేసుకోగల తత్వాన్ని వారికి చిన్నతనంనుంచీ నేర్పుతుండాలి.

దీనివల్ల ఎదిగేకొద్దీ తమ ప్రవర్తనను నియంత్రించుకోగల సామర్థ్యంవారికి అలవడుతుంది. పిల్లల ఎమోషన్లకు కారణాన్ని గుర్తిస్తే వారిని సముదాయించడం సులువు అవుతుంది.

వారు చెప్పే మాటలు, వారి భావాలు పూర్తిగావింటేపరిష్కారం దక్కుతుంది. నీతి కథలు చెప్పడంద్వారా భావోద్రేకాలను సమతౌల్యపరచవచ్చు.

## రోబోల పని

'రోబో'అంటే చెకోస్లోవేకియా దేశభాషలో 'వెట్టిచాకిరీ' అనిఅర్థం.

ఈ పదాన్ని మొదటిసారిగా ఈ దేశరచయిత తననాటకంలో ప్రయోగించాడు.మనిషిలాగానే కొన్నిట్యూన్ చేసిన పనులు చేయగల మరమనిషి అన్నమాట.

పురుషుడిరూపంలో వుండే రోబోను ఆండ్రాయిడ్ అని, స్త్రీ రూపంలో ఉండే రోబోను గైనాయిడ్ అని అంటారు. కొన్ని దేశాల్లో రోబో అంటే, ఇంకొన్ని దేశాల్లో రోబోట్ అంటారు. పరిశ్రమల్లో ఇతర కర్మాగారాల్లో మనుషులు పనిచెయ్యలేని ప్రదేశాల్లో అత్యంత అపాయకరమైన విధులు నిర్వర్తించడానికి వీటిని తయారుచేశారు.

కార్మికులు దొరకని దేశాల్లో ఐతే వీటి అవసరం ఎక్కువ.

ఇంగ్లండ్ కార్యాలయాల్లో తేలిక రోబోలను అటెండర్ పనులు చేయడానికి ఉపయోగిస్తారు. బ్రిటన్, అమెరికా, జపాన్‌లలో రోబోలను హెవీ ఇండస్ట్రీస్, ఎలక్ట్రానిక్స్, ఎయిర్‌వేస్ లలో ఉపయోగిస్తారు.



# సత్యాన్వేషణ

## శ్రీ కూర్మావతార స్తుతి

**మంథానాచల ధారణ హేతో,దేవాసుర పరిపాలవిభో**
**కూర్మాకార శరీర నమో, భక్తం తే పరిపాలయమామ్**

అమృతం నిమిత్తమై పాలసముద్రాన్ని మథించుచున్న దేవాసురులను రక్షింపబూని సముద్రంలో మునిగి మందర పర్వతాన్ని ఎత్తేందుకు కూర్మరూపం పొందిన శ్రీమహావిష్ణో! నీకు నమస్కారము. నీ భక్తుడనైన నన్ను రక్షించు. ❐

## కూర్మజయంతి

**(తేది : 10.7.2018)**

శ్రీ మహావిష్ణువెత్తిన అవతారాల్లో రెండవది కూర్మావతారం. దేవదానవులు కలిసి పాలసముద్రాన్ని మథిస్తూ ఉన్నవేళ ఆ మందరమనే పేరు ఉన్న పర్వతం అప్పటివరకూ కవ్వంలా పని చేస్తూ చిలుకుతున్నది కాస్తా భూమిలోకి దిగబడిపోయింది.

దాంతో శ్రీహరి తాబేలు అవతారాన్నెత్తి ఆ మందరంకింద తన వీపుడిప్పని ఉంచి చిలకడానికి వీలుగా చేసి మొత్తానికి అమృతాన్ని రప్పించగలిగాడు.

ఏ అవతారంలోనైనా ఏదో ఓ సంహారం అనేది ఉందిగాని ఈ అవతారంలో ఎవరినీ సహరించలేదు శ్రీహరి.

అందుకే కూర్మం ప్రధాన దైవంగా ఉండేటువంటి శ్రీకూర్మక్షేత్రాన్ని గొప్పదిగా చెప్తారు పెద్దలు. ❐

## యక్షతరువు

ఇరవై ఆరువేల కిలోమీటర్ల దూరం నేటికాలపు ఇంధనం నింపిన వాహనంలో ప్రయాణిస్తే వచ్చే ఇంధన కాలుష్యాన్ని అయిదు మర్రిచెట్లు పూర్తిగా తొలగించగలవు.

తలలు జడలు కట్టించాలంటే సాధుసంన్యాసులు శిరోజాలకి మర్రి పాలు రాస్తే చాలు. రామలక్ష్మణులు ఇలా చేశారు.

పుంసువనమనే షోడశ సంస్కారాల్లోని ఒక సంస్కారంలో (మగ సంతానం కావాలనుకునేది) మర్రిచెట్టు కాయని గర్భిణి ముక్కులో కొన్ని మంత్రాలని చదువుతూ ఆమె రెండవ నెలలో పిండుతారు.

దీనికి గొప్ప నీడనిచ్చే గుణం ఉన్న కారణంగా 'మహాచ్ఛాయ' అని పేరు. పూవు దశ తర్వాతే కాయ వస్తుంది ఏ చెట్టుకైనా. దీనికి పూవు రాదు.

యక్షులకిది బాగా ఇష్టమైన వృక్షం కాబట్టే దీనికి యక్షావాసం, యక్షతరువు అని పేర్లు ఉన్నాయి. ❐

## పంచాయతన పూజ

'ఆదిత్య మంబికాం విష్ణుం గణ నాథ మ్మహేశ్వరమ్' అని శాస్త్రం.

సూర్యుడూ, పార్వతీ, విష్ణువూ, గణపతీ, శంకరుడూ అనే ఐదుగురినీ నిత్యం ఆరాధించడం ఏదుందో దాన్నే 'పంచాయతనపూజ' అంటారు.

పంచ అంటే ఐదుగురు దేవతలని అర్థం. ఆయతనమంటే ఈ ఐదుగురినీ ఒకే చోట ఉంచి పూజించడం (ఐదుగురికీ ఇల్లు లేదా నివాసాన్ని కల్పిస్తూ) అని అర్థం.

ఎవరిని ప్రధానంగా ఉంచి పూజిస్తే అది ఆ పంచాయతనమౌతుంది. నలుగురు దేవతలనీ నాలుగు దిక్కుల్లోనూ ఉంచి అందరికీ మధ్యలో శివుణ్ణి ఉంచితే 'శివ పంచాయతనం'.

సూర్యుడు మధ్యలో ఉంటే సౌరం, గణపతి అయితే 'గాణాపత్యం', శక్తి అయితే 'శాక్తం', విష్ణువు అయితే 'విష్ణు పంచాయతనం' అవుతాయి. ❐

## జ్యేష్ఠంలో ఆహారం

జ్యేష్ఠఆషాఢమనేరెండుమాసాలూ తీవ్రమయిన ఎండలతో ఉండే గ్రీష్మ ఋతువులోనివి కాబట్టి ఆయుర్వేద శాస్త్రం ప్రకారం నువ్వులూ బెల్లమూ కలిసిన మిశ్రమాన్ని రోజుకి ఓ ఉసిరి కాయంత ముద్దని తినడం చాలా మంచిది శరీరానికి.

అందుకే ఈకాలంలో పల్లెటూళ్ళలో 'జీళ్ళు' అనే పేరున్న ఉండలని పంచుకుంటారు. ఈ నెలలో శనిత్రయోదశి గనుక వస్తే నువ్వులతో చేసిన బెల్లపు ఉండలని నైవేద్యంగా పెడతారు. ఇటు ఆధ్యాత్మికంగా అటు ఆరోగ్యపరంగా చక్కని మాసం జ్యేష్ఠం. ❐

## సంప్రదాయపరుడు

ఎప్పుడూ మసీదుగోడకి ఆనుకుని కూర్చున్నప్పటికీ, వేషాన్ని బట్టి కూడా మహమ్మదీయునిగానే కన్పిస్తున్నప్పటికీ సాయి ఏనాడూ హిందూధర్మానికి విరుద్ధంగా నడిచినవాడూ, నడువవలసిందని బోధించినవాడూ ప్రోత్సహించినవాడూ కానేకాడు.

భగవంతరావు అనే భక్తుడు నిత్యం పండరినాథుడైన విఠలుణ్ణి పూజిస్తూ ఉండేవాడు.

ఆయన మరణానంతరం ఆయన కొడుకు విఠలపూజతోపాటు తండ్రికి శ్రాద్ధకర్మలని కూడా మానేశాడు.

దాంతో ఆ విషయాన్ని తన మనసుతో గ్రహించిన సాయి ఆ పుత్రుణ్ణి పిలిచి మందలించి అతని తండ్రికి శ్రాద్ధకర్మలు చేసే విధానాన్ని పునరుద్ధరించాడు సాయి. ❐

ఇతరులకు చేతనైనంత సహాయం చేయడమే మానవత్వం అంటే.




# ఆనందం... పరమానందం

వేదగిరి రాంబాబు

ఆనందం నిత్యం ఆనందంగానే ఉంటాడు. అందుకే అతడిని నిత్యానందమని కూడా పిలుస్తుంటారు. కాకపోతే మన ఆనందానికి, అతని లోని ఆనందానికి తేడా ఉంది... అది ఎవ్వరూ పసిగట్ట లేరు! లేకపోతే అతని ఆట ఎప్పుడో కట్టేది!

మామూలుగా ఎవరికైనా వాళ్ళకి మంచి జరిగితే ఆనందంగా ఉంటుంది. అతనికి మాత్రం ఎదుటి వాళ్ళు బాధపడుతుంటే ఆనందంగా ఉంటుంది. అందుకే అతనికి కొత్తగా ట్రాన్స్‌ఫరై వచ్చిన ఆఫీస్‌లో అందరూ కలసిమెలసి ఆనందంగా ఉండడం బాధని పించింది. వాళ్ళను ఎలా విడదీయాలా అని రక రకాల ప్రణాళికలు వేయసాగాడు.

ఆఫీస్‌లో అందరికీ కేంద్రబిందువు ధర్మారావని అర్థమైపోయింది. ధర్మా రావుని ఆఫీసులో కాక ఇంటిదగ్గరనుంచి నరుక్కురావడం ఆనందమనిపించింది.

అంతే! ఆదివారం సూర్యుడు నడినెత్తినున్నాడు. చెమటలు కక్కుకుంటూ ఆనందాన్ని వెతుక్కుంటూ ధర్మారావు ఇంటికి వెళ్ళాడు.

"అరె.. ఆనందంగారా? ఏమిటి ఇంత ఎండలో వచ్చారు.. చెమటతో చొక్కా తడిసిపోయింది... రండి లోపలికి..." కొద్దిగా పక్కకి తొలిగాడు ధర్మారావు ఆనందాన్ని లోపలికి రమ్మన్నట్టు.

లోపలకి అడుగుపెట్టబోయినవాడల్లా చటుక్కున ఆగిపోయాడు ఆనందం. అది పెద్ద హాల్. ముందు ఓ సోఫా సెట్టుంది. అవతల డైనింగ్ టేబుల్.

అందరూ కలసి భోజనం చేస్తున్నట్లున్నారు.

"మీరు భోంచేస్తున్నట్లున్నారు..."

"పర్లేదు లోపలికి వచ్చి ఈ సోఫాలో కూర్చోండి... నేను ఒక్కక్షణంలో పూర్తిచేసి వస్తాను, ఆదివారంకదా అందుకని కాస్త ఆలస్యంగా అందరం కలిసి కబుర్లు చెప్పుకుంటూ నెమ్మదిగా భోజనం చేస్తున్నాం"

సోఫాలో కూలబడ్డ ఆనందానికి చాలా ఇబ్బందిగా ఉంది. అందుక్కారణం ధర్మారావు ఆఫీసులోనేకాదు, ఇంట్లో కూడా ఇలా అందరితో ఆనందంగా ఉండడం! ఆ ఆనందాన్ని ఛిన్నాభిన్నం చేసి తానానందపడడానికి మొదటి బాణాన్ని చటుక్కున వదిలాడు.

"ఏ.సి. లేకపోతే ఈ వేసవిలో చాలా కష్టం..."

"సారీ అండి... మా ఇంట్లో ఏ.సి. లేదు" మొట్ట మొదటిసారి బయటివాళ్ళముందు తమ పరిస్థితికి సిగ్గుపడింది రాణి కంచంలో చేయి కడుక్కుంటూ.

"అదేంటమ్మా నెమ్మదిగా భోజనం కానీయండి... నేనొచ్చి మిమ్మల్ని ఇబ్బందిపెడుతున్నట్లున్నాను"

"లేదండి తినడం అయిపోయింది. ఏవో కబుర్లు చెప్పుకుంటూ అట్లా కూర్చుండిపోయాం" నాప్‌కిన్‌తో చేతులు తుడుచుకుంటూ సోఫాలో ఆనందం పక్కన కూలబడ్డాడు ధర్మారావు. అతనప్పుడు అనుకోలేక పోయాడు ఆనందానికి దూరమవుతున్నానని!

"కనీసం కూలరైనా కొనమని మావారితో చెవి నిల్లు చేసుకుని గోలపెడుతున్నానండి. వినిపించుకుం టేనా? మీరయినా చెప్పండి అన్నయ్యగారూ..." భర్త అతడిని లోపలికి పిలిచి కూర్చోబెట్టిన తీరు చూసి బంధుత్వం కలిపేసింది రాణి.

"నా భార్య రాణి..."

"వాళ్ళిద్దరూ పిల్లలా!" ఆనందం అడిగాడు తన బాధని మనసులోనే దిగమింగుకుంటూ. వాళ్ళిద్దరూ ఆనందానికి నమస్కరించి లోపలికెళ్ళిపోయారు.

"మా అమ్మాయి బిటెక్ ఫైనలియర్ చదువుతోంది. అబ్బాయి బ్యాంక్‌లో పనిచేస్తున్నాడు"

"ఇన్‌సల్ట్..." లోపలి బాధ ఒక్కసారిగా ఆనందం లోంచి బయటకు దూకేసింది.

"అదేమిటండి. మా అబ్బాయి ఉద్యోగం చేస్తున్నా డనగానే ఇన్‌సల్ట్ అంటున్నారు!" ఆశ్చర్య పడుతూ అన్నాడు ధర్మారావు.

"అందుకు కాదండీ నేను ఇన్‌సల్ట్ అన్నది...కొనమని పోరుతున్నా కూలర్ కూడా కొనలేదన్న చెల్లెమ్మ మాటవిని!" సర్దుకున్నాడు ఆనందం. ముందతను ఇన్‌సల్ట్ అన్నది తనున్నచోట అవతలవాళ్ళు ఆనందంగా ఉన్నారన్న బాధతో.

"ఎన్ని గదులున్నాయమ్మా..." మంచినీళ్ళ గ్లాసం దిస్తున్న ధర్మారావు భార్య రాణిని చూసి అడిగాడు.

"ఇది టు బెడ్‌రూమ్ ఫ్లాటండి" వాళ్ళ సంభా షణ మధ్యలో జొరబడిపోయాడు ధర్మా రావు. "ఇంకా ఎండలు పెరుగుతాయట! వెంటనే మీరు ఆ రెండు బెడ్‌రూమ్‌లలో అయినా ఎ.సి పెట్టిం చాలి" ఏమాత్రం కొత్తకూడా లేకుండా ఆనందాన్ని పులుముకుంటూ అన్నాడు ఆనందం. అలా క్షణాల్లో కలిసిపోవడం, అంతకన్నా వేగంగా అవతలివాళ్ళ

ఆనందాన్ని మాయంచేసి తన జేబులో వేసుకోవడం అతనికే తెల్సిన బ్రహ్మవిద్య!

"ఇంతవరకూ నా సంపాదన పిల్లల చదువులకు, ఇదిగో ఈ ఫ్లాట్ ఇ.ఎమ్.ఐ.లకే సరిపోతోంది..." సణిగాడు ధర్మారావు. ముందు అతని ఆనందాన్ని మింగేశానన్న ఆనందంతో "ఇంతవరకూ సరే... ఇప్పుడు మీవాడు అందివచ్చాడుగా..." ఆనందం వేసిన బాణం ఈసారి రాణికి తగిలింది.

"అలా చెప్పండి అన్నయ్యగారూ!" అంతవరకూ భర్తవల్ల ఎన్నో కష్టాలుపడుతున్నట్లు తన బాధ చెప్పుకోవడానికో ఆత్మీయుడు దొరికాడన్నట్లు!

"మన ఆఫీస్‌లో అందరూ మీతో సన్నిహితంగా ఉంటారుగా. మీరు ఎవరినడిగితే డబ్బు సర్దమని! సర్దరూ" ఇంతలో ధర్మారావు కొడుకు, కూతురు మళ్ళీ హాల్లోకొచ్చి వాళ్ళకెదురుగా కుర్చీల్లో కూర్చున్నారు.

"నేనూ డాడీకి చెబుతున్నానండీ, ఇంట్లోకి ఒక్కోటి కొనమని..." అన్నాడు ధర్మారావు కుమారుడు కామేశ్వరరావు. కూతురు కన్యక అన్న మాటని బలపరచింది. అంతే!

అందరిచేతా ముందు ఎ.సి పెట్టించాలన్న ప్రతిపాదన బలంగా వచ్చేట్టు చేయడంతో ఆనందరావు ముఖంలో ఆనందం వెల్లివిరిసింది.

మర్నాడు ఆఫీస్‌లో ముగ్గురిదగ్గర ధర్మారావుతో చేబదుళ్ళు తీసుకునేట్టు చేసి, ఇంట్లో ఎ.సి. రెండు గదుల్లో పెట్టుకునేట్టు చేయడంలో విజయవంతమయ్యాడు ఆనందం. ఫస్టన ముగ్గురు కొలీగ్స్ దగ్గర తీసుకున్న అప్పు కొంచెం చెల్లించి ఫ్లాట్ ఇ.ఎమ్.ఐ. చెల్లించడంతో ధర్మారావు ముఖం వడిలిపోవడంతో

> **జీవితం అంటే సమయం, జీవితాన్ని ప్రేమించేవారు సమయాన్ని వృథా చేయకూడదు.**

ఆనందంలో ఆనందంపాలు పెరిగింది.

మళ్ళీ ఆదివారం మధ్యాహ్నం ధర్మారావు ఇంటికి వెళ్ళాడు ఆనందం పాలెంతుందో చూడాలని ఆనందం. అతన్ని చూడగానే ధర్మారావు భార్య, పిల్లలు ఆనందంగా పలకరించారు. ధర్మారావు బిక్కుబిక్కుమంటూ కూర్చున్నాడు ఆనందం ప్రక్కన, ఇవాళ సంభాషణ ఎటు వెళ్తుందోననే భయంతో.

రాణి స్వీట్, హాట్ పెట్టడంతో "ఏమిటో విశేషం... ఈ స్వీట్ ఎయిర్ కండిషన్ ఏర్పాటైనందుకా"

"కాదు ఇవాళ ఆవిడ పుట్టినరోజు"

"మరావిడకి ఇవాళ గిఫ్ట్ ఏమిచ్చారండీ?" ధర్మారావు గొంతులో పచ్చివెలక్కాయ అడ్డంపడింది.

"ఎ.సి పెట్టించాగా!"నూతిలోంచి అన్నట్లన్నాడు.

"అది ఇంటికి... మరి ఇంటావిడకేమి ఇస్తారో చెప్పండి" రాణి గొంతులో డిమాండ్.

"ఇంట్లో టెలివిజన్ లేదు. ఆవిడకి ఇవాళ ఓ టెలివిజన్ కొని గిఫ్ట్‌గా ఇవ్వండి" అని ఆనందం ఎంతో ఆనందంగా అన్నాడు. ధర్మారావుకి టెలివిజన్‌ని కొనడంకన్నా, ఇరవై నాలుగ్గంటలూ భార్య దానిముందే కూర్చోవడం చాలా బాధేస్తోంది.

"ఇలా రోజూ పుట్టినరోజుకి సంబంధించిన కార్యక్రమాలే ఎన్నో ఉంటున్నాయి. వాటిని వదలకుండా చూస్తున్నానని ఈయన బాధ. పుట్టినరోజు కొనిచ్చిన టీవీలో పుట్టినరోజు కార్యక్రమాలు చూడవద్దా" రాణి ముఖంలో బాధ.

మళ్ళీ ఆదివారం వచ్చింది. మళ్ళీ ఏ చిచ్చుపెట్టడానికి ఆనందం ఆదివారం తమ ఇంటికి వచ్చాడో అని భయపడుతూనే ఆహ్వానించాడు ధర్మారావు.

ధర్మారావు ముఖంలో కంగారు. ఇంతలో పిల్లలు ఇద్దరూ కూడా ఆ హాల్లోకి వచ్చారు. "అంకుల్, అమ్మ పుట్టినరోజునాడు నాన్నగారు టెలివిజన్ కొనేట్టు చేశారు. రేపు నా పుట్టినరోజునాడు గిఫ్ట్‌గా కంప్యూటర్‌ని కొనమని డాడీకి చెప్పండి" అడిగింది కన్య.

"ఇన్‌సల్ట్... పిల్లలు వున్న ఇంట్లో కంప్యూటర్ లేకపోవడం ఇన్‌సల్ట్ ధర్మారావుగారు. ఈ పుట్టినరోజుకి కానుకగా అమ్మాయికి కంప్యూటర్ కొనివ్వాల్సిందే"ఆనందంగా కన్యని బలపరిచాడు ఆనందం.

ఇక విధిలేక "అలాగే" అన్నాడు ధర్మారావు.

మరో నెల సాగింది. మర్నాడు ఆదివారం.

"రేపు మీ ఇంటికి వస్తా"నన్న ఆనందంతో "రేపు మేము ఇంట్లో ఉండడంలేదు. మావాడి పుట్టినరోజు. అందరం బయటికెళ్ళాలనుకుంటున్నాం" అన్నాడు ధర్మారావు అతడిని తప్పించుకోవడానికన్నట్లు.

## ఫిట్‌నెస్ ఇష్టం

నేల టిక్కెట్‌తో తెలుగు తెరకు పరిచయం అయిన మాళవికాశర్మకు ఫిట్‌నెస్, ఫ్లెక్సిబిలిటీలంటే అమిత ఇష్టం అట. తన ఫిట్‌నెస్ కార్యక్రమాలలో పోల్ డ్యాన్సింగ్‌ను కూడా జతచేసింది.

"దీన్ని నా తదుపరి సినిమా కోసం నేర్చుకోవడం లేదు. నాకు ఫిట్‌నెస్, డ్యాన్సింగ్ అంటే చాలా ఇష్టం. ఫ్లెక్సిబిలిటీ ఇవ్వడంలో పోల్ డ్యాన్సింగ్‌కు మించింది లేదు. నా సాధారణ రొటీన్‌కు ఇదో సప్లిమెంట్ వంటిది. ఈమధ్యే కథక్ కూడా నేర్చుకుంటున్నాను. మొదట్లో నేను కొంచెం టామ్ బాయిష్. కథక్ ఆరంభించాక నా బాడీ లాంగ్వేజ్ పూర్తిగా మారిపోయింది" అని చెప్పింది.

## పెద్ద గొంతులే కీలకం

లైంగిక వేధింపులగురించి మాట్లాడే 'మీ టు' ఉద్యమం హాలీవుడ్‌లోమాదిరి బాలీవుడ్‌లో విజయవంతం కాలేకపోవచ్చునని హ్యూమాఖురేషి అభిప్రాయపడుతున్నది. "హాలీవుడ్‌లో ఈ విషయంపై మాట్లాడిన హీరోయిన్‌లు అందరూ సీనియర్లు. ఎంతో గౌరవం పొందుతున్నవాళ్ళు.

బాలీవుడ్‌లో కూడా ఈ విధంగా టాప్ హీరోయిన్లు మాట్లాడినప్పుడే ఈ ఉద్యమం విజయవంతం కాగలదని నేను భావిస్తున్నాను.

ఇటువంటి ఉద్యమాలకు పెద్దగొంతులే కీలకం. చిన్నవాళ్ళు నోరు విప్పినా, దాని ప్రభావమూ చిన్నగానే వుంటుంద"ని చెప్పింది. నిజమే కదా!





SMYFRIENDS.COM



© The Largest Circulated Telugu Monthly

స్వాతి

సచిత్ర మాసపత్రిక



# అనిల్ అవార్డ్ కథల పోటీ

తెలుగు పుస్తకం కొని, చదివి భాషకు సేవచేస్తున్న మహానుభావులంతా సాహితీ స్వరూపులే! ఆ తెలుగు పుస్తకంద్వారా తమ రచనావ్యాసంగాన్ని అందిస్తున్న రచయిత (త్రు)లంతా సరస్వతీ స్వరూపులే! ఇదీ తెలుగు భాష సేవంటే! 'దొరకునా ఇటువంటి సేవ...' అని ఈ 'అనిల్ అవార్డ్ కథల పోటీ'కి కథలు రాసి పంపండి. అనిల్ అవార్డ్ అందుకోవడమంటే సరస్వతీ మాత చేతులమీదుగా సాహితీ కిరీటధారణ జరిగినట్లే! సబ్జెక్టు మీ ఇష్టం. కథ చదివాక జీవితాంతం గుర్తుండిపోతే చాలు. అది ఖచ్చితంగా 'అనిల్ అవార్డ్' కథ అవుతుంది.

## అనిల్ అవార్డ్‌కు ఎంపికైన కథకు ₹25,000 బహుమతి

సాధారణ ప్రచురణకు తీసుకున్న ప్రతి కథకు ₹ 2,000

: నిబంధనలు :

☆ కథల ఎంపికలో స్వాతి సంపాదకునిదే తుదినిర్ణయం. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. పోటీ గడువుతేదీని పొడిగించేందుకుగానీ,పోటీని రద్దు చేసేందుకుగానీ స్వాతి పబ్లికేషన్స్ యాజమాన్యానికి సర్వహక్కులూ వున్నాయి. ☆ కథ అరఠావు సైజులో 10 పేజీలకు మించరాదు. కాగితానికి ఒకవైపున మాత్రమే రాయాలి. ☆ అనువాదాలు, అనుకరణలు,ఇతర పత్రికలకు పంపబడి పరిశీలనలో ఉన్న కథలను పంపవద్దు. ☆ బహుమతిపొందనికథల్లో యోగ్యమైనవాటిని మామూలు ప్రచురణకు తీసుకునే హక్కు మాకుంది. ☆ మామూలు ప్రచురణకు తీసుకున్న కథలను స్వాతి సచిత్ర మాసపత్రికలోగానీ,స్వాతి సపరివార పత్రికలోగానీ ప్రచురిస్తాం. ☆ ప్రచురణకు స్వీకరింపబడని రచనలు త్రిప్పి పంపగోరువారు తగినన్ని స్టాంపులు అతికించిన కవరు జతపరచాలి. ☆ కథలను పంపేటప్పుడు కవరుమీద 'అనిల్ అవార్డ్ కథల పోటీ'కి అని రాయాలి.

కథలు పంపవలసిన చిరునామా :

ఎడిటర్, స్వాతి సచిత్ర మాసపత్రిక, అనిల్ బిల్డింగ్స్
సూర్యారావుపేట, పోస్ట్‌బాక్స్ 339, విజయవాడ 520 002

కథలు మాకు చేరవలసిన ఆఖరు తేది: 20 జూలై 2018


"ఒకపనిచెయ్... మావాడికేదో గిఫ్ట్ ఇవ్వాలనకు. ఇప్పటికే గిఫ్ట్‌లు ఇచ్చిన ఇద్దరూ ఒకరు టెలివిజనే ప్రపంచమని, మరొకరు కంప్యూటరే ప్రపంచమని నమ్మి, మావాడిని కూడా చంపుకుతింటున్నారు..." ధర్మారావు గద్గదిక స్వరంతో అన్నాడు.

"వాళ్ళు మిమ్మల్ని పట్టించుకోక పోవడంకన్నా మీ అబ్బాయి మాటలు మిమ్మల్ని బాధిస్తున్నాయి! అంతేనా?" ఆనందం అతడివంక తీక్షణంగా చూస్తూ అన్నాడు. అంతేనన్నట్లు బాధగా తల ఊపాడు ధర్మారావు.

"సార్ అయితే రేపు మీ అబ్బాయికి ఓ స్మార్ట్ ఫోన్ కొనివ్వండి"

కాకపోతే అప్పుడు నలుగురూ డైనింగ్ టేబుల్ దగ్గర ఆనందంగా కూర్చుని ఉన్నారు. ఇప్పుడు హాల్‌లో ఒక్కడే దిగులుగా కూర్చున్నాడు!

ఆనందాన్ని చూస్తూనే "ఇవాళ నా పుట్టినరోజు. ఈ ఇంట్లో ఎవరికీ నాతో మాట్లాడే తీరిక కూడా లేదు"

"ఏం?" అమాయకంగా అన్నాడు ఆనందం.

"ఏముంది? మా ఆవిడ ఇరవైనాలుగ్గంటలూ ఆ టెలివిజన్‌కి ఎదురుగా కూర్చుంటుంది. మా అమ్మాయి ఆ కంప్యూటర్‌దగ్గర... మా అబ్బాయికి



శాస్త్రీయ పరిశోధనా ఫలాలు ప్రజా ప్రయోజనకరంగా వుండాలి.
-వెంకయ్యనాయుడు, ఉపరాష్ట్రపతి



రాజకీయాలలో కథలు చెప్పే కళలో కాంగ్రెస్ వెనుక పడింది. వాగ్ధాటి వున్న నేతలు సమర్థవంతంగా పని చేయటం లేదు.-సల్మాన్ ఖుర్షీద్, కాంగ్రెస్ నేత

"ఎంతుంటుంది?"

"ముప్పయ్‌వేలదాకా ఉండవచ్చు మంచి సెల్..."

"కొన్నవాటికే నేను నిండా మునిగి ఉన్నాను" అన్నాడు.

"అది ఒక్కటీ ఎలాగోలా కొనండీ మీకు ఎవరి బాధా ఉండదు.నిన్నెవరూ బాధపెట్టరు. నువ్వు కొన్న వస్తువుకిచ్చే గ్యారంటీకన్నా గట్టి గ్యారంటీ ఇస్తున్నాను. ఎలాగోలా డబ్బుని రెడీ చేసుకోండి... సాయంత్రం ఇన్‌స్ట్రుమెంట్ కొందాం. నేనే డబ్బు సర్దేవాణ్ణి. నా పరిస్థితీ మీ పరిస్థితే!" అని నెమ్మదిగా తన సీటువైపు జారుకున్నాడు ఆనందం.

మరో రెండు ఆదివారాలు గడిచి మూడోది వచ్చింది. తను వస్తానంటే ఎక్కడ వద్దు అంటాడోనని ఆనందం ధర్మారావుకి చెప్పకుండా వాళ్ళింటికి వెళ్ళాడు. బెల్ మోగించినప్పుడల్లా ధర్మారావే తలుపు తీస్తున్నాడు.

పెళ్ళికూడా చేయక్కర్లేదేమో..."

"ఏం...?"

"ఎంతసేపటికీ ఫేస్‌బుక్, వాట్సప్... అంటూ ఫోన్‌లోనే ఉంటాడు. రేపల్లా నేను మీతో గడపాలనుకుంటున్నా"

"సారీ సర్... రేపు నేను మన ఆఫీస్‌లోనే పనిచేసే కుశ్‌లావ్‌తో మార్కెటింగ్ పనులున్నాయి... అతన్తో వెళ్ళాలి..." ధర్మారావుకి అర్థమైపోయింది. పాపం కుశ్‌లావ్ అనుకున్నాడు!

ఆఫీస్‌లో ధర్మారావు అందరిదగ్గరా అప్పులు చేసి సరిగ్గా తిరిగి చెల్లించలేక కీచులాటలు. ఇంట్లోకూడా ఆనందం లేకుండా తల్లడిల్లిపోవడం ఆనందాన్ని ఇచ్చింది ఆనందానికి.

కుశ్‌లావ్ పరిస్థితి చూసి బాధేసింది ధర్మారావుకి. అతను తేరుకోక ముందే అక్కడనుంచి వెళ్ళిపోయాడు ఆనందం, ఆనందంగా! ⑤

చందమామ రావే

# నిజమైన సన్యాసి



ఒక ఊళ్ళో ఒక గొప్ప సన్యాసి ఉండేవాడు. ఆయన వద్ద ఆనందుడూ, భైరవుడూ అనే ఇద్దరు శిష్యులు చేరారు.

వాళ్ళు తనవద్దకు వచ్చిన రోజూనే సన్యాసివాళ్ళకు రెండు కర్తవ్యాలుచెప్పాడు. స్త్రీనీ, ధనాన్నీ తాకరాదు, ఆపదలో ఉన్నవారిని శాయశక్తులా ఆదుకోవాలి.

ఈ నియమాలలో మొదటిది వ్యక్తిని కష్టాల నుంచి కాపాడుతుంది. రెండవది జీవితాన్ని సార్థకం చేస్తుంది అని సన్యాసి వారికి తెలియజెప్పాడు.

ప్రతి ఉదయమూ వాళ్ళుముగ్గురూ నదికిపోయి, స్నానంచేసి వచ్చేవారు. అప్పుడు సన్యాసి తన శిష్యులకు జ్ఞానబోధ చేసేవాడు.

అనంతరం ముగ్గురూ ఊళ్ళోకి వెళ్ళి, భిక్షాటన చేసి, కుటీరానికి తిరిగివచ్చి, భోజనం చేసేవారు.

రోజూలాగే ఒకనాడు సన్యాసి, భైరవుడూ,



ఆనందుడూ భిక్షాటనకు బయలుదేరి గ్రామంలో మూడువైపులకు వెళ్ళారు.

ఆనందుడు ఒక సందులోకి తిరగగానేఅక్కడ ఒక కుర్రవాడు ఏడుస్తూ నిలబడి కనిపించాడు. ఆనందుడు ఆగి, ఎందుకు ఏడుస్తున్నావని వాణ్ణి అడిగాడు.కుర్రవాడు తన సంగతి ఇలాచెప్పాడు.

వాడు ఒక ధనికుడి ఇంట పనిచేస్తూ ఉంటాడు. యజమాని వాడికి ఒక బంగారుగొలుసు ఇచ్చి, దాన్ని కంసాలి చేత బాగుచేయించి తీసుకురమ్మన్నాడు. కుర్రవాడు ఈ సందు చివరకు వచ్చేసరికి, ఎవడో దొంగ వాడిచేతిలో గొలుసు లాక్కుని పారిపోయాడు.

దొంగ ఎటు వెళ్ళాడో అడిగి తెలుసుకుని ఆనందుడు కుర్రవాడితో సహా అటుకేసి పరిగెత్తాడు.

కొంతసేపటికి ఒక వ్యక్తి తాపీగా నడుస్తూ వాళ్ళకి కనిపించాడు."ఆ ఎర్రపంచెకట్టుకున్నవాడే దొంగ!" అన్నాడు కుర్రవాడు. ఆ మాట చెవినపడగానే దొంగ పరుగులంకించుకున్నాడు. ఆనందుడు వాణ్ణి తరుముకుంటూ వెళ్ళాడు. ఆ సమయంలో భైరవుడు అటుగా వచ్చి, ఆనందుడు పరిగెత్తటం చూసి, విషయమేమిటని కుర్రవాణ్ణి అడిగాడు.

కుర్రవాడు బంగారు గొలుసు దొంగతనం గురించి చెప్పాడు.

ఆనందుడు ఆ దొంగను పట్టుకుని బంగారు గొలుసు తీసుకుంటాడేమో. బంగారాన్ని తాకుతాడేమోనని భైరవుడికి భయం వేసింది. బంగారాన్ని తాకరాదని గురువుగారు చెప్పారు.అందుచేత భైరవుడు కూడా ఆనందుడి వెనకగా పరిగెత్తాడు.

దొంగ చాలాదూరం పరిగెత్తి ఒక కాలువవద్ద ఆగిపోయాడు. అది చిన్న కాలువేగాని, దూకి దాటదగినంత చిన్నకాలువకాదు. ఏంచెయ్యాలో నిర్ణయించుకునే లోపల ఆనందుడు వచ్చి దొంగను పట్టుకున్నాడు. ఆనందుడు దృఢమైన మనిషి, దొంగ బక్కవాడు. అందుచేత దొంగ ఆనందుడితో కయ్యం పెట్టుకోక, అతనికి బంగారుగొలుసు ఇచ్చేసి, దణ్ణం పెట్టి, చెంపలు వాయించేసుకున్నాడు.

ఆనందుడు వాణ్ణి వదిలిపెట్టేశాడు. ఇంతలో భైరవుడు అక్కడికి వచ్చి చేరి, ఆనందుడి చేతిలో గొలుసు చూసి "ఎంతపని చేశావు. ఆనందూ! బంగారాన్ని తాకావు!" అన్నాడు.

ఆనందుడు ఏదో జవాబు చెప్పబోతూండగా వాళ్ళకు స్త్రీ కంఠం వినిపించింది. ఆనందుడు అటు తిరిగి చూసేసరికి, కాలువ అవతలి పక్క ఒక అందమైన స్త్రీ నిలబడి ఉంది. తాను కాలువ దాటటానికి సహాయం చెయ్యమని కోరింది.

స్త్రీ కనపడగానే భైరవుడు ముఖం పక్కకు తిప్పుకున్నాడు. ఆనందుడు మటుకు నడుము లోతుగల ఆ కాలవలోకి దిగి, అవతలికి వెళ్ళి, ఆమెను తన చేతులతోఎత్తుకుని, ఇవతలి ఒడ్డుకుతీసుకుని వచ్చి, గట్టుమీద దించాడు. ఆమె అతనికి తన కృతజ్ఞత తెలుపుకుని తనదారిన తాను వెళ్ళిపోయింది.

భైరవుడు ఆనందుడితో మాట్లాడలేదు. ఆనందుడు బంగారాన్ని తాకినందుకు పశ్చాత్తాపపడకపోగా స్త్రీని కూడా తాకి, గురువు చెప్పిన మొదటి నియమాన్ని పూర్తిగా ఉల్లంఘించాడు.

ఆనందుడు మాత్రం బంగారు గొలుసును కుర్రవాడికి తిరిగి ఇచ్చి, భిక్షాటనకు వెళ్ళిపోయాడు. భైరవుడు రోజుకన్నా ముందుగా కుటీరానికి వచ్చి,సన్యాసి తిరిగిరాగానే జరిగినదంతా ఆయనకు చెప్పేశాడు. సన్యాసినవ్వి,"ఆనందుణ్ణిరానీ,విచారిద్దాం"అన్నాడు. ఆనందుడు రాగానే, "ఆనందూ, నేను చెప్పిన నియమాలను గుర్తుంచుకునే భిక్షాటన చేశావా?" అని అడిగాడు సన్యాసి. అవునన్నాడు ఆనందుడు.

"విశేషాలేమైనా ఉన్నాయా?" అని సన్యాసి మళ్ళీ అడిగాడు.

"ఇద్దరు వ్యక్తులను అవసరంలో ఆదుకోగలిగాను" అన్నాడు ఆనందుడు.

"ఎవరు వాళ్ళు?" అని సన్యాసి అడిగాడు.

"ఎవరైనదీ నేను సరిగా గమనించలేదు. ఒకరిది ఆపద, మరొకరిది అవసరం. వాళ్ళకు నాచేతనైన సహాయం చేశాను. ఎవరితోనూ బంధాలు ఉంచుకోరాదని సెలవిచ్చారు గదా? వాళ్ళను గురించి అప్పుడే మరిచిపోయాను" అన్నాడు ఆనందుడు.

"సరే, వెళ్ళి కాళ్ళు కడుక్కురా. భోజనం చేద్దాం" అని సన్యాసి ఆనందుణ్ణి అవతలికి పంపి,

భైరవుడితో "చూశావా? ఆనందుడు నిజమైన సన్యాసి. నేను చెప్పిన నియమాలను అతను బాగా అర్థం చేసుకున్నాడు. స్త్రీనీ, ధనాన్నీ తాకవద్దంటే నా ఉద్దేశం వాటిని కోరవద్దని. అతను కోరిక లేకుండానే బంగారాన్ని, స్త్రీనీ కూడా తాకాడు.

నువ్వు వాటిని తాకకపోయినా బంగారం బంగారమన్నమాట. స్త్రీ స్త్రీ అన్న మాటా మరిచిపోలేకుండా వున్నావు!అతను చేతితో తాకి మరచిపోయినవాటిని నువ్వు ఇంకా నీ మనస్సుతో తాకుతూనే ఉన్నావు" అన్నాడు.

భైరవుడు తన తప్పును తెలుసుకుని, సిగ్గుతో తల వంచుకున్నాడు.

వసుంధర





# WhatsApp

రాజేష్ కొత్త ఉద్యోగానికి ఇంటర్వ్యూకి వెళ్ళాడు.

అధికారి : రాజేష్! మీరు ఇంతకుముందు చేసిన కంపెనీలో ఎందుకు మానేశారు.

రాజేష్ : వాళ్ళు ఆఫీసు వేరేచోటుకు మార్చారు. నాకు ఎక్కడికెళ్ళాలో తెలీలేదు.

▼

స్త్రీలు ఎక్కువగా మాట్లాడతారు కదా. అదే విషయంపై పరిశోధన చేసిన శాస్త్రవేత్తలు ఒక అద్భుతాన్ని కనుగొన్నారు.

స్త్రీలు మాట్లాడేటప్పుడు కదిలే నాలుకనుండి విద్యుత్ ఉత్పత్తి చేస్తే ప్రపంచంలో కరెంటు కోత ఉండదు.

ఒకవేళ వోల్టేజ్ తగ్గిందనిపిస్తే వారి పుట్టింటి వారిని చిన్న మాట అంటే చాలు. ఇక ఎప్పటికీ విద్యుత్‌కు అంతరాయం ఉండనేవుండదు.

▼

పూర్వం అవతారం ఏమీ తోచకపోతే ఇతరుల గురించి పరిశోధన చేసేవాడు.

ఒకరోజు అతను పిచ్చాసుపత్రి పక్కనుండీ వెళుతుంటే లోపలున్నవాళ్ళందరూ కోరస్‌గా 21, 21, 21 అని అరుస్తున్నారు.

అవతారం డిటెక్టివ్ బుర్ర వెంటనే విషయం తెలుసుకోవాలనుకుంది.

కాని, గోడేమో బాగా ఎత్తులో ఉంది. వెతికితే గోడలో ఓ కంత కనిపించింది. ఓ కన్నుపెట్టి లోపలికి తొంగిచూశాడు. చూస్తుంటే లోపల నుండి ఒకడు పుల్లతో కంట్లో పొడిచాడు.

బాధతో విలవిలలాడుతూవుంటే చెవికి "22, 22, 22' అని అరుపులు వినిపించాయి.

▼

భార్య : పెళ్ళికిముందు ఎంతో ప్రేమతో ఉండే వాళ్ళు. పెళ్ళి తర్వాత ఆ ప్రేమంతా ఎక్కడికి పోయింది?

భర్త : పరీక్షలు రాసినతరువాత మళ్ళీ ఏ పిచ్చోడయినా చదువుతాడుటే.

▼

ఈ రోజుల్లో ధర్మం నాలుగు కాళ్ళమీద నడుస్తోంది.

1) ఇన్‌కమింగ్ కాలు
2) అవుట్ గోయింగ్ కాలు
3) మిస్స్‌డ్ కాలు
4) కాన్ఫరెన్స్ కాలు

▼

బరువు తగ్గాలనుకునేవారికి ఆవాలు ఎంతో ఉపయోగపడతాయి.

ఎలా వాడాలి?

ఒక కేజీ ఆవాలు ఒక గిన్నెలో తీసుకోవాలి. తరువాత వాటిని నేలమీద పారబోయాలి. ఆ తరువాత కిందకు వంగి ఒక్కో ఆవగింజను ఏరి



Courtesy : ABHIYAAN

మళ్ళీ గిన్నెలో వేయాలి. ఇలా వారానికి నాలుగు రోజులు చేయాలి. ఆవాలు ఏరి గిన్నెలో వేసిన తరువాత కేజీ బరువు ఉన్నాయో లేవో మళ్ళీ చెక్ చేసుకోవాలి.

ఒకవేళ జీరో సైజ్ కావాలనుకుంటే ఆవాలకు బదులు గసగసాలు వాడండి. బరువు తగ్గండి ఆనందంగా. జీరో సైజు సొంతం చేసుకోండి.

▼

సునీత : ఏమండీ! ఈ చీరెలో నేను ఎలా ఉన్నాను? అని అడిగింది.

కామేష్ : చాలా బాగున్నావే.

సునీత : నేనీమధ్య తెల్లబడ్డాను కదండీ?!

కామేష్ : అవును, నిజంగానే రంగొచ్చావు.

సునీత : ఈ వారంలో కొంచెం సన్నబడ్డాను కదా?

కామేష్ : నీ బొందే! నీ బొంద! ఇంక అబద్ధాలు చెప్పటం నావల్లకాదు.

▼

మా కాలనీలో వినాయకచవితి పందిరి వేశారు. నేను పూజ జరుగుతుంటే ముందు వరసలో కూర్చొనివున్నాను.

పూజతర్వాత పూజారిగారు హారతి పళ్ళెం పట్టుకొనివచ్చారు. నేను చాలా కష్టపడి, అన్ని జేబులూ వెతికి మధ్యలో టేపంటించిన పదిరూపాయల నోటు పళ్ళెంలో వేశాను. ఇంతలో వెనుక సీటులో కూర్చొన్న వ్యక్తి నా భుజం తట్టాడు.

2,000 నోటు చేతికిచ్చాడు. అతని దాతృత్వానికి ఆశ్చర్యపోయి పళ్ళెంలో వేశాను. ప్రసాదం తీసుకుని లేచి వెళుతూ వెనుక వ్యక్తితో- "నేను పదిరూపాయలు వేయటానికే ఆలోచించాను... మీరు చాలా గ్రేటండీ, రెండువేలరూపాయలు నవ్వుతూ ఇచ్చారు" అన్నాడు.

వెనుక వ్యక్తి "అదేంలేదండీ, మీరు పది రూపాయలు ఇచ్చినపుడు ఈ 2,000 మీ జేబునుండి జారి కిందపడ్డాయి. నేను చూశానుకాబట్టి ఇచ్చాను అంతే" అని నవ్వుతూ అక్కడ నుండి వెళ్ళిపోయాడు. ◆

భక్తుడు : నా ప్రేయసికి గుండెలో గుడి కట్టాను స్వామీ. అయినా నన్ను వదిలేసింది.

దేవుడు : ఈ మధ్య అమ్మాయిలు గుడికెక్కువ రావట్లేదు. పానీపూరీ బండిపెట్టు, కనీసం సాయంత్రమైనా కనిపిస్తారు.

▼

భార్యాభర్తలిద్దరూ లంచ్ తినటం పూర్తయింది. భర్త తన కంచం వాష్‌బేసిన్‌దగ్గర శుభ్రం చేయటం మొదలుపెట్టాడు.

భార్య : నా పరువు తీయమాకు. మనం ఉన్నది హోటల్‌లో. ఇంట్లో కాదు.

▼

అచలపతి ఫ్యామిలీ ఆనందభవన్‌లో డిన్నర్ పూర్తిచేశారు. భార్య ఆండాళ్ళు భర్తతో అంది, "ఏమండీ! మనకు వడ్డించిన వెయిటర్‌కు ఏదైనా 'టిప్' ఇవ్వండి.

అచలపతి వెయిటర్‌ను పిలిచి ఇలా చెప్పాడు- "పెళ్ళిచేసుకోకు"

# సెక్స్ AND సైకాలజీ



Courtesy : MAXIMINDIA

సి.ఆర్.కె. కాకినాడ

**సెనైల్ వెజినైటిస్ అంటే ఏమిటి?**

సెనైల్ వెజినైటిస్‌నే ఎట్రోఫిక్ వెజినైటిస్ అంటారు. యోని మార్గంలోపల గోడలకి టిష్యూపొర ఉంటుంది. స్త్రీకి 40-50 సంవత్సరాలు వచ్చిన తర్వాత ఓవరీ ఎండిపోవడంతో ఈస్ట్రోజన్ హార్మోన్ ఉత్పత్తి కూడా బాగా తగ్గిపోతుంది.

ఈస్ట్రోజన్ హార్మోన్ ఉత్పత్తి చక్కగా ఉన్నంత కాలం యోనిమార్గంలో పొర దళసరిగా ఉండి అందులో గ్రంధులు చక్కగా పనిచేస్తూ ద్రవాలు ఊరుతూ యోని మార్గాన్ని తడిగా ఉంచడమే కాకుండా వ్యాధి క్రిములనుండి రక్షణ కలిగిస్తూ యోని మార్గాన్ని ఆరోగ్యంగా ఉంచుతుంది.

ఈస్ట్రోజన్ హార్మోన్ ఉత్పత్తి తగ్గిపోవడంతో యోని మార్గంలోని పొర పలచగా తయారవుతుంది. అందులోని గ్రంధులు పని చేయకుండా అవుతాయి. ద్రవాలు చాలా తక్కువ ఊరతాయి. రక్షణ యంత్రాంగం తగ్గిపోతుంది. దాంతో యోని లోపల మంట, దురద, నొప్పి వంటివి కలుగుతాయి. తరచూ బ్యాక్టీరియల్ ఇన్‌ఫెక్షన్లు చోటుచేసుకుంటాయి.

ఈ రకంగా ఈస్ట్రోజన్ హార్మోన్ తగ్గిపోవడంతో యోని మార్గంలో పొర పలచనవడం, బ్యాక్టీరియల్ ఇన్‌ఫెక్షన్ కలగడాన్ని 'సెనైల్ వెజినైటిస్' అంటారు. బహిష్టులు శాశ్వతంగా ఆగిపోయిన స్త్రీలో సెనైల్ వెజినైటిస్ పరిస్థితి అతిసహజమైనది.

అందుకనే మెనోపాజ్ వచ్చిన స్త్రీ సెక్స్‌లో పాల్గొన్నప్పుడు మంట అనిపించి బాధపడటం, బ్యాక్టీరియల్ ఇన్‌ఫెక్షన్ కలిగి యోనిలో దురద అనిపించడం ఉంటాయి. సెనైల్ వెజినైటిస్‌నికూడా తగిన మందులు, వ్యక్తిగత పరిశుభ్రతను పాటించడంద్వారా తేలికగా కంట్రోలు చేసుకోవచ్చు.

పి.ఎన్. పామర్రు

**మా పాప వయసు ఐదుసంవత్సరాలు. అమ్మాయికి పెద్దవాళ్ళకి అయినట్లు తెలుపు అవుతోంది. మానం దగ్గర ఎప్పుడూ గోక్కుంటుంది. చిన్నపిల్లకే తెలుపు అవడం ఏమిటో నాకు అర్థమవడంలేదు. చిన్నపిల్లల్లో కూడా తెల్లబట్ట వ్యాధి ఉంటుందా?**

చిన్నపిల్లల్లో కూడా తెల్లబట్ట వ్యాధి ఉంటుంది. దీనినే 'చైల్డ్ హుడ్ ల్యుకోరియా' అంటారు లేదా పిడియాట్రిక్ ఉల్వో వెజినైటిస్ అంటారు. ఇలా తెల్లబట్ట అయ్యేవాళ్ళల్లో తెలుపు తెల్లగానో, పసుపు రంగులోనో, పచ్చగానో ఉండవచ్చు. వాసన కూడా వేస్తుంది. యోనిదగ్గర దురద ఉంటుంది. మూత్రానికి వెళ్ళినప్పుడు మంట అనిపిస్తుంది. యోనిదగ్గర ఎర్రగా వాస్తుంది, యోనినుంచి కొద్దిగా రక్తంకూడా రావచ్చు. చిన్నపిల్లల్లో తెల్లబట్ట అవడానికి వ్యక్తిగత పరిశుభ్రత లోపించడం ప్రధాన కారణం.

ఎక్కువ ఒళ్ళు ఉన్న ఆడపిల్లల్లో తెల్లబట్ట అవడం ఎక్కువగా కనపడుతుంది. కొందరు ఆడపిల్లలకి ఆడుతున్నప్పుడు నేలమీద కూర్చోగా యోనిలోకి చిన్న రాళ్ళు, గింజలుదూరడం కారణం. యోనిదగ్గర కలిగే ఇన్‌ఫెక్షన్లు కూడా తెల్లబట్టకి మరొక కారణం.

బ్యాక్టీరియల్, ఫంగల్ ఇన్‌ఫెక్షన్లవలన తెల్లబట్ట ఎక్కువ అవుతుంది. విరోచనంలో నులిపురుగు పడే వాళ్ళల్లో కూడా తెల్లబట్ట అవడం ఉంటుంది. ఆడపిల్లకి తెల్లబట్ట అవుతున్నప్పుడు పరీక్షచేసి కారణం ఏదనేది నిర్ధారించాలి. ముఖ్యంగా వ్యక్తిగత పరిశుభ్రత గురించి శ్రద్ధ వహించాలి. అవసరాన్నిబట్టి యాంటీ బయోటిక్ మందులు వాడాలి. తగిన చికిత్సతో చిన్నపిల్లల్లో కలిగిన తెల్లబట్ట వ్యాధి తగ్గిపోతుంది.

జి.ఎమ్. కాకినాడ

**నాకు సెక్స్ కోరికలు ఎక్కువగా ఉంటాయి. రోజూ సెక్స్ కావాలి. కాని నాకు గర్భాశయంలో గెడ్డలు ఉన్నాయి. దానివల్ల బ్లీడింగ్ అధికంగా అవుతుంది. డాక్టర్ గర్భసంచి తీసేయాలన్నారు. ఆపరేషన్ చేసి గర్భసంచి తీసేస్తే సెక్స్ లేకుండా అవుతుందా?**

ఆపరేషన్‌చేసి గర్భసంచి తీసినప్పటికీ మామూలుగానే సెక్స్ కోరికలు ఉంటాయి, సెక్స్‌లో ఎంజాయ్‌మెంట్ ఉంటుంది. ఎటువంటి అసంతృప్తి ఉండదు. మీరు నిర్భయంగా ఆపరేషన్ చేయించుకోవచ్చు.

పి.ఆర్.కె. రాజమండ్రి

**మాకు పెళ్ళి అయ్యి నాలుగు సంవత్సరాలైంది. ఇంతవరకు పిల్లలు లేరు. ఎక్కడికైనా వెళ్ళాలంటే, ఎవరితోనైనా మాట్లాడాలంటే షేమ్‌గా ఉంటోంది. మీకు పిల్లలు ఎంతమంది అని అడిగితే లేరని చెప్పడానికి ఎంతో బాధగా ఉంటోంది.**

# రెచ్చగొట్టి... సాహసం చేసి... ఆనందం పొందాలి

మాటలు చాలా శక్తివంతమైనవి. వాటితో ఎన్నో సాధించవచ్చు. ఎదుటివారిని తెలివిగా బుట్టలో వేసుకోవటం మాటలద్వారా సాధ్యమవుతుంది. ఇతరులను బాధించేందుకు మాటలు పనికొస్తాయి. మాటలతో రెచ్చగొట్టి ఆ మాటలను పోట్లాటలోకి తీసుకువెళ్ళేలా చేస్తుంటారు. కాని మాటలను మరోలా కూడా ఉపయోగించవచ్చు.

మాటలతో ఆశలను పెంచుకోవచ్చు. సెక్సీ మూడ్‌లోకి తీసుకువెళ్ళవచ్చు. మాటలతో రెచ్చగొడితే ఆనందం తారాస్థాయిలో పొందగలిగేది సెక్సీ అంశాలలోనే. వివాహపు తొలి సంవత్సరాలలో మాటలకు అంతగా అవసరం ఉండకపోవచ్చు.

మాటలు లేకుండా నేరుగా పడకగది రంగంలోకి దిగినా అభ్యంతరాలుండవు. కాని క్రమంగా సెక్స్ బాగా అలవాటు అయినతర్వాత, పిల్లాపాపల బాధ్యతలతో అలసిపోయిన ఆమె మనసు ముందుగా మాటలు, ఆ తర్వాతే చేతలను కోరుకుంటుంది.

ఆమెలో వచ్చిన ఆ మార్పును అర్థంచేసుకోలేనివారు తమ పాత పద్ధతిలోనే మాటలు లేక చేతలకే ప్రాధాన్యతనిచ్చి సెక్స్‌లో మజాని కోల్పోతారు. అందుకే మాటలకున్న శక్తిని అర్థంచేసుకుని ఆమెలో సెక్సీపరమైన ఆశలను పెంచాలి.

ఇది చాలా సులభమైన పని. మాటలు తెలియాలి అంతే. ఒకవేళ మాటలు ప్రారంభంలో కుదరకపోయినా పరవాలేదు మెసేజ్‌లు పంపవచ్చు. చిన్న చిన్న ఉత్తరాలు రాయవచ్చు. మాటలు వస్తే నేరుగా ఫోన్‌లో మాటలు మాట్లాడవచ్చు. ఆమె డ్రెస్‌ని పొగడటం, సాయంత్రం వచ్చేసరికి ఆమెను ఏ డ్రెస్‌లో, ఎలాంటి అలంకరణలో చూడాలనుకుంటున్నది ఫోన్‌లో చెప్పగల్గితే అందుకు పొంగిపోని భార్య ఉండదు.

'నాకు నీ అపాయింట్‌మెంట్ కావాలి, రాత్రి పది గంటలకు' అని ఒక ఆఫీసరు హోదాలో ఉన్న మగవాడు తనను అడగటాన్ని ఆమె చాలా గర్వంగా ఫీలవుతుంది.

అపాయింట్‌మెంట్ ఇస్తే నేను ఇలా చెయ్యాలనుకుంటున్నాను... నీ ఆనందం ఈ స్థాయిలోకి చేరుతుందని ముందుగానే మధ్యాహ్నం, సాయంత్రం వేళ సందేశం ఇస్తారో... అప్పుడు ఆమెలో ఆలోచనలు, కోరికలు పెరుగుతాయి.

సాయంత్రంకోసం ఎదురుచూస్తుంది. ఆ రాత్రి అందుకోబోయే ఆనందపు కలలు కంటుంది. అలా ఆమె మనసును సెక్సీపరంగా రెచ్చగొట్టి ఉంచినపుడు ఇతర ఆలోచనలమీదికి ఆమె ఆలోచనలు వెళ్ళవు. గతంలో ఏవైనా ఒకటి రెండు విభేదాలున్నా ఆమె మరచిపోయి వశమవుతుంది.

మాటలతోపాటు చిరుచేతల సాహసం కూడా అవసరమే. ఇటువంటి సాహసాలు మగవారు యవ్వనంలో చేసేవుంటారు. మధ్యవయసులో కూడా ఆ చిరు సాహసాలు అవసరం అనే విషయం మరచిపోతారు. అలాకాక ఈ వయసులోనే ఆ సాహసాలు అవసరమని గుర్తుపెట్టుకోండి.

కలిసి సోఫాలో కూర్చుని, పక్కపక్కనే ఉన్న సమయంలో చేతులకు పనిచెప్పే చిరుసాహసం చేయవచ్చు. నలుగురికి తెలియకుండా టచింగ్స్ ఇవ్వటం కూడా ఒక సాహసమే. పడకగదికి ఆవలకు సెక్స్‌ని తీసుకువచ్చారా! ఎప్పుడైనా.

హాల్‌లో, గార్డెన్‌లో ఎక్కడయినా సెక్స్‌కి బాగుంటుంది. ఆరంభంలో డ్రెస్ తీయటానికి ఆమె మొహమాటపడివుంటుంది. ఆ తర్వాత అలవాటు అయి డ్రెస్ తొలగిస్తుంది.

కాని డ్రెస్ ఉంచుకునే సెక్స్‌లో పాల్గొని పాత అనుభవాలను తిరిగి గుర్తుతెచ్చుకోగలరు. అద్దాల ముందు నిలబడి సెక్సీ సాహసాలను ప్రత్యక్షంగా చూస్తూ, తమ ప్రయోగాలను తామే ప్రోత్సహించుకుంటూ ముందుకు వెళ్ళటం అనేది చాలా చాలా ఆనందం ఇచ్చే విషయం.

మధ్యవయసులో తిరిగి చిరుస్పర్శలను కోరుకుంటుంది శరీరం. పాదం, చెయ్యి, బుగ్గలు, మెడ... ఇలా ప్రతి భాగంమీదా స్పర్శశక్తిని చూపి ఆమెను ఒక కొత్త లోకానికి తీసుకువెళ్ళగలగటమనేది మగవారి వేళ్ళకు ఉంటుంది. మరి సందేహమెందుకు. మాటలు... చేతలు... ఆపైన ఆనంద సూత్రాన్ని అనుసరించండి. ◆



డా॥ జి. సమరం




## Emotionally and sexually satisfied and generally content with life

***మేము రెగ్యులర్‌గా సెక్స్‌లో పాల్గొంటున్నాము. రోజుకి 3-4 సార్లు కూడా సెక్స్‌లో పాల్గొంటున్నాము. అయినా గర్భం రాలేదు ఎందుకని? గర్భం రావాలంటే ఇంతకంటే ఏం చేయాలి?***

గర్భం రాకపోవడానికి భార్యలో లోపం ఉండవచ్చు లేదా భర్తలో లోపం ఉండవచ్చు. ఒక్కొక్కసారి ఇద్దరిలోనూ లోపం ఉండవచ్చు. అందుకని ఇద్దరూ డాక్టర్ దగ్గరకి వెళ్ళి పూర్తి పరీక్షలు చేయించుకోవాలి.

లోపంబట్టి చికిత్సచేస్తే గర్భం వస్తుంది. కాబట్టి మీరు వెంటనే డాక్టర్‌ని కలవండి.

జె.కె. — హైదరాబాద్

***నా వయస్సు 40 సంవత్సరాలు. పెళ్ళి అయ్యి 12 సంవత్సరాలైంది. ఇద్దరు పిల్లలు కూడా ఉన్నారు. విచిత్రం ఏమిటంటే ఇంతవరకు మా ఆవిడకు సెక్స్‌లో ఎటువంటి అనుభూతీ కలగలేదట.***

***నేను అడిగితే కాదనలేక సెక్స్‌లో పాల్గొనడమే తప్ప తనకి సెక్స్‌మీద ఆసక్తి వుండటం కాదంది. నేను సెక్స్ చేస్తున్నప్పటికీ సెక్స్ చేసినట్లే అనిపించదట. మరి నాకుమాత్రం సంయోగంలో చెప్పలేనంత మధురానుభూతి కలుగుతుంది. ఆమె యోనిలో నా పురుషాంగం ప్రవేశించి నాకు ఎంతో తృప్తి కలగగా ఆమెకు ఏమీ అనిపించకపోవడం ఏమిటి? నా భార్య ఎప్పటికైనా సెక్స్‌లో థ్రిల్ పొందగలదా, లేదా?***

ఆమెలో ఫ్రిజిడిటీ ఉంది. ఫ్రిజిడిటీ ఉన్నవాళ్ళు సెక్స్‌లో పాల్గొన్నప్పటికీ ఎటువంటి అనుభూతీ పొందరు. ఫ్రిజిడిటీ అనేది ఒక ప్రత్యేకమైన మానసిక స్థితి. సెక్స్‌లో వాళ్ళకి మనస్సు కలగదు

సెక్స్‌లో పాల్గొన్నప్పటికీ ఎటువంటి అనుభూతీ కలగదు. తృప్తి కలగకపోవడమనేది కామనాడులు లేకపోవడం కాదు, కామనాడులు ఉంటాయి కాని స్పందించే మనస్సు లేకపోతే కామనాడులు కూడా స్పందించవు. ఫ్రిజిడిటీ ఉన్నవాళ్ళకి సైకోథెరపీ ద్వారా మార్పు తీసుకురావచ్చు.

సెక్స్‌లో మనస్సు కలిగేటట్లు చేయవచ్చు. అనుభూతి పొందేటట్లు చేయవచ్చు. మీరు తప్పకుండా ఒకసారి డాక్టర్‌ని కలవండి.

ఎ.ఎన్. — హైదరాబాద్

***నేను డ్రగ్స్‌కి అలవాటుపడ్డా. డ్రగ్స్ లేనిదే బతకలేని స్థితి ఏర్పడింది. డ్రగ్స్ తీసుకుంటేనే కాస్తో కూస్తో మనిషిలాగా ఉంటా. లేకపోతే పిచ్చివాడిలా మారతాను. ఏం మాట్లాడుతున్నానో, ఏంచేస్తున్నానో నాకు అంతుపట్టడం ఉండదు. అందరూ నన్ను 'ఛీ' కొడుతున్నారు. నేనీ అలవాటునుంచి బైటపడటం సాధ్యమేనా?***

డ్రగ్స్ మనిషిని శారీరకముగా, మానసికముగా పూర్తిగా నాశనం చేస్తాయి. వ్యక్తిత్వం పూర్తిగా దెబ్బతింటుంది. మీకు మారాలనే దృఢసంకల్పం ఉన్నట్లయితే డి-ఎడిక్షన్ థెరపీ ద్వారా ఆ వ్యసనం నుండి బయటపడగలరు. ఆరోగ్యంగా మారగలరు.

మానసిక వైద్యనిపుణులు డి-ఎడిక్షన్ చికిత్స చేస్తారు. వారిని సంప్రదించండి.

డా॥ జి. సమరం వాసవ్య నర్సింగ్‌హోమ్
బెంజిసర్కిల్ విజయవాడ 520 010 ఫోన్
0866-2472370 E-mail drsamaram@hotmail.com www.gsamaram.com

"ఎక్కడో ఈ మారుమూలున్న మన నల్లమిల్లోరిపాలెం గురించి తమిళనాడు మనిషైన ఆ శేషన్‌కెలా తెల్సిందంట?" ఆ సాయంత్రం కాలవగట్టుమీద నడుస్తా అడిగేడు రామభద్రుడు.

"గూగుల్లో పట్టుకున్నాడని ఎవరో అన్నారు మాయ్యా"అన్నాడు పక్కనే నడుస్తున్న కోటిగాడు.

"ఆళ్ళ తమిళనాడులో అన్ని ఊళ్ళుండగా దత్తత తీసుకోడానికి మనూరే ఎందుక్కావల్సొచ్చిందంట ఆ శేషన్‌కి. అసలు మనూళ్ళో ఏ గొప్పుందని దత్తత తీసుకున్నాడా మనిషి?"

"ఆయనగారు ఊళ్ళోనే వున్నాడు గదా... ఎళ్ళి అడిగేస్తే తేలిపోద్ది గదా?"

"సరే... పదండి"రేవులోకొచ్చిన మేం తాతబ్బాయి గాడి బల్లకట్టెక్కి ఆ ఒడ్డుమీదకి దిగేక నల్లమిల్లోరిపాలెంవేపు నడుస్తున్నాం.

ఎత్తైన ఆ గోదావరి కాలవగట్టు దిగువలో అయిదొందల గడపున్న చిన్న ఊరది.

ఆ ఊళ్ళోకెళ్ళడానికి వేసిన ఎర్రకంకరబాటని ఇంకా వెడల్పు చేయించేపనిలో వున్న శేషన్‌గారితో "ఏ ఊళ్ళో చూసినా సిమ్మెంటురోడ్లే. మీరేంటీ మట్టిబాటలు, ఎర్రకంకరబాటలూ వేయిస్తున్నారు?" అని మిషనుకుట్టు సత్తార్ అడిగితే-

"దానికో కారణముంది తర్వాత చెప్తాలే" అన్న శేషన్‌గారు "ఊరు తూర్పువేపు కాలవదిగువలో ఒక ఎకరం నేలలో మామిడితోట వుంది ఎవరిదది?" అన్నాడు. "కోరి సత్తాలుగారి వీరెడ్డి అని ఇప్పుడు వైజాగులో వుంటన్నార్లే ఎందుకడిగేరు?" అన్నాడు రామభద్రుడు.

"ఆ తోట నేను కొనాలనుకుంటున్నాను"అన్నాడు శేషన్‌గారు. "అబ్బే... అమ్మాల్సిన అవసరం లేదాళ్ళకి" అన్నాడు కోటిగాడు.

"కొంచెం ఎంక్వైరీ చేసి చూడండి ఎంత రేటన్నా పర్లేదు నేను కొనితీరాలి దాన్ని" అన్నాడు శేషన్.

"ఆ తోటలో మామిడిచెట్లన్నీ పుల్లిరిగిపోయినియ్యి. ఏ పంటారాని ఆ తోట మీకెందుకండీ?" అన్నాడు రామభద్రుడు. అదో రకంగా చూసిన శేషన్ "ఎందుకంటారా సస్పెన్స్" అంటా నవ్వేడు. "సస్పెన్సేంటండి బాబు?" అన్నాడు సత్తారు.

"సస్పెన్సే" అంటా నవ్వేసిన శేషన్. "మీరంతా షాకయ్యే విషయమొకటి చెప్పనా?" అన్నారు.

"ఏంటి?" అన్నాడు సత్తారు.

"మనం వెడల్పు చేస్తున్న ఈ ఎర్రకంకరరోడ్డుకి రెండుపక్కలా చెట్లు నాటబోతున్నాం...అవన్నీ వంద ఏళ్ళ వయసు ఉన్న వృక్షాలు. ఎక్కడ్నించో తవ్వి తెచ్చి, కెమికల్స్ వేసి పాతిపెట్టి బతికించబోతున్నాం. దీన్ని రీట్రాన్స్‌ప్లాంటేషనంటారు... తొరలో ఈ ట్రాన్స్‌ప్లాంటేషన్స్ మన ఊరంతా నింపేస్తాను" అన్నారు. "అంటే తొందర్లో మనూరు పెద్ద పెద్ద చెట్లతో నిండిపోద్దన్నమాట" అన్నాడు సత్తారు.



వంశీ

"చెట్లనీడల్లో ఊరు అని పేరెల్లిపోద్ది. అప్పుడు నీడ తప్ప ఎండ పొడే ఉండదు మనూళ్ళో" అన్న శేషన్ గారు తను దత్తత తీసుకున్న ఈ ఊరుని ఇంకా ఎలాగెలాగ డెవలప్ చెయ్యాలనుకుంటున్నారో చెపుతుంటే వినడానికి చాలా సంబరంగానూ, ఆశ్చర్యంగానూ వుంది.

ఆయన దగ్గరకు వెళ్ళిన రామభద్రుడు "అది సరేగాని శేషన్ గారు... వేరే రాష్ట్రంవారైన మీరు మా రాష్ట్రంలో ఈ మారుమూల ఉన్న ఏ ఊరూ, పేరూ లేని ఈ నల్లమిల్లోరిపాలేన్ని దత్తతతీసుకోడానికి వెనకాల కారణమేంటండీ?"

"వుంది... చాలా పెద్ద కారణమే వుంది" అన్నారు శేషన్.

"ఏంటండీ?" ఆత్రంగా అడిగిన రామభద్రుడి కళ్ళల్లోకి చాలా సూటిగా చూస్తా-"సస్పెన్స్" అన్నారు.

"ఇందాక కూడా ఇలానే అన్నారు"

# నల్లమిల్లోరి పాలెం



అన్నాడు సత్తారు. "అవును అన్నాను... నేను మీకు జవాబు చెప్పడానికో రోజు వస్తుంది.అందాకా సస్పెన్సే మరి" అనేటప్పటికి 'ఈయన చేస్తున్నదానికి వెనకాల చాలా పెద్ద కారణమే ఉండుండాలి' అనుకుంటా చెరువు పక్క రాములోరి గుడివేపు నడుస్తా-

"ఆ కారణమేవయ్యివుంటది? కోరి సత్తాలుగారి వీరెడ్డి మామిడితోట కావాలంటున్నాడు ఎందుకూ?" అంటా జుట్లు ఎంతపీక్కున్నా ఏదీ అందటంలేదు.

వైజాగులో ఉంటున్న ఆ కోరి సత్తాలుగారి వీరెడ్డిని పట్టుకున్న శేషన్ ఆ మామిడితోట అమ్మమంటా కూర్చున్నాడు.

"అమ్మను గాక అమ్మను" అంటున్నాడా వీరెడ్డి. "మీకెంత రేటన్నా ఇస్తాను" అంటున్నాడు శేషన్.

చాలా మర్యాదగా శేషన్‌గారిని కూర్చోబెట్టిన వీరెడ్డి "మా పల్లెటూళ్ళగురించి మీకు తెల్దండీ... మా ఆస్తుల్లో సెంటుభూమి అమ్ముకున్నా ఈడేదో దివాళా తీసేడ్రా అక్కడ అందుకే తెగనమ్ముకుంటున్నాడు అంటా ఒకటే మోసేస్తారు వూళ్ళో... అర్థమైందాండి?" అన్నాడు.

వాళ్ళ తమిళనాడులో చాలా గొప్ప గొప్పోళ్ళతో ఈ జిల్లా కలెక్టర్‌కి ఫోన్లు చేయించి ఇంకా నానా అల్లరీ చేసి మొత్తానికా వీరెడ్డి దగ్గర తోటని బోలెడు రేటుకి కొనేసేడు. అంతా అయిపోయిం తర్వాత శేషన్ దగ్గరకొచ్చిన వీరెడ్డి ఎందుకూ పనికిరాని మా తోటని ఎందుకింత రేటెట్టి కొన్నారు?" అన్నాడు.

"అదో కథ... అదో పెద్ద సస్పెన్స్ కథ" అంటా వెళ్ళిపోయిన శేషన్ కాకినాడ శ్రీరామ్‌నగర్లోవున్న పెద్ద ఆర్కిటెక్ట్‌ని పిల్చి తన మనసులోవున్న ఒక మండువా లోగిలి స్కెచ్ గీయిస్తుంటే చూస్తున్న-

మాకందరికీ ఇతను చేస్తున్న ఈ పనుల వెనక నిజంగానే ఏదో సస్పెన్స్ కథవుంది... మరదేంటో??? అన్న గగుర్పాటు కలిగింది. బోల్డంతమంది పనోళ్ళని పెట్టి మొదలెట్టిన ఆ పాతకాలం నాటి మండువా లోగిలి పని చాలా తక్కువ కాలంలోనే పూర్తయ్యింది.అయితే కరెంటు వేయించలేదా ఇంటికి. అంత పెద్ద లోగిట్లో చీకటిపడ్డాకా వెలుగుతున్న హరికెన్ లాంతర్లూ, చిమ్నీదీపాలు, ఇలాయి బుడ్లూ ఒకనాటి కాలాన్ని గుర్తుచేస్తున్నాయి.

పసలపూడి చిట్టిరెడ్డి ద్వారా పందిరిపట్టి మంచాలు, పడక్కుర్చీలు, ఉయ్యాలబల్లలూ తెప్పించి ఇల్లంతా సర్దించేడు.ఎప్పుడో పాతకాలం నాటి ఇళ్ళు తప్ప మేం పుట్టాకా కొత్తగా కట్టిన లోగిలి చూడ్డం ఇదే. అది చూసిన ఊళ్ళో పాతకాలం వాళ్ళు మనిళ్ళల్లో కూడా కరెంటు తీయించేద్దాం అన్న ఆలోచనల్లో పడ్డారు.

"ఏ విలేజ్‌లో చూసినా ఇళ్ళు మాడ్రన్‌గా కట్టి ఏ.సి.లు బిగిస్తుంటే మీరేంటి వందేళ్ళ నాటి మోడల్ లోగిలి కట్టి ఏకంగా కరెంట్ తీసేసేరు?" అంటా రామభద్రుడు అడిగితే-

చప్పుడు లేని సస్పెన్స్ నవ్వు నవ్వేసి ప్రేమగా మా భుజాలమీద చేతులేసి "తర్వాత చెపుతాగాని మన ఇంట్లో చేసిన వంటలన్నీ ఈ కాలం జనం మరచిపోతున్నవి. ఆ పాతకాలం వంటోళ్ళని వేటాడి పట్టుకొచ్చి మరీ వండిస్తున్నారు.., భోంచేసి వెళ్ళండి" అన్నారు. ఆయన చేస్తున్న పన్లూ, ప్రవర్తనా చాలా చిత్రంగా తోస్తున్నాయి మాకు.

ఎక్కడ్నించో వచ్చినాయన ఇలా చెయ్యడానికి కారణం ఏదన్నావుందా?... ఏదో వుంది అనుకుంటా భోజనాలు కానిచ్చేం. చుట్టుపక్కలున్న మా ఊళ్ళల్లో పనోళ్ళంతా మా ఊళ్ళోనే కలతిరుగుతా, ఎక్కడజూసినా ఏదో పని చేస్తా వున్నారు.

ఆళ్ళందరికీ పనులు చెపుతా ఎవరికీ ఊపిరాడనియ్యకుండా ఊరంతా కలతిరుగుతున్నాడా శేషన్. ఆ చిన్ని ఊళ్ళో మండువా లోగిళ్ళూ, పెంకుటిళ్ళూ





## వ్యక్తిగతంగా మారలేదు

ఈ పదేళ్ళలో వృత్తిపరంగా చాలా మార్పులు వచ్చాయి కాని, వ్యక్తిగతంగా తానేమీ మారలేదంటున్నది కాజల్ అగర్వాల్.

"నా హోదా,నాకుగల గుర్తింపు అన్నింటినీ పక్కన పెట్టేయడానికి ఇష్టపడతాను. సమయం చిక్కితే చాలు చిన్నతనంలో నా చెల్లెలితో,ఫ్రెండ్స్‌తో కలిసి అల్లరిచేసిన మాదిరి ఇప్పుడు చేస్తుంటా.

ఇంట్లోఅడుగు పెట్టానంటే చిన్నపిల్ల మాదిరిమారి పోతాను.వృత్తిరీత్యా నాకు బాధ్యతలు ఎక్కువ.

నన్నీ స్థాయికి చేర్చిన ప్రేక్షకులపట్ల ఆ మాత్రం బాధ్యత వుండాలి కదా" అంటున్నది.

## గుడ్ టైమ్

తెలుగులో ఏవో కొన్ని సినిమాల్లో హిట్లు సాధించినా తెలుగమ్మాయి అంజలి పెద్దగా అవకాశాల్లేక అలా వుండిపోయింది. తెలుగునాట అంత అవకాశాల్లేకపోవడంతో కోలీవుడ్, మాలీవుడ్‌లవైపునకు దృష్టి సారించింది.

మొత్తంమీద అక్కడ పరిస్థితి ఆశాజనకంగానే వుండి, అంజలికి మంచి టైమ్ మొదలైనట్లయింది. ఇప్పుడామె చేతిలో నాలుగు సినిమాలున్నాయి.

మమ్ముట్టితో కలిసి మలయాళ సినిమాలో నటిస్తున్నది. విజయసేతుపతితో ఒక సినిమా చేస్తోంది. తాజాగా 'బ' అనే హారర్ థ్రిల్లర్‌లో అవకాశం దక్కించుకున్నది.

పెద్దనటులతో కలిసి పనిచేయగల అవకాశం దక్కిందని అదేపనిగా ఆనందపడిపోతున్నది.



సగానికి పైగా ఖాళీగా వున్నాయి.

ఆ ఇళ్ళవాళ్ళు పట్నాలకి మైగ్రేటయిపోతా ఒక్కో ఇంటికి ఒక్కో ముసలి మనిషిని కాపలా పెట్టేసెళ్ళిపోయేరు. ఆ వేళ పొద్దుట ఆ వాడ్రేవు వారి వీధిలో నడుచుకుంటా అరుగులమీద ముసలోళ్ళని పలకరిస్తా వెళ్తున్న శేషన్‌కి ఒక పాత ఇంటిముందు దాని యజమాని దక్షిణామూర్తీ, ఇద్దరు ముగ్గురు జనం కనిపించేరు.

వాళ్ళు ఏం చేస్తున్నారో ఎంక్వైరీ చేసిన శేషన్‌కి ఆ పాతిల్లు పడగొట్టేసి లేటెస్ట్ మోడల్ ఇల్లు కట్టించబోతున్నాడని తెలిసింది.

దక్షిణామూర్తి దగ్గరకెళ్ళిన శేషన్ "ఇలాంటి పూర్వీకుల కట్టడం మళ్ళీ దొరకదు గాని రిపేరు చేయించుకుని అందులోనే వుండండి" అన్నాడు.

"నాకూ ఆ అయిడియా వుందిగానీ మా అబ్బాయి ఒప్పుకోవటంలేదు పట్నంనించి కాపరానికి రాబోతున్న మా కొత్తకోడలు అస్సలు ఒప్పుకోదు" అన్నాడు.

వాళ్ళందర్నీ కలిసి చాలా బాగా కన్విన్స్ చేసిన శేషన్ "నేను చెప్పింది వింటానంటే రిపేరు ఖర్చులన్నీ నేనే భరిస్తానన్నాడు"

హైదరాబాద్, కూకట్‌పల్లి, కె.పి.హెచ్.బి. కాలనీలో ఇల్లు కట్టేసుకుని మైగ్రేటైపోయిన ఊరి కరణం గారి మనవడు ముళ్ళపూడి సూర్రాణ పడిపోతున్న పాతిల్లు అమ్మేస్తుంటే శేషన్నోళ్ళి కొనేసేడు.

ఇది జరిగిన చాలా తక్కువ కాలానికే అమెరికాలో ఉంటున్న ఆ కరణంగారి పెద్దమనవడు సూరిబాబు దిగేడు.

సూర్రాణ కంటే పెద్దోడైన ఆయనకి "అరవై దాటినియ్యి. ఈ వయుసులో మా సొంతూరైన ఈ ఊరొచ్చేసి ఇక్కడే వుండిపోదామనుకుంటున్నాను. మా తమ్ముడు పేర్న వున్న ఈ ఇల్లు మీకు అమ్మేడని విన్నాం. వాడికీ నాకు పడదు?

మా ఇల్లు తిరిగి మాకిచ్చేస్తారా?" అంటా శేషన్ని అడిగేడు సూరిబాబు.

"నిక్షేపంలాగిచ్చేస్తాను. అయితే ఒక కండిషన్. పాత ఇల్లు బాగు చేయించుకోవాలి తప్ప అది పడగొట్టేసి తిరిగి లేటెస్ట్ మోడల్ ఇల్లు కట్టనంటేనే ఇస్తాను" అన్నాడు శేషన్.

"నూట యాభై ఏళ్ళనాటి లోగిలి అది. కూలిపోతుందండి" అన్నాడు సూరిబాబు.

"పడగొట్టేసి అచ్చం అలాంటి లోగిలే మళ్ళీకట్టండి... అందుకు నా తరఫునించి ఏ సాయం కావాలన్నా నేను చేస్తాను" అన్నాడు శేషన్.

ఆలోచించిన సూరిబాబు ఇంట్లోవాళ్ళతో కూడా మాటాడేక "సరే" అని ఒప్పుకున్నాడు. అదంతా చూస్తా శేషన్ని కలిసిన రామభద్రుడు "డబ్బు తగలేస్తా ఎందుకా కాలంలోలాగా మార్చేస్తున్నారు ఊరు?" అంటే ఆ రామభద్రుడి భుజాలమీద చేతులేసిన శేషన్ "చెప్తాను తొందరలో" అన్నాడు.

ఎవరైనా ఊళ్ళోకొచ్చి ఆనాటి పద్ధతిలో ఇల్లు కట్టుకుంటాం అంటే స్థలం అదీ సగానికి సగం తగ్గించి ఇప్పించడమేగాదు చాలా సాయాలు చేస్తున్నాడా శేషన్ గారు.

ఈయన చేస్తున్నది బయటకి పొక్కిపోవడంతో పాతకాలం ఇల్లు కట్టుకునే అభిరుచి గలోళ్ళంతా శేషన్‌గార్ని కలిసి ఇక్కడకి జేరిపోతున్నారు. వాళ్ళలో ఎప్పుడో అమెరికావెళ్ళి ఆఖరి రోజుల్లో వెనక్కొచ్చేసిన వాళ్ళు ఎక్కువగా వున్నారు.

కుండలు, మట్టిపాత్రలు చేసుకునే కుమ్మరివాళ్ళు, పందిరి పట్టిమంచాలూ, చిలక్కొయ్యలు లాంటివి చేసే వెనబడ్డ వడ్రంగులు, నేత పనివాళ్ళు ఇంకా రకరకాల కులవృత్తులు చేసుకునేవాళ్ళంతా వచ్చేసి శేషన్‌గారి సాయంతో ఈ ఊళ్ళో సెటిలయిపోతున్నారు. రుబ్బురోళ్ళు, రోకళ్ళు, తిరగళ్ళు తిరుగుతున్నాయి.

ఊరి ఎర్రమట్టి రోడ్లమీద ఎడ్లబళ్ళు తెగ తిరుగు

SMYFRIENDS.COM

తున్నాయి. గుర్రబ్బళ్ళు కలతిరుగుతున్నాయి. చెరుకుతోటలమధ్య సావిళ్ళల్లో బెల్లం వండుతున్న తియ్యటి వాసన. గోదారి కాలువగట్టుమీదున్న వేప చెట్ల నీడల్లో కూర్చున్న కోనసీమ పండితులు పుంత రేవులో మునిగొచ్చిన పిల్లలకి వేదం చెప్తున్నారు.

కాస్త దూరంగా వున్న పనసచెట్టుకింద కూర్చున్న విజయనగరం సంగీత విద్వాంసుడు బొబ్బిలి వీణ పట్టుకుని చుట్టూ కూర్చున్న ఆడపిల్లలకి సంగీతం నేర్పుతున్నాడు. "కుమ్మరికోటయ్యగారి సావిత్రి సంతలో నన్ను చూసి వయనం గట్టిందిరా" అన్నాడా వంతెనకింద కూర్చున్న ముసిలోడు.

"వయనం గట్టడం అంటే ఏంటి పెదనాన్నా?" ముసిలోడి ఎదురుగుండా దొంతిరికాళ్ళమీద కూర్చున్న కుర్రోడడిగేడు.

"వయనం గట్టడం అంటే గుర్తుపట్టడంరా ఎదవ తత్తుకొడకా" అన్నాడు ముసిలోడు.

"అవునా!" "రాత్రి మా యింటికి ఇదాయికంగా భోజనానికి రావాలి..."అంది పుట్లోరిమణి.

"ఇదాయికం అంటే ఏంటి పెద్ద నాన్నా?"

"తప్పనిసరిగా అని నాన్నా"

ఆముదం దీపాలు అందంగా వెలుగుతున్నాయి.

దూరంగా తోటల్లో వున్న రాములోరి గుళ్ళోంచి ఘంటశాల భగవద్గీత గాలిలో కలిసి వినిపిస్తుంది. రకరకాల కొత్తజనం ఊళ్ళోకి దిగిపోతున్నారు. నల్లమిల్లోరి పాలెంలో ప్రెస్‌మీటంట ఆ వేళ.

ఇన్నాళ్ళూ సస్పెన్స్‌లో పెట్టిన విషయాలన్నీ ఇవ్వేళ విప్పుతాడేమో... మమ్మల్ని కూడా పిలిచిన శేషన్ గారు పున్నమిరోజు మా ఊరి నల్లచెరువులో తెల్ల కలవపువ్వులా నవ్వుతా వుంటే కెమెరాలన్నీ ఆన్ అయ్యేటప్పటికి మాటాడ్డం మొదలేట్టేడు మరి-

"మా ముత్తాతగారి పేరు నల్లమిల్లి శేషారెడ్డి. ఆయన్దీపూరేగానీ, ఎప్పుడో తమిళనాడులో మధురై అవతల పణ్ణయపురం అనే ఊరెళ్ళి, అక్కడ సెటిలై పోయేరు. అవ్వడానికయ్యేరు గాని ఆయన శరీరం అక్కడ, మనసు మొత్తం ఇక్కడ. ఆయన కొడుకు అంటే మా తాత స్కూల్లో మేష్టారు దగ్గర పాఠం చదువుకుని ఇంటికొచ్చేక

"గోదావరి కాలవకి దిగువలో ఎర్రకంకరబాటకి ఎడా పెడా పెద్ద పెద్ద మర్రి చెట్ల నీడల్లోంచి మనూరికి దారి.అలాగాపర్లాంగు నడిచి రత్నంగారి పంపర పనాస తోట దాటి ఇంకాస్త ముందు



**బలప్రయోగంతో కాశ్మీరీ ఆందోళనలు అణిచివేసే విధానం సరైనది కాదు. -మెహబూబా ముఫ్తీ,**
జె&కె మాజీ సి.ఎమ్.

అని రాసెయ్యడంతో అలా పిలవడమే అలవాటయి పోయిందందరికీ.... మా నాన్న మట్టుకి 'ఒరే బాబా శేషారెడ్డీ' అంటానే పిలుస్తా మా ముత్తాతని, తాతనీ మించిపోయి మరీ ఈ వూరి గురించి ఉగ్గుపాలలా నాకు పట్టించడం మొదలెట్టేడు.

అదంతాచూసి చాలా ఇదయిపోయిన నేను "ఒక సారి చూసొద్దాం నాన్నా"అన్నాను చాలాసార్లు.

"మన పెద్దోళ్ళు చెప్పిన మనూరు ఇప్పుడలాగుండదురా బాబా... రోజులు మారిపోయినియ్యి గదా మొత్తం మారిపోయుంటది...మనూర్నలా నా ఊహల్లోనే వుండనియ్యి బాబా" అంటా పూర్వీకులు సంపాయించిన కోట్లకి కోట్లు నాకిచ్చి వాళ్ళ దారమ్మటే తనూ వెళ్ళిపోయేడు.

ఈ ఊర్నీ దత్తత తీసుకుని మొత్తం ఆస్తంతా పట్టుకొచ్చేసేనిక్కడికి. నిజమే మా ముత్తాత, తాత, నాన్నలు చెప్పిన ఆ ఊరు ఇక్కడ లేదు. వాళ్ళు చెప్పిన లేత లేత అందాలు, ఆనందాలు ఇక్కడ లేవు. ఆ రంగులూ రుచులూ లేవు.

ఆ గోదారి గాలి, గోదారి నీరు తప్ప ఇక్కడేసీ లేదు. ఏదీ లేదు. ఎన్ని తరాలు తిన్నా తరగని డబ్బున్న నేను ఊరి మీద మావాళ్ళు కన్న కలలు నిజం చెయ్యాలి. వాళ్ళ కలలు ఊర్నిండా అందంగా జల్లాలి,



**కాశ్మీర్‌లో బి.జె.పి.తో జతకట్టిన వారెవరికీ భవిష్యత్తు వుండదు.**
-అసదుద్దీన్ ఒవైసీ, మజ్లీస్ నేత

"ఓహో"

"ఈ టీవీలు, ఇంగ్లీషు చదువులూ వచ్చేక మన యాస గోస మర్చిపోతున్నార్రా మీరంతా" అంటా విసుక్కుంటన్నా ముసిలోడు మా ప్రాంతంలో వదిలేస్తున్న పారిభాషిక పదాల్ని ఇప్పటివాళ్ళకి నేర్పే ప్రయత్నం చేస్తున్నాడు. ఇలాగ పొద్దుట్నించీ పొద్దోయే దాకా ఊళ్ళోని ఏ మూలజూసినా సందడే సందడి.

ఇంతా అంత గానంతా శాంతంగా, అందంగా తయారైన నల్లమిల్లోరిపాలెం ఊరిని, అసలుసిసలైన ఆ అందాల పల్లెటూర్ని చూడ్డానికి ఎక్కడెక్కడినించో వస్తున్నారు.

అలా దిగిపోతున్న జనాలకి చాలా ఆదరంగా స్వాగతం చెప్తున్నారు కొత్తగా కట్టిన సత్రంలో జనం. వచ్చినోళ్ళకి ఊరంతా జూపించేక అచ్చమైన గోదావరి జిల్లా విందు భోజనంపెట్టి సాగనంపుతా

"మళ్ళీ ఎప్పుడొస్తారు? పులసల సీజన్లో వచ్చేయండేం" అంటా ఆత్రంగా అడుగుతుంటే-

ఆ వచ్చినోళ్ళు ఊరిని వదిలెళ్ళలేక కళ్ళమ్మట నీళ్ళెట్టుకుంటా సత్రంలో వాళ్ళని గుండెల్లో పెట్టేసుకుంటున్నారు.

ఆ శీతాకాలం సాయంత్రం వేళ గోదారి కాలవ లోంచి లుంగలు తిరుగుతా కొట్టుకొస్తుంది చల్లగాలి. పగలే చీకటిపడ్డంతో ఇళ్ళల్లో కిర్సనాయిలు దీపాలు,

కొస్తే ఏ పక్క జూసినా కళకళ్ళాడిపోతా పెంకుటిళ్ళు, లోగిళ్ళు, తూర్పుదిక్కున మన మండువాలోగిలి అంటా కలలాంటి మనూరి కథలు చెపుతుంటే మా ముత్తాతతోపాటు ఎప్పుడెళ్ళి చూసేద్దామా అనిపించేది మా తాతకి.

అదే ముక్క అడిగితే "మనం ఉండడానికి ఇప్పుడు మనకక్కడ ఇల్లు లేదు గదా ఎవరింటి వసారాలో అన్నా వుండాలి. ఎవరింట్లో ఉందామా అని తెగాలోచిస్తున్నాను. ఇదిగో సంకురాత్రి నెలపట్టేకా వెళదాం... దీపాలమాసెళ్ళేక ఎళదాం" అంటా ఎప్పటికప్పుడు లాక్కుంటా జరుపుకుంటా వచ్చిన మనిషి చివరికీ ఊరు రాకుండానే వెళ్ళిపోయేడు.

తర్వాత "మా తాత... కొడుకైన మా నాన్నని పట్టుకుని ముత్తాతకంటే చాలా ఇదిగా చెప్పడం మొదలెట్టేడు మా వూరైన ఈ ఊరి గురించి"

"వేపచెట్లకింద వేదపఠనం చేసే బ్రాహ్మల పిల్లల గురించీ, వీణ పిల్లనగ్రోవి పట్టుకుని ఒక్కో చింతచెట్టు కిందా ఒంటరిగా సాధన చేసే ఆడపిల్లల గురించీ చెపుతా... ఇప్పుడెళదాం రేపెళదాం వెళ్తే రెండు నెలలన్నా వుండాలిగదా మరీ"అంటా చివరికి మా ముత్తాత లాగే మా తాత కూడా వెళ్ళిపోయేడు.

మా ముత్తాత నల్లమిల్లి శేషారెడ్డి పేరే నాకు పెట్టేడు మా నాన్న. కాని స్కూలు రిజిస్టర్లో శేషన్

అల్లాలి అని నాలో నేను శపథం చేసుకున్నాను.

అఖండ గోదావరి తల్లిముందు ప్రమాణకం చేసి పని మొదలెట్టాకా ఎవరేడడిగినా తర్వాత చెపుతానంటా సస్పెన్సులో పెడతావచ్చేను.ఎందుకంటే మొదలెట్టేనుగాని సక్రమంగా పూర్తిచేస్తానో లేదో అన్న భయం.ఇక్కడ అందరి సహకారంతో అదే ప్రయత్నం చేస్తున్న నాకనిపిస్తుందిప్పుడు.

ఈ ఊరు చూడ్డానికొచ్చి ముచ్చటపడి మూర్ఛపోతున్న టూరిస్టులందరిలో నా పూర్వీకులు ఉన్నారు. వాళ్ళ మనసులే మా తండ్రీ, తాత, ముత్తాతల మనసులు. ఇప్పుడు నాది ఆనందం కాదు పరమానందం, బ్రహ్మానందం ఇంతా అంతా కాని జన్మజన్మల ఆనందం... అవును. పొట్ట పట్టుకుని పరాయి రాష్ట్రం వెళ్ళిన నా పూర్వీకులు కోట్లు సంపాయిస్తే నేను వాటితో వాళ్ళు కలలుగన్న ఊరినీ తిరిగి సంపాయిస్తున్నాను. చివరికి నేను చెప్పేదేంటంటే-

ఆనాటి అందాల మన గ్రామం పునర్నిర్మించే ప్రయత్నంలో చివరిదశకొచ్చిన నేను ఎట్టి పరిస్థితుల్లోనూ ప్రగతిపథానికి వ్యతిరేకిని కాదు...

మా అబ్బాయి అమెజాన్‌లో వైస్ ప్రెసిడెంటుగా పనిచేస్తున్నాడు, మా కోడలు ఐ.బి.ఎమ్. వాట్సన్ ప్రాజెక్ట్ మేనేజరు" అంటా నమస్కారం చేసి నిష్క్రమించేరా నల్లమిల్లి శేషారెడ్డిగారు.



Courtesy : UNISHKURI

# ఫర్ U

Our lives and our surroundings are shaped by our thoughts

## స్కిప్పింగ్ చేస్తేచాలు

శరీరానికి వ్యాయామాలు అవసరం ఎంతగావుంటుందో ప్రత్యేకంగా చెప్పుకోనవసరంలేదు. చాలా మంది మహిళలు చెప్పేమాట తమకు వ్యాయామాలు చేయడానికి తగిన సమయం వుండడంలేదన్నది.

ఏదో ఒక రకంగా వీలు చిక్కించుకుని నడవడం చేస్తుండాలి.

అస్సలు టైము చాలదని అనుకునేవారు కొద్దిసేపైనా స్కిప్పింగ్ చేయడం మంచిదంటున్నారు శాస్త్రవేత్తలు. స్కిప్పింగ్ వల్ల తక్కువ సమయంలోనే శరీరానికి ఫిట్‌నెస్‌వస్తుంది. బరువు తగ్గుతారు.

ప్రతిరోజూ కొద్దిసేపైనా స్కిప్పింగ్ చేస్తుంటే, ఫలితాలు త్వరితంగా కనపడతాయని,ఊపిరితిత్తులకు కూడా మేలు జరుగుతుందని,

మెదడు విశ్రాంతిగా వుంటుందని, గుండెకు మంచి వ్యాయామం చేకూరుతుందని నిపుణులు సిఫార్సు చేస్తున్నారు. ◆

## 'చింత' తీరుస్తుంది

కొంచెం వానలుపడ్డాయుంటేచింత చెట్టునిండా చిగుర్లు తొడిగేస్తాయి.

ఈ సీజన్‌లో చింత చిగురును వీలయినంత ఎక్కువగాతీసుకుంటే అనేక ఆరోగ్యప్రయోజనాలు దక్కుతాయి. పీచు అత్యధికంగా ఉండే చిగురు పైల్స్ వున్నవాళ్ళకు మంచి ఆహారం.

యాంటీ ఆక్సిడెంట్లు పుష్కలంగా వుంటాయి.చెడు కొలెస్ట్రాల్‌ను తగ్గించి, మంచి కొలస్టరాల్‌ను పెంచడంలో చింతచిగురు సాయపడుతుంది.

చింతచిగురువేసి కాచిన నీటితో పుక్కిలిస్తే గొంతు నొప్పి, మంట, వాపు తగ్గుతాయి. నోటి పూతల్ని తగ్గిస్తుంది. రోగనిరోధకవ్యవస్థను పటిష్ఠపరుస్తుంది. థైరాయిడ్, డయాబెటిస్‌గల వారికి ఔషధంలా పనిచేస్తుంది.

ఇది శరీరంలోని వ్యర్థాలను వెలికి పంపే గుణం కలిగివుంటుంది. ◆

## ఏ ఆకుల్లో ఏ విటమిన్

ఆకుకూరలలో శరీరానికి అవసరమయ్యే అనేక ఖనిజాలు, విటమిన్లు, ప్రొటీన్లు వుంటాయి. ప్రతిరోజూ ఆహారంలో ఆకుకూరలు తినడంవల్ల అనేక ప్రయోజనాలు దక్కుతాయి.

పాలకూరలోని క్యాల్షియం ఎముకల సాంద్రత పెంచుతుంది. రోగనిరోధకశక్తిని మెరుగుపరుస్తుంది. గోంగూరలో ఐరన్ ఎక్కువ. కంటి వ్యాధులు తగ్గుతాయి. తోటకూరలో యాంటీ ఆక్సిడెంట్స్, ఐరన్, క్యాల్షియం లభిస్తాయి. చుక్కకూరలో మెగ్నీషియం, విటమిన్ ఎ లభిస్తాయి.

బచ్చలిలో విటమిన్ 'సి' అధికంగా వుండి రోగనిరోధకశక్తిని పెంచుతుంది. మునగాకులో ఐరన్, కాపర్‌లు ఎక్కువగా వుంటాయి.కొత్తిమీరలో వృద్ధాప్య లక్షణాలను తగ్గించేగుణం వుంటుంది. కరివేపాకులోని బయోటిక్ జుట్టు సంరక్షణకు,అరుగుదలకు ఉపకరిస్తుంది.

మెంతికూరలో పీచు ఎక్కువగా వుండడంవల్ల గుండెకు, కాలేయానికి ప్రయోజనకారి.డయాబెటిస్‌గలవారికి మేలయినది. పుదీనాలో యాంటీ ఆక్సిడెంట్స్ వుంటాయి. ఆకుకూరల్ని పప్పులతో కలిపి ఉడికించడంవల్ల పోషకపదార్థాలు పెరుగుతాయి. ఆకుకూరల్ని బాగా శుభ్రంచేసి వాడుకోవాలి. ◆

## ఆశావాదం

ఎటువంటివారికయినా ఆశావాదం చేసే అద్భుతాలు అంతా ఇంతా కాదు. ముఖ్యంగా హృద్రోగంతో బాధపడే వారికి ఇటువంటి ఆశావహ దృక్పథం చాలా ఉపయోగకరంగా వుంటుందని నిపుణులు చెప్తున్నారు.

చికిత్స తీసుకునేవారు సర్వవేళలా ఆశావాదంతో ఉన్నప్పుడు నిరాశావాదులతో పోల్చితే, ఎక్కువకాలం జీవిస్తారని తమ అధ్యయనాల్లో గుర్తించారు.

అంతేకాదు, ఇటువంటి ఆశావహ దృక్పథంగలవారికి గుండె సంబంధిత సమస్యలు చాలా అరుదుగా వస్తాయని మరో పరిశోధన పేర్కొంటున్నది. ◆

## పడకపై వద్దు

నవతరానికి స్మార్ట్‌ఫోన్ అనేది శరీరంలో ఓ భాగం మాదిరి అయిపోయింది. పగలు,రాత్రి అన్న తేడా లేకుండా ఫోన్ పక్కన ఎప్పుడూ వుండాల్సిందే.

పడుకునే సమయంలో సైతం మంచం మీదో, దిండు కిందో ఫోన్ వుంటున్నది. కాని, ఇలా ఫోన్‌ను పక్కనే వుంచుకుని నిద్రపోవడం మంచిది కాదంటున్నారు వైద్యులు.

సెల్‌ఫోన్లు విడుదలచేసే రేడియో ఫ్రీక్వెన్సీ ఆరోగ్యానికి హానికరం.

ఫోన్‌ను దిండుకింద పెట్టుకుని నిద్రపోవడంవల్ల, మెదడు కణజాలం దెబ్బతిని జ్ఞాపకశక్తి తగ్గే ప్రమాదమూ లేకపోలేదు. కాబట్టి నిద్రించే సమయంలో ఫోన్ స్విచ్చాఫ్ చేస్తే మరీ మంచిది. ◆

## ఉడికించే పద్ధతులు

పదార్థాలను ఎంత రుచికరంగా తయారుచేస్తామనే దానితోపాటు తయారుచేసుకునే పద్ధతులూ ఆరోగ్యకరంగా వుండాలి.బేక్, గ్రిల్, స్టీమ్ వంటి పద్ధతులు ఆరోగ్యప్రదమైనవి. డీప్‌ఫ్రై చేసే బదులు ఈ ప్రత్యామ్నాయాలను అనుసరిస్తుండాలి.

ఆలివ్ ఆయిల్, కనోల ఆయిల్ వంటి నూనెలను ఉపయోగిస్తే ఇంకా మంచిది. తాజా లేదా డ్రై హెర్బ్స్ వాడడాన్ని అలవాటుచేసుకోవాలి. తినే పదార్థాలను ఆరోగ్యప్రదంగా చేసుకోవడం వల్ల పోషకాలు అందుతాయి.

# హెల్త్ బిట్స్



## ఒకసారి సిజేరియన్

తొలిసారి ప్రసవం సిజేరియన్ ఆపరేషన్ ద్వారా జరిగితే ఆ తర్వాత ప్రసవాలను సహజంగాజరిగే అవకాశా లను కోల్పోయినట్టే అని అంటున్నారు కెనడా మెడికల్ అసోసియేషన్‌వారు.

తొలి ప్రసవ సమయంలో ప్రసవనొప్పులు భరించలేక సిజేరియన్ కోరుకుని, ఆ తర్వాత అలాంటి ప్రసవంకన్నా సహజప్రసవమే మేలని తెలుసుకున్న ఆడవారు సహజ ప్రసవానికి సిద్ధమవుతుంటారు. కాని అటువంటివారికి ప్రసవం ఒక సవాలుగా మారుతుంది.

ఆ సమయంలో రక్తస్రావం, మూత్రసంబంధిత సమస్యలు వస్తాయి. వీటివల్ల తల్లి, బిడ్డకు కూడా ఇబ్బందిగా వుంటుంది. ప్రసవం తర్వాత కూడా మరిన్ని ఇబ్బందులు పెరుగుతాయి.

దాదాపు రెండు లక్షలమంది మహిళల ప్రసవ అంశాలను 2003-2014 అధ్యయనకాలంలో గమనించి ఈ నిర్ణయానికి వచ్చారు. తొలి ప్రసవం సహజ ప్రసవంగా చూసుకోండి, సమస్యలను తగ్గించుకోండి అన్నది వారి సూచన. ◆

## ఇంటి ఔషధాలు

కడుపులో మంట సమస్య తలెత్తినప్పుడు మార్కెట్‌లో లభించే యాంటాసిడ్స్‌కన్నా ఇంటిలోని ఔషధాలను ఉపయోగించటం మంచిది.

- భోజనం తర్వాత ఒక గ్లాస్ పైన్ యాపిల్ జ్యూస్ తాగితే దానిలోని 'బ్రొమేలైన్' అనే ఎంజైమ్ కడుపులోని ఆమ్లాల ప్రభావాన్ని తగ్గిస్తుంది.
- యాపిల్ ముక్కలు కూడా కడుపులో ఆమ్లాల ఉత్పత్తిని తగ్గిస్తాయి. యాపిల్ తిన్న ఐదునిమిషాలలో కడుపు మంట ఉపశమనం వస్తుంది.

Courtesy : AROGYA SANJEEVANI

- అరటిపండు సహజమైన యాంటాసిడ్. తాజా అరటిపండును భోజనం తర్వాత తినండి.
- జీర్ణక్రియ సమస్య అనిపించినా, కడుపులో మండుతున్నా గుప్పెడు ద్రాక్షపండ్లు తినాలి.
- వెల్లుల్లి తింటే కడుపులో మంట వస్తుందంటారు. కాని వెల్లుల్లి ఒకటి, రెండుపాయలు తినగానే కడుపు మంట ఆగిపోతుంది.
- జీర్ణక్రియను మెరుగుపరిచి మంట తగ్గించే గుణం పసుపులో వుంది. అందుకే మన వంటకాలలో పసుపు వాడతారు. బాదంపప్పులు, జీర్ణక్రియకు మంచిది. గుప్పెడు బాదంపప్పులు తింటే కడుపు మంట తగ్గుతుంది. మజ్జిగ ఒక గ్లాసు తాగితే కడుపులో మంట చల్లారగలదు. ◆

Courtesy :HEALTH



## నిశాచర జీవనం వద్దే వద్దు

పగలు పని చేయాలి,రాత్రి నిద్రపోయి విశ్రాంతి తీసుకోవాలి. ఇది ప్రకృతి నిర్దేశించిన ధర్మం.

ఆ ధర్మాన్ని ధిక్కరించి రాత్రిపూట నిద్ర సమయానికి పోక అర్ధరాత్రి దాటినా ఏదో ఒక పనిలో నిమగ్నమైవుండేవారు ఏరికోరి తమ ఆయుర్దాయాన్ని తగ్గించుకుంటున్నట్టు.

అర్ధరాత్రి దాటినా పార్టీలు,ఉద్యోగ బాధ్యతలు నిర్వహించే వారికి మానసిక సమస్యలు వచ్చే అవకాశం రెట్టింపవుతుంది.డయాబెటిస్ వచ్చే అవకాశం ముప్పై శాతం ఎక్కువ. నాడీ సంబంధిత వ్యాధులు వచ్చే అవకాశం ఇరవై ఐదు శాతం ఎక్కువ.

ఇవే కాదు శ్వాసకోశ, జీర్ణకోశ వ్యాధులు కూడా అధికంగా కనిపిస్తాయి. సమయానికి నిద్రపోలేకపోవటానికి అసలుకారణం ఏమిటో ఎవరికి వారు తెలుసుకోవాలి. పని ఒత్తిడి, మానసిక సమస్యలు, వేళకు ఆహారం తినకపోవటం, మత్తుపానీయాల అలవాటు వంటివి ఏదోకటి కారణమవుతాయి.

రాత్రివేళ నిద్రపట్టని సమస్యను వదిలించుకోవాలంటే ఒక నిర్దిష్ట సమయానికి రోజూ పడుకోవటం అలవాటు చేసుకోవాలి.ఎలక్ట్రానిక్ వస్తువులనుపడక గదిలోకి తీసుకువెళ్ళవద్దు.

Courtesy : GRIHASHOBA



# వేట

"మనకు కావలసింది వీరే. ఈ ఇద్దరిలో ఇతను చాలా ప్రమాదకర వ్యక్తి. ఒక్కక్షణం మీరు ఏమరుపాటుగా ఉన్నా మిమ్మల్ని ఏమార్చగలడు. పక్కన ఉన్న అమ్మాయి గురించి ఇంకా పూర్తిగా తెలియదు. కానీ ఆమె కూడా ప్రమాదకరవ్యక్తే అని భావించి ముందడుగు వేయండి.

అతన్ని ప్రాణాలతోనే పట్టుకోవాలని లేదు. అతని మీద ఎలిమినేషన్ ఉత్తర్వులు ఉన్నాయి. చంపినా మిమ్మల్ని ఎవరూ ఏమీ అనరు..." అని పోలీసులకు బ్రీఫింగ్ ఇచ్చి రంగంలోకి దింపాడు ప్రధాన్.

ఒకదాని వెనుక ఒకటి వాహనాలు వస్తున్నాయి. వెళ్తున్నాయి. ఎందులోనూ అనుమానాస్పదంగా ఎవరూ కనపడటం లేదు.ఇంతలో ఒక లారీ ప్రధాన్ ముందుకు వచ్చింది. క్యాబిన్‌లోకి తొంగిచూశాడు. ఎవరో ఇద్దరు మగవాళ్ళు ఉన్నారు.

వారి మొహాల్లో మంగోలియన్ పోలికలు స్పష్టంగా కనిపిస్తూ ఈశాన్య రాష్ట్రాల పౌరులని చెప్పకనే తెలుస్తోంది. అయినా అనుమానం తీర్చుకోవటానికి వారి వివరాలు తీసుకున్నాడు.

"ఇద్దరు మనుషులు. ఆడ, మగ ఎక్కడయినా, ఎప్పుడయినా అనుమానాస్పదంగా కనిపించారా?" అందరినీ అడిగినట్లు ఆ డ్రైవర్ని కూడా అడిగాడు ప్రధాన్. "కనిపించారు సార్..." చెప్పాడతను.

చేతిలోనిఫోటోచూపించాడుప్రధాన్."వీళ్ళేనా?" "అవును, వీళ్ళే సార్..." ఎగ్జయిట్ అవుతూ అన్నాడా డ్రైవర్. "ఎక్కడ కనిపించారు?" తను అంతకంటే ఆత్రుతగా అడిగాడు ప్రధాన్.

"దీమాపూర్ ఊరి బయట నా లారీ ఎక్కారు సార్. క్యాబిన్‌లో చోటులేదంటే వెనుక ఉన్న సరుకు మీద అడ్జస్ట్ అవుతామన్నారు.ఒక రాత్రిపూట లారీ ఆపించారు. పాస్ పోసుకోవటానికి కిందకు దిగుతామన్నారు. సరే అని లారీ రోడ్డు పక్క ఆపాను.

పక్కన ఉన్న తుప్పల్లోకి వెళ్ళిన ఇద్దరూ ఆ తరువాత బయటకు రాలేదు. అయిదు నిమిషాలు చూసి పెద్దగా పిలిచాను. పలకలేదు. వెళ్ళి చూశాను. అక్కడ ఎవరూ లేరు. నా దారిన నేను బయలుదేరివచ్చేశాను" చెప్పాడతను.

"ఇది జరిగింది ఎప్పుడు?"

"ఒక పావుగంట క్రితం. సోనాపూర్ బైపాస్ దగ్గర"

'షిట్...' అనుకున్నాడు ప్రధాన్. తాము ఇక్కడ కాపు కాశామని ఆ అవినాష్‌కి ఎలా తెలిసిందో అతనికి అర్థం కాలేదు. సోనాపూర్ పరిసర ప్రాంతాల్లో వెతకాలని నిర్ణయించుకున్నాడు. ఎందుకైనా మంచిదని ఒకసారి ధర్మేంద్రని కాంటాక్ట్ చేశాడు.

"మీ ఇష్టమొచ్చినట్లు ఏడవండి..." విసుగ్గా అంటూ ఫోన్ పెట్టేశాడు ధర్మేంద్ర.

అతనికి అంత విసుగు ఎందుకు వచ్చిందో అర్థంకాలేదు ప్రధాన్‌కి. తన టీమ్‌లో కొంత మందిని తీసుకుని సోనాపూర్ వైపు వెళ్ళిపోయాడతను. అదే సమయంలో ధర్మేంద్ర మొహం క్రోధంతో ఎరుపెక్కి ఉంది.

అతని ఎదురుగా ఉన్న మానిటర్ మీద ఇంతకు ముందు కనిపించిన నీలిచుక్క ఇప్పుడు అయిదారు చుక్కలుగా విడిపోయి తలా ఒకదిక్కుకూ పయనిస్తున్నాయి. ఒకే మనిషి ఒకేసారి అన్ని దిక్కులకు ఎలా ప్రయాణిస్తాడో ధర్మేంద్రకి కొన్ని సెకండ్లు అర్థం కాలేదు. అర్థమయిన తర్వాత అవినాష్‌మీద కోపంతో పళ్ళు పటపటమని కొరికాడు.



లారీటాప్‌మీద ప్రయాణిస్తున్న అవినాష్, లక్ష్మి రజాయిలో దూరికాసేపు నిద్రపోయారు. ఒక రాత్రి వేళ అవినాష్‌కి అలవాటైన ఒక శబ్దం వినిపించి మెలకువ వచ్చింది. మొహంమీద నుండి రజాయి తొలగించి చూశాడు. ఆకాశంలో అతితక్కువ ఎత్తులో

**పుట్టగంటి గోపీకృష్ణ**



ఎగురుతూవెళ్తోంది హెలికాప్టర్. దానిమీద ఉన్న ఎయిర్‌ఫోర్స్ గుర్తు చూసిన అతని మనసులో తిరిగి అనుమానబీజం పడింది.

ఇంత రాత్రిపూట ఎయిర్‌ఫోర్స్ హెలికాప్టర్ ఇక్కడ ఏం చేస్తోంది? కొద్దిదూరంలో టోల్‌గేట్ ఉందని అతనికి తెలుసు.

అక్కడ తమ కోసం కాపు కాయటానికి వెళ్తున్నారా? కానీ తను మయన్మార్ రూటులో వెళ్తున్నట్లు వారిని నమ్మించాడు కదా. ఇంతలోనే తన మార్గాన్ని వారు ఎలా తెలుసుకున్నారు?

అతని అలజడిని గుర్తించినట్లు లక్ష్మి కూడా లేచింది. "ఏం జరిగింది?" అంది.

తెలియదన్నట్లు పెదవి విరిచి లారీ క్యాబిన్‌మీద చేత్తో గట్టిగా చరిచాడు."ఏంటి?" క్యాబిన్ వెనుక ఉన్న చిన్న కిటికీ తెరుస్తూ అడిగాడు డ్రైవర్.

చిటికెన వేలు చూపించి, "అర్జంట్..." అన్నాడు అవినాష్. తప్పక లారీ ఆపాడు డ్రైవర్.

లక్ష్మితో సహా కిందకు దిగిన అవినాష్ రోడ్డుకింద ఉన్న పొదల్లోకి నడిచాడు. ఆ తరువాత వెనుతిరిగి చూడకుండా లక్ష్మిని తీసుకుని అక్కడ నుండి దూరంగా వెళ్ళిపోయాడు. "అదేంటి మనకు అంత హెల్ప్ చేసిన డ్రైవర్‌కి కనీసం చెప్పకుండా ఎక్కడకు తీసుకువెళ్తున్నావ్?" అడిగింది లక్ష్మి.

"మర్యాదలకి ఇది సమయం కాదు. కమాన్" అంటూ కొద్దిదూరం నడిపించి ఆగాడు అవినాష్. కాసేపటి తరువాత వారు ఎక్కి వచ్చిన లారీ

16 జరిగిన కథ

అత్యవసర మీటింగ్ ధర్మేంద్ర ఏర్పాటు చేస్తాడు.అన్ని ఇంటలిజెన్స్ వర్గాల ఛీఫ్స్‌వస్తారు. న్యూక్లియర్ బాంబ్‌ను పేల్చాలనుకున్న వారంతా తమ ఇన్‌ఫార్మర్‌లని,

వాళ్ళందర్నీ 'RAW' సీనియర్ ఎనలిస్ట్ అవినాష్ చంపేశాడని తెలివిగా అతనిమీద అభియోగం మోపుతాడు.

అవినాష్ వలన ప్రధానమంత్రికి ప్రమాదం వుందని నమ్మబలుకుతాడు రిటైర్డ్ జనరల్ ధర్మేంద్ర. తనమీద కుట్ర జరిగిందని అర్థమైన అవినాష్ ఇన్‌స్పెక్టర్ లక్ష్మిని పారిపొమ్మని చెబుతాడు. ఆమె వినదు.

ఎయిర్‌పోర్టు దగ్గర వున్న సెక్యూరిటీ గార్డ్ అవినాష్‌ని గుర్తుపట్టి ఎవరికో ఫోన్ చేస్తాడు. లక్ష్మితో సహా ఓ కారు దొంగిలించి అందులో పారిపోతారు ఇద్దరూ.పోలీసులు వారిని వెంటాడడం మొదలుపెడతారు.

తమని ఎక్కడ గుర్తుపడతారోనని వారికి టోకరా ఇచ్చి గౌహతి వెళ్ళే లారీ ఎక్కేస్తారు. అవినాష్‌కి తను ఇచ్చిన అనేక ఫేక్ ఐడి కార్డుల్లో, క్రెడిట్ కార్డుల్లో రేడియో చిప్ బిగించి అవినాష్ వేసే ప్రతి అడుగూ మానిటర్ చేస్తుంటాడు ధర్మేంద్ర. ఇక చదవండి.

కదిలి వెళ్ళిపోయిన శబ్దం అయింది. "ఇప్పుడయినా చెప్తావా? ఏమిటిదంతా?" అడిగింది లక్ష్మి.

"మనం ఈ మార్గంలో వస్తున్నామని ఎలా తెలిసిందో వారికి తెలిసింది. అందుకే మన కోసం కాపు కాశారు" అన్నాడు అవినాష్.

"అంత ఖచ్చితంగా వారికి మనం ఎటు వెళ్తున్నామో ఎలా తెలిసింది?"

ఒక్కక్షణం ఆలోచించాడు అవినాష్. ఆ రోజు ధర్మేంద్ర చెప్పిన మాటలు గుర్తుకువచ్చాయి."ఇవన్నీ రకరకాల రాష్ట్రాల్లో నీకు ఉపయోగపడే ఐడీ కార్డులు. ఈ డ్యూటీలో భాగంగా నువ్వు ఎన్నో రాష్ట్రాల్లో పర్యటించవలసిరావచ్చు. అక్కడ నీకు ఇవి ఉపయోగపడతాయి. ఇది ఒక కార్డ్. దీని ద్వారా ఏ ఏటిఎమ్‌ద్వారా ఐనా కావలసినంత డబ్బు డ్రా చేసుకోవచ్చు.

ఈ క్షణంనుండి నీ అసలుఐడీ,అసలుకార్డు ఎప్పుడూ వాడకు. అవి నీ ఉనికిని బయటపెట్టవచ్చు" అన్న ధర్మేంద్ర మాటలు తరచి చూస్తే, అతను ఆ కార్డులిచ్చింది తన ఉపయోగం కోసం కాదనీ,అతని అవసరం కోసమనీ అర్థమయింది.

"బహుశా ఈ కార్డులద్వారా అనుకుంటా" జేబులో నుండి ధర్మేంద్ర ఇచ్చిన కార్డులు బయటకు తీస్తూ "వీటిలో ఏదో ఒకదాంట్లో, లేదా అన్నింట్లో రేడియోచిప్ చొప్పించి ఉంటారు" అన్నాడు అవినాష్.

"మరేం చేద్దాం?" "చెప్తాను..." రోడ్డుకు అవతల వైపుకు వెళ్తూ అన్నాడు అవినాష్.

అది అప్పటివరకు వారు వచ్చిన రోడ్డుకుపక్కన ఉన్న లైన్. ఆ రోడ్డుమీద గౌహతి నుండి దీమాపూర్ వెళ్ళే వాహనాలు వరుసగా రోడ్డుమీద దూసుకుపోతున్నాయి. రోడ్డు పక్కన నిలబడి ఒక్కొక్క కార్డు తీసి లారీల్లాంటి పెద్ద వాహనాల మీద పడేలా విసిరేశాడతను.

"దీనివలన ఏంటి ఉపయోగం?" అంది లక్ష్మి.

"ఇప్పటిదాకా ఆ కార్డుల వలన మన ఉనికి ప్రత్యర్థులకు తెలిసిపోతుంది. ఇప్పుడు వారికి మనం మిస్ ఇన్ఫర్మేషన్ పంపుతున్నాం"

అతనన్నట్లు అప్పటిదాకా అతను ఎటు వెళ్తున్నాడో మానిటర్‌మీద పర్యవేక్షిస్తున్న ధర్మేంద్ర ఉలిక్కిపడ్డాడు. మానిటర్ మీద అవినాష్‌ని సూచిస్తున్న నీలిరంగు చుక్క టోల్‌గేట్‌ముందు కాసేపు ఆగిపోయింది.

ఏదన్నా పనిమీద అవినాష్‌ఆగాడేమో అనుకున్నాడతను. అయితే కాసేపట్లోనే ఆ చుక్క రెండుగా విడిపోయి ఒకటి ఆపోజిట్ డైరెక్షన్లోబయలుదేరింది.

ధర్మేంద్రకి ఏం జరుగుతుందో అర్థంకాలేదు. ఇంతలోనే ఆచుక్కలు మరిన్నిచుక్కలుగా విడిపోయి రకరకాల మార్గాల్లో వెళ్తున్నాయి.

అప్పుడర్థమయింది ధర్మేంద్రకి. అవినాష్ తన వ్యూహం పసిగట్టాడని. అందుకే అతను తను ఇచ్చిన కార్డులు వదిలించుకున్నాడు. ఇక ఎలక్ట్రానిక్ సర్వైలెన్స్ వృధా. మానిటర్ ఆపి లేచి నిలబడ్డాడు ధర్మేంద్ర. అతను ఆలోచిస్తోంది తను ఏం చేయాలా అని కాదు, అవినాష్ ఎలా ఆలోచిస్తాడా అని.

ఈలోపు అవినాష్ లక్ష్మివణికించే చలిలో గౌహతి వెళ్ళే వాహనాలను లిఫ్ట్‌కోసం ఆపటానికి ప్రయత్నిస్తున్నారు. ఎన్నో కార్లు ఆ దారెమ్మట వెళ్తున్నా ఎవరూ ఆపటంలేదు. ఆ రాత్రి సమయంలో అడవిలాంటి ఆ ప్రదేశంలో వాహనంఆపి అపరిచితులనుఎక్కించుకునే ధైర్యం ఎవరూ చేయలేకపోతున్నారు.

అయితే ఆఖరికి ఒక వ్యాన్ వీరిని చూసి ఆగింది. అందులో ఎక్కువమంది మనుషులు ఉండటంతో వారు వాహనం ఆపటానికి భయపడలేదు. "ఎవరు మీరు?" అడిగాడు డ్రైవర్.

"దీమాపూర్ నుండి గౌహతి వస్తున్నాం. మా ట్యాక్సీ డ్రైవర్ దార్లో కత్తి చూపించి మా దగ్గర ఉన్న డబ్బు, కార్డులు లాక్కుని ఇలా వదిలేశాడు..." చెప్పింది లక్ష్మి.

"ఈ ట్యాక్సీడ్రైవర్లతో జాగ్రత్తగా ఉండాలి..." అన్నాడు వ్యాన్ డ్రైవర్.

వ్యాన్ వెనుక ఉన్న ఎవరో, "ఆడకూతురు చలిలో ఇబ్బందిపడుతోంది. ఇంతమందిమి ఉన్నాం, వారిద్దరు ఎక్కువవుతారా? ఎక్కమనండి..." అన్నారు.

వ్యాన్ వెనుక తలుపు తెరుచుకుంది.

అవినాష్, లక్ష్మి వ్యాన్ ఎక్కారు. లోపల పరిస్థితి చూసి ఇద్దరూ నోరు తెరిచారు. అది ఒక నాటక కంపెనీ వ్యానులా ఉంది. అప్పుడే ఎక్కడో నాటకంవేసి వస్తున్నారులా ఉంది. సగం తీసెయ్యని మేకప్పులతో విచిత్రంగా కనిపిస్తున్నారు.

నాటకానికి కావలసిన రకరకాల సామాగ్రి, మేకప్ సామాను ఒక పక్క సర్ది ఉంది. వారిని చూడగానే ఒక ఆలోచన అవినాష్ మదిలో తట్టింది.

"మీరు నాటకం వేసి వస్తున్నారా?" ఆనందంగా అడిగాడు అవినాష్.

"అవును" "మేమూ మీలాంటి కళాకారులమే" అన్నాడు అవినాష్.

"అవునా... మీరూ నాటకాలు ఆడతారా? ఏమేమి నాటకాలు ఆడారేంటి?" అడిగాడు వారి హెడ్డులా కనిపిస్తున్న ఒక వ్యక్తి.

"మేము స్టేజి నాటకాలాడం. మేము ఆడుతున్నది నాటకమని కూడా ఎవరికీ తెలియనట్లు జనాల మధ్యకి వెళ్ళి మేము చెప్పదలచుకున్నది చెప్తాం"

"మీరు ఆడుతున్నది నాటకం అని ఎవరికీ తెలియకపోతే ఇక నాటకం ఆడటం ఎందుకు?" నిరసనగా అన్నాడు వారి హెడ్డు.

"నిజం చెప్పాలంటే మీరు వేసే నాటకం కంటే, మేము వేసే రకం నాటకం వెయ్యటం కష్టం..." అని వాళ్ళ ఇగో రెచ్చగొట్టాడు అవినాష్.

"అదెట్లా?" కోపంగా అడిగారు వారు.

"ఉదాహరణకి నేను ఆడవేషం వేసుకుని, ఈవిడ మగవేషం వేసుకుని మీ ఐడీ కార్డులతో మీ పేరుమీద చెలామణీ కాగలం. బజారుకు వెళ్ళగలం. పనులు చక్కబెట్టగలం. ఆఖరికి ఎంతో సెక్యూరిటీ ఉండే ఎయిర్‌పోర్ట్‌కు వెళ్ళి విమానం ఎక్కగలం.మీరు అలా చేయగలరా?" అడిగాడు అవినాష్.

"అసాధ్యం..." వారిలో ఒకసారి విమానం ఎక్కిన వ్యక్తి అన్నాడు. "అక్కడ చాలా పరిశీలించి గానీ లోపలకు పంపరు. పైగా లోపల ఎక్స్‌రేలో కూడా చెక్ చేస్తారు. మగాళ్ళు ఆడవేషం వేసుకుంటే ఇట్టే తెలిసిపోతుంది"

"మరదే నటన అంటే. మేము ఆ పని చేయగలం. మీరు చేయలేమని ఒప్పుకున్నట్లేనా?" వారిని రెచ్చగొడుతూ అన్నాడు అవినాష్.అతను ఏదో వ్యూహంతో అలా చేస్తున్నాడని తెలుసు కానీ, ఎందుకు చేస్తున్నాడో లక్ష్మికి అర్థంకావటంలేదు.

"అట్లా ఎవరూ చెయ్యలేరు.." అన్నాడు హెడ్డు.

"మీలో ఇదుగో ఈవిడలా నేను వేషం వేసుకుంటాను. ఈ అబ్బాయిలా మా లక్ష్మి వేషం వేసుకుంటుంది. వీళ్ళ పేరుమీద విమానంలో ప్రయాణించి చూపిస్తాం. అప్పుడయినా మీరు మేము గొప్ప నటులమని ఒప్పుకుంటారా?" అన్నాడు అవినాష్.

"ఒప్పుకుంటాను" అన్నాడా హెడ్డు.

"మీ ఐడీ కార్డులు ఇటు ఇవ్వండి.." అన్నాడు అవినాష్. అతని ప్లాన్ చూచాయగా అర్థం అయింది లక్ష్మికి.

"మా ఐడీ కార్డులు మీరు తీసుకుపోతే ఎలా?" ఎవరివైపు వేలుపెట్టి అవినాష్ చూపించాడో వారు ఆందోళనగా అన్నారు.

"మీకు చెరొక పదివేలు అడ్వాన్సుగా ఇస్తాను. మేము ప్రయాణం పూర్తిచేసిన తరువాత మా బోర్డింగ్ పాస్ సహామీ ఐడీ కార్డ్ మీకు వెనక్కి పంపుతాను. ఒకవేళ నేను మీ ఐడీ వెనక్కి పంపకపోయినా దాని డూప్లికేట్ తీసుకోవటానికి వంద రూపాయలు కూడా ఖర్చు కాదు" చెప్పాడు అవినాష్.

"నీ డబ్బులు ట్యాక్సీ డ్రైవర్ కొట్టేశాడన్నావ్? మరి

**రాహుల్‌గాంధీకి జిహాదీలు, మావోయిస్టుల సానుభూతి వుందనేది అసత్యం.**

*-పి.చిదంబరం, కాంగ్రెస్ నేత*

**ఫెడరల్ వ్యవస్థలో సంతృప్త రాష్ట్రం, బలమైన కేంద్రం అవసరం.**

*-పినరాయి విజయన్, కేరళ సి.ఎమ్.*



## బ్యాడ్మింటన్ స్కూల్

చేస్తున్న సినిమాలకు సంబంధించిన శిక్షణలతో శ్రద్ధాకపూర్ బిజీబిజీగా గడిపేస్తున్నది. పొద్దున్నే బుద్ధిగా బ్యాడ్మింటన్ స్కూలుకు రెడీ అయిపోతున్నది. సైనా నెహ్వాల్ బయోపిక్‌లో నటిస్తున్న శ్రద్ధ ఇందుకోసం బ్యాడ్మింటన్ నేర్చుకుంటున్నది.

ఇదిగో... ఇదిగో అంటూ వాయిదాపడుతూవస్తున్న సినిమా ఎట్టకేలకు సెప్టెంబరులో మొదలవబోతున్నది.సో, 'శ్రద్ధ'గా ప్రాక్టీస్ చేస్తున్నది.ఓ రెండు నెలలీ కార్యక్రమం కొనసాగుతుందట. తెలుగులోనేమో 'సాహో' షూటింగ్‌తో బిజీ. వారెవ్వా!!

## విమర్శల పాత్ర

తన తప్పులు అందరికంటే ముందు తనకే తెలుస్తాయని, విమర్శల విషయంలోనూ సానుకూలంగా స్పందిస్తానని గొప్పలు పోయింది రాశీ ఖన్నా. పైగా తన ఎదుగుదలలో విమర్శల పాత్ర ఉందని ఫ్రాంక్‌గా చెప్పింది.

"విమర్శలు నాకెప్పుడూ కోపం తెప్పించవు. ఇంకా చెప్పాలంటే నాలోనే విమర్శకురాలు వుంది. సినిమా చూసుకున్నప్పుడు నా తప్పులు నాకే అర్థం అవుతాయి. ఎదుటివారిలో సమయపాలన లోపిస్తే మాత్రం నాకు కోపం వచ్చేస్తుంది" అంటోంది.







మాకు ఇవ్వటానికి అంత డబ్బు ఎక్కడిది...?" పాయింట్ తీశాడు హెడ్డు. నవ్వాడు అవినాష్.

"రాత్రిపూట ఈ రోడ్డు మీద ప్రయాణంప్రమాదం అని నాకు మాత్రం తెలియదా? అందుకే రహస్యంగా ఇక్కడ దాచాను" అంటూ నడుముకు కట్టుకున్న ఒక బ్యాగ్ తీసి అందులో నుండి డబ్బు తీసి చెరొక పది వేలు ఇచ్చాడు.

దానితో వారు వారి ఐడీ కార్డులు ఇచ్చారు."మీరు ఇంకో సాయం చెయ్యాలి?" పది వేలు తీసుకున్నారన్న ధైర్యంతో కాన్ఫిడెంట్‌గా అడిగాడు అవినాష్.

"ఏమిటి"

"మాకు మేకప్ వెయ్యాలి"

"ఆదెంత పని..." అంటూ ఆ పనిలో నిమగ్నమయ్యారు వారు. ఈలోపు టోల్‌గేట్ వచ్చింది. అప్పటికి ప్రధాన్ తన మనుషులతో అక్కడే ఉన్నాడు.ప్రతివాహనాన్నీ ఆపి అందులో ఉన్నమనుషులను పట్టిపట్టి చూస్తున్నారు.ఇంతలో అవినాష్,లక్ష్మి ప్రయాణిస్తున్న వ్యాన్ వచ్చి అక్కడ ఆగింది.

అందులోకి ఎక్కిన పోలీసులు ఒక్కొక్కరిని పరీక్షగా చూస్తూ ముసుగు వేసుకున్న ప్రెగ్నెంట్ లేడీ దగ్గరకు వచ్చారు. ఒక పోలీస్ ధైర్యం చేసి ముసుగు ఎత్తబోయాడు. ఆమె పక్కనున్న ఒక బక్కపలుచని వ్యక్తి ఆపనిచేయవద్దన్నట్లు పోలీసును గద్దించాడు.

అప్పటికే కొద్దిగా ముసుగు ఎత్తిన పోలీసుకు అక్కడ ఉన్న స్త్రీకి తను వెతుకుతున్న స్త్రీకి చాలా తేడా ఉందని అర్థమైంది. దాంతో ఆ పోలీస్ బయటకు వెళ్ళిపోయాడు.ఆ ముసుగులో ఉన్న స్త్రీ మారు వేషంలో ఉన్న అవినాష్ అనీ, ఆమె పక్కన ఉన్న పురుషుడు వేషం మార్చుకున్న లక్ష్మి అనీ... ఆ పోలీసుకు తెలిసే అవకాశం లేదు.

గౌహతి ఎయిర్‌పోర్ట్ ముందు ఆపిన వ్యాన్‌నుండి కిందకు దిగారు అవినాష్, లక్ష్మి.

దిగేముందు, "ఇప్పటికయినా ఈ పోటీ మీకు ఇష్టం లేకపోతే చెప్పండి. మీ ఐడీలు మీకు ఇచ్చి నా డబ్బు నేను తీసుకుంటాను" అన్నాడు అవినాష్.

పందెం సంగతి ఎలా ఉన్నా తమ ఐడీలు వెనక్కి తీసుకుంటే అతని ఇరవై వేలు వెనక్కి ఇవ్వాలనుకునే సరికి వారు ఆ పని చేయలేకపోయారు.

విడివిడిగా ఎవరిదారిన వారుగా లోపలకు వెళ్తున్న అవినాష్, లక్ష్మిలను ఎవరూ గుర్తించలేదు.

నిజానికి ఆ ఎయిర్‌పోర్ట్ నిండా సీక్రెట్ సర్వీస్ మనుషులు అనేకమంది కాపు కాసివున్నారు. ఒక చెయ్యి నడుము మీద పెట్టుకుని భారంగా అడుగులు వేస్తున్న ఆ యువతి రూపంలో ఉంది అవినాష్ అని వారి ఊహకి కూడా రాలేదు. ఇక సన్నటి మీసంతో, నిలువు చారల షర్టు జీన్సు ప్యాంటులోకి టక్ చేసి, వడివడిగా బోర్డింగ్ పాస్ కోసం వెళ్తున్న ఆ యువకుడిని చూసి లక్ష్మి అని ఎవరూ అనుకోలేదు.

ఇక సెక్యూరిటీ చెక్ దగ్గర ఆడవారి క్యూ వేరేగా, మగవారి క్యూ వేరేగా ఉంది. మగవారిని చెక్ చేస్తున్న వ్యక్తి ఆరడుగుల ఆజానుబాహుడయిన అవినాష్‌కోసం వెతుకుతున్నాడు. అలానే ఆడవారిని చెక్ చేస్తున్న ఆడపోలీస్ అందమయిన లక్ష్మి ఫోటో మాటిమాటికీ చూసుకుంటూ ఆ పోలికలతో ఉన్నవారికోసం చూస్తోంది. ఏ ఆటంకం లేకుండా సెక్యూరిటీ చెక్ నుండి బయటపడిన అవినాష్,లక్ష్మి వేరువేరుగా తమ తమ సీట్లలో కూర్చుని ఒకరితో ఒకరికి సంబంధం లేనట్లు ఢిల్లీవరకు ప్రయాణించారు.

ఢిల్లీ ఎరైవల్స్ లాంజ్ టాయిలెట్లోకి వెళ్ళిన ఇద్దరూ తిరిగి ఎవరి రూపంలో వారు బయటకు వచ్చారు.

ఢిల్లీ ఎయిర్‌పోర్ట్ బయట అరైవల్స్ గేటు బయట తిరిగి కలుసుకున్నారు అవినాష్, లక్ష్మి.

"ఇక నువ్వు హైదరాబాద్ వెళ్ళిపో. ఈ కుట్రని ఛేదించిన తరువాత అక్కడకు వచ్చి నిన్ను కలుసుకుంటాను" అన్నాడు అవినాష్.

"నువ్వు లేకుండా నేను ఎక్కడకూ వెళ్ళను"

"నేను చెప్తోంది అర్థం చేసుకో. ఇది నా సమస్య. నన్ను తేల్చుకోనివ్వు. అనవసరంగా ఇప్పటికే నువ్వు కూడా ఇందులో ఇరుక్కుపోయావు. ఇప్పుడయినా నువ్వు హైదరాబాద్ వెళ్ళిపోతే నీకు నాతో సంబంధం ఉందని ఎవరూ అనుకోరు. నా పరిస్థితి క్లియరయ్యాక తిరిగి కలుసుకుందాం" అన్నాడు అవినాష్.

"కష్టంలో ఉన్నపుడు ఒక్కడినే వదిలేసి, ఎప్పుడో దొరికే సుఖం కోసం వెతుక్కోవటం అర్థం లేని పని. నేను నీతోనే ఉంటాను. పైగా నేను పక్కన ఉంటే

SMYFRIENDS.COM

# చిలిపి



**రో**డ్డు మధ్యలో నిలబడి
అందరికీ అడ్డంవచ్చేదెవరు?
ట్రాఫిక్ పోలీసు!

**ఒ**రే నానీ తాజ్‌మహల్
ఎక్కడుందో చెప్పు చూద్దాం?
మా తాతయ్య బీడీకట్టమీద.

**టె**లీఫోన్ ఎక్స్ఛేంజీకి, ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజీకి తేడా?
ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజీలో మనుషులు క్యూలో ఉంటారు.
టెలిఫోన్ ఎక్స్ఛేంజీలో మనుషులు లైన్‌లో ఉంటారు.

**పం**క్తి భోజనంలో ఆఖరివాడు తినేవరకూ ఎవరూ లేవరెందుకని?
తమలో తిండిపోతు ఎవరో చూద్దామని.

**ఏ**రా గోపీ! ఉత్తరం పోస్టు చేయకుండా వచ్చావేం?
పోస్టు డబ్బామీద ఉత్తరాలు తీసే వేళలే ఉన్నాయిగాని వేసే వేళలు లేవు సార్!

**భ**ర్త మాట భార్య వినాలా? భార్య మాట వినాలా?
ఎలాగైనా ఫరవాలేదుకాని, ఇద్దరి మాటలు ఇరుగుపొరుగువాళ్ళు వినకుంటే చాలు.

---

నీకు అంతో ఇంతో సాయపడే అవకాశం ఉంటుంది" మొండిగా అంది లక్ష్మి. ఇక చేసేదేం లేక ఇద్దరూ కలిసి ఒకే ట్యాక్సీ ఎక్కారు.

"కన్నాట్ ప్లేస్..." అన్నాడు అవినాష్.

ట్యాక్సీ అటు ప్రయాణం మొదలుపెట్టింది.

"అక్కడేముంది?" అడిగింది లక్ష్మి.

"కమర్షియల్‌లాకర్ ప్లాజా" చెప్పాడు అవినాష్.

పూర్తిగా అర్థంకాకపోయినా రెట్టించలేదు లక్ష్మి.

లాకర్ ప్లాజాలో ఐరిస్ ఐడెంటిఫికేషన్ అయ్యాక లాకర్ ఆపరేట్ చేసుకోవటానికి అతన్ని లోపలకు పంపారు.అతనితోపాటు లక్ష్మి కూడా లోపలకు నడిచింది.లాకర్ ఓపెన్ చేసిన అవినాష్ ఆ లాకర్లో ఉన్న కొన్ని ఐడీ కార్డులు, క్రెడిట్ కార్డులు, కొంత క్యాషు తీసి ఒక సంచిలో పెట్టుకున్నాడు. వాటితోపాటు ఉన్న ఒక పిస్టల్‌ని తీసుకోవాలా, వద్దా అని ఆలోచించి చివరికి దాన్ని కూడా తనతో ఉంచుకున్నాడు.

"ఎప్పుడయినా ఎవరికీ తెలియకుండా అండర్ గ్రౌండ్‌కు వెళ్ళాల్సిన అవసరం వస్తే పనికివస్తాయని ఈ ఏర్పాట్లన్నీ చేసుకున్నాను..." సంజాయిషీ ఇస్తున్నట్లు చెప్పాడు. "ఐ...సీ..." అంది లక్ష్మి.

ఇద్దరూ లాకర్ క్లోజ్‌చేసి బయటకు వచ్చారు.లాకర్ ప్లాజా దగ్గర ఉన్న ట్యాక్సీ కాకుండా కొద్ది దూరంనడిచి వేరే ట్యాక్సీ పిలిచాడతను. ఇద్దరూ ట్యాక్సీ ఎక్కాక, ఒక ఫైవ్ స్టార్ హోటల్‌పేరు చెప్పాడు అవినాష్.

"ఆ హోటల్లో దిగుతామా?" అడిగింది లక్ష్మి.

"చెప్తాను..." అని కాసేపు ఆగమన్నట్లు సైగచేశాడు అవినాష్. తరువాత తను లాకర్ నుండి తెచ్చిన ఐడీ కార్డుల్లో ఒక ఐడీ బయటకు తీశాడు.

అది అవినాష్ పేరుతో ఉన్న డ్రైవింగ్ లైసెన్స్. దానితోపాటు కొన్ని పెద్ద నోట్లు ఇచ్చి,

"ఆ హోటల్లో నా పేరుమీద ఒక రూమ్ బుక్ చేసి అడ్వాన్స్ ఇవ్వు. ఐడీ కింద ఈ డ్రైవింగ్ లైసెన్స్ ఇవ్వు" చెప్పాడు అవినాష్.

"ఆర్యూ మ్యాడ్? నీ నిజమయిన పేరుతో హోటల్ బుక్‌చేస్తే క్షణాల్లో వారికి తెలిసిపోతుంది..." అని ఇంకా ఏదో అనబోతున్న ఆమెను ఆపి, "ఏమీ కాదు. నేను చెప్పినట్లు చెయ్యి..." అన్నాడు అవినాష్.

ట్యాక్సీ దిగి హోటల్ లోపలకు నడిచింది లక్ష్మి.

రిసెప్షన్ ముందు నిలబడిన ఆమెను ఫ్రంట్ డెస్క్ మేనేజర్, "చెప్పండి మేడమ్" అంటూ పలుకరించాడు. "ఒక రూమ్ బుక్ చేయాలి"

"మీకేనా మేడమ్"

"నో, నో... మిస్టర్ అవినాష్ పేరుమీద బుక్ చేయండి. నేను ఆయన సెక్రటరీని. ఆయన ఢిల్లీకి ఇంకా రాలేదు. సాయంత్రానికి చేరుకుంటారు" అడగకుండానే వివరాలు చెప్పింది లక్ష్మి.

"కనీసం ఎవరి పేరుమీద రూమ్ బుక్‌చేస్తున్నారో వారి ఐడీ కావాలి మేడమ్"అవినాష్ఒరిజినల్ డ్రైవింగ్ లైసెన్స్ తీసి ఇచ్చింది లక్ష్మి. దాని కాపీ తీసుకుని వెనక్కి ఇచ్చేశాడు మేనేజర్.

"మీరు క్యాష్ తీసుకుంటారు కదా..."

"ఎస్ మేడమ్..."

పదివేలు అడ్వాన్స్ కింద ఇచ్చింది. "గది తాళం చెవి మీ దగ్గరే ఉంచండి. ఆయన వచ్చి కలెక్ట్ చేసుకుంటారు..." చెప్పి బయటకు నడిచింది లక్ష్మి.

బయటకు వచ్చి తిరిగి అవినాష్ ఉన్న ట్యాక్సీలో కూర్చుంది లక్ష్మి. తిరిగి ట్యాక్సీ బయలుదేరింది. అప్పటికే అతను అడ్రస్ చెప్పి ఉండటంతో సరాసరి మరో హోటల్ ముందుకు వెళ్ళి ఆగింది. 'మళ్ళీ ఇదేంటి?' అన్నట్లు చూసింది లక్ష్మి.

"ఇందాక బుక్ చేసినట్లే మరొక గది ఇక్కడ కూడా బుక్ చెయ్యి" చెప్పాడు అవినాష్.

మరోసారి హోటల్ లోపలకు నడిచింది లక్ష్మి. ఇంతకుముందు హోటల్లో చేసినట్లే అవినాష్ పేరు మీద మరో రూము బుక్‌చేసి దాని తాళం అక్కడే వదిలివచ్చింది లక్ష్మి.

ట్యాక్సీ పంపించి ఒక దుకాణందగ్గర ఆగి రెండు ఫోనులు, రెండు సిమ్ కార్డులు కొన్నాడు. ఆమెకొకటి ఇచ్చి తను ఒకటి తీసుకున్నాడు. తర్వాత వేరే ట్యాక్సీ ఎక్కి డ్రైవర్‌ని ఢిల్లీలో కరోల్‌బాగ్ ఏరియాలోని ఒక అడ్రస్ చెప్పి అక్కడకు పోనివ్వమన్నాడు.

**ఇంకా ఉంది**



మహిళలు ఒకరినొకరు
చిన్న చిన్న విషయాలలోనే
విమర్శించుకోవటం మానెయ్యాలి.
-ఐశ్వర్యారాయ్ బచ్చన్, నటి



వయసుతో వెనకపడిన
కళాకారులను వెనువెంటనే
మనం మరచిపోతున్నాం.
-లతా మంగేష్కర్, గాయని

# వారఫలం

జూలై 5 నుండి 11, 2018 వరకు

పిడపర్తి వీరేశ్వరశాస్త్రి, పిడపర్తి భాస్కర సుబ్రహ్మణ్యశాస్త్రి
సెల్ : 94921 56064

**మేషం:** అశ్విని, భరణి, కృత్తిక 1వ పా. వీరు ఖర్చులు కొన్ని ఎక్కువైనా అనుకున్న పనులను పూర్తిచేసుకోగలరు. కొంత వేదన, స్తబ్దత వంటివి, వృత్తి, ఉద్యోగాలలో ఎదుర్కోవలసిరావచ్చును. సంతానమునకు అదనపు ఆదాయాలు ఏర్పడగలవు. ప్రయాణాలు అనుకూలిస్తాయి. వీరు 'రాజమాతంగినే నమః' అని జపించుట మేలు. వీరికి శని, ఆది, బుధవారాలు అనువైనవి.

**వృషభం:** కృత్తిక 2,3,4పా, రోహిణి, మృగశిర 1, 2పా. ఈ వారంలో వీరు ఆచరించే కార్యాలలో అనుకూలతలు పొందుతారు. ప్రయాణాలు అనుకూలిస్తాయి. ఆరోగ్యం విషయంలో మేలుతనాలు ఉంటాయి. ఖర్చులు అధికంగా ఏర్పడినా సమర్థించుకోగలరు. వృత్తి, ఉద్యోగాలలో కొంత వేచి ఉండు పరిస్థితులుంటాయి. ఈ రాశివారికి గురు, శుక్ర, సోమ వారాలు అనువైనవి.

**మిథునం:** మృగశిర 3,4పా, ఆరుద్ర, పునర్వసు 1,2, 3పా. ఈ వారంలో ప్రతి పని శ్రమతోను, కాలయాపనతోను పూర్తిచేసుకుంటారు. ఆరోగ్యం విషయంలో నిర్లక్ష్య ధోరణి పనికిరాదు. సంతానం గురించి దూర ప్రయాణాలు చేయవలసిరావచ్చును. మీరు నిత్యం సూర్య, అంగారక స్తోత్రాలను పారాయణ చేసుకోవాలి. వీరికి గురు, శుక్ర, శని, ఆది, బుధవారాలు అనువైనవి.

**కర్కాటకం:** పునర్వసు 4వ పా, పుష్యమి, ఆశ్లేష. నిర్ణయంలో జాప్యం, కోపావేశాలకు గురికావుట ఉండగలవు. సమస్యాత్మక అంశాలకు దూరంగా ఉండాలి. శత్రుభావాలున్నవారిని అదుపులో ఉంచుకోగలరు. ఖర్చులకు తగిన ఆదాయాలు ఉంటాయి. అధికారులతో సంయమనములు పాటించుకోవాలి. రాహు, కుజ, కేతువుల స్తోత్రాలను పారాయణ చేసుకోండి.

**సింహం:** మఖ, పూర్వఫల్గుని, ఉత్తరఫల్గుని 1వ పా. ఈ వారమంతా మీ ఆధిపత్యమును ప్రదర్శించగలుగుతారు. ఉద్యోగాలకై చేసే ప్రయత్నాలలో నిరాశలకు గురికాకుండా సాగండి. సమయానుకూలంగా ఉండి, స్థిరాస్తులను వృద్ధిపరచగలరు. నైరుత్యాభిముఖంగా రాహు స్తోత్రము పారాయణ చేయండి. సోమ, బుధవారాలందు ముఖ్యమైన పనులను చేపట్టుకోండి.

**కన్య:** ఉత్తరఫల్గుని 2, 3, 4పా, హస్త, చిత్త 1, 2పా. మిశ్రమ ఫలితాలు ఉంటాయి. ఆదాయాలు అనుకూలంగా ఉన్నాయి. చెల్లింపులకు ప్రాధాన్యతనీయగలరు. స్నేహ, భ్రాతృవర్గంవారితో తటస్థంగా వ్యవహరించుకుంటారు. వివాహ, ఉద్యోగ ప్రయత్నాలలో పురోగతి ఉంటుంది. ఇంటి నిర్మాణపు పనులలో కదలికలు ఉంటాయి. శని స్తోత్రమును నిత్యం పారాయణచేసుకోండి. వీరికి శని, ఆది వారాలలో మెలకువలు అవసరం.

**తుల :** చిత్త 3, 4పా, స్వాతి, విశాఖ 1, 2, 3పా. ఈ వారంలో ఉత్సాహంగా, ఉల్లాసంగా ఉంటారు. వృత్తి, ఉద్యోగాలలో రావలసిన ఆర్థిక లబ్ధిలు, ప్రమోషన్లువంటివి ఉంటాయి. వచ్చిన అవకాశాలను జారవిడుచుకోకుండా ముఖ్యమైన వ్యవహారాలలో పట్టువిడుపులతో సాగాలి. నిత్యం శివపంచాక్షరిని నిత్యం జపించుకొనుట మేలు. గురు, శుక్ర, శని, ఆదివారాలు అనువైనవి.

**వృశ్చికం:** విశాఖ 4వ పా, అనూరాధ, జ్యేష్ఠ. ఆరోగ్యవిషయంలో ముందుజాగ్రత్తలు తప్పనిసరి. ప్రయత్నాలను అనుకూలింపచేసుకోగలరు. భవిష్యత్ పనులకు కావలసిన వనరులను ఏర్పరచుకోగలరు. ఉన్నతవిద్యలకై ఎక్కువ ప్రయత్నాలుంటాయి. చెల్లింపులలో అనుభవజ్ఞుల సలహాలు అవసరం. ఆదిత్య ఆరాధన తప్పనిసరి చేయండి. శని, ఆది, సోమవారాలు అనువైనవి.

**ధనుస్సు:** మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వ పా. ఈ వారంలో గ్రహస్థితి ప్రతికూలంగా ఉంది. సంయమనంతో సాగాలి. దగ్గరివారితో కలిసి ముఖ్యమైన వ్యవహారాలను చేపట్టుకోగలరు. ఆర్థికంగా ఒకింత మేలుగా ఉండగలదు. వృత్తి, ఉద్యోగాలలో పని ఒత్తిడులున్నా సంతృప్తిని పొందగలరు. మీరు సూర్యారాధన తప్పనిసరి చేయండి. సోమ, మంగళ, బుధవారాలు అనువైనవి.

**మకరం:** ఉత్తరాషాఢ 2,3,4పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2పా. ఈ వారంలో సహోద్యోగులతో, వ్యాపార భాగస్తులతో కాని అనవసరమైన అభిప్రాయభేదాలు ఏర్పడకుండా జాగ్రత్తలు అవసరం. గృహంలో శుభకార్య తలంపులచే ఖర్చులు కొన్ని ఎక్కువ చేయవలసిరావచ్చును. ఆరోగ్యం మేలుకరం. కాలభైరవ, సుబ్రహ్మణ్య స్తోత్రాలు మేలునిస్తాయి. గురు, శుక్ర, బుధవారాలు అనువైనవి.

**కుంభం:** ధనిష్ఠ 3, 4పా, శతతార, పూర్వాభాద్ర 1, 2, 3పా. ఈ వారం అనుకూలమైనది. మీరు ఎదుటివారితో వ్యవహారాలందు చిరునవ్వు చెదరకుండా వ్యవహరించుకోండి. వృత్తి, ఉద్యోగాలపరంగా ముఖ్యమైన నిర్ణయాలు తీసుకోగలరు. సుబ్రహ్మణ్యారాధనలు మరింత మేలునిస్తాయి. శని, ఆది, సోమ వారాలు అనువైనవి.

**మీనం :** పూర్వాభాద్ర 4వ పా, ఉత్తరాభాద్ర, రేవతి. వృత్తి, ఉద్యోగాలలో గౌరవాలు అంతంతమాత్రమైనా కర్తవ్యాలకు ప్రాధాన్యతనీయండి. కొన్ని మంచి అవకాశాలు ఏర్పడినా సంశయాత్మకంగా స్వీకరించండి. మీరు నిత్యం శతరుద్రీయమును పారాయణ చేసుకోండి. వీరికి గురు, శుక్ర, సోమవారాలు అనువైనవి.

మంచి పనులు వెంటనే చేయాలి. ఎందుకంటే కాలం మనకోసం ఆగదు.

మిత్రదేశాల సైన్యాలను కలుపుకుని గొప్ప నౌకా బలగంతో సముద్రంమీద వెళ్ళి ట్రాయ్‌ని ముట్టడిస్తాడు గ్రీసు రాజు. ఆ యుద్ధంలో గ్రీకు దేవతలు కూడా పాల్గొన్నారట. రమణుల కోసం రాజ్యాలే కూలిపోయాయంటారు. ఆ మాట నిజమే.గ్రీకురాణి హెలీనామూలంగా ఒక రాజ్యమే కూలిపోయింది.

ట్రాయ్ నగరం విధ్వంసమయింది. అలాగే ఒక గ్రీకు యువరాజు ఫిలిప్. అతడు ప్రపంచ దేశాలను జయించాలని విశ్వవిజేత కావాలన్న లక్ష్యంతో, 'అలెగ్జాండర్' బిరుదు వహించి, అపారమైన సేనావాహినితో వాయవ్య భారతం వరకు జయించుకువచ్చిన మహావీరుడు.

సీరియల్

# మనిషిలో మనిషి



E-mail: Suryadevaranovelist@gmail.com

## సూర్యదేవర రామ్మోహనరావు



ఆ వీరుడు బాల్యంలో ఆటలాడింది ఈ సముద్ర తీరంలోనే. భారతదేశ వ్యాపారులు యూరప్ వరకు ఆ కాలంలో వ్యాపారాలు సాగించేవారనడానికి నిదర్శనం నేటికీ అప్పుడప్పుడు తవ్వకాల్లో రోమన్ నాణాలు లభించటమే.

రోమన్‌లు శృంగార ప్రియులయితే గ్రీకులు యుద్ధ ప్రియులు. రోమన్ చక్రవర్తి జూలియస్ సీజర్ ఈ సముద్రజలాలమీదే నౌకా ప్రయాణం చేసి జగదేకసుందరి క్లియోపాత్రాను చూడ్డానికి ఈజిప్టు చేరుకున్నాడు.

ఒకప్పుడు నౌకా యుద్ధాలతో నెత్తురు కలిసి ఎర్ర బారిన సముద్రమిది.అదంతా గుర్తుకొస్తూంటే శరీరం పులకరిస్తోంది. తీరానికి ఎత్తులో ఎగురుతూనే ఆలోచిస్తున్నాడు కార్తికేయ. తనిప్పుడు ఆఫ్రికా వాయవ్యప్రాంతంలోని తీరదేశం లిబియాలో ఉన్నట్టు గుర్తించాడు.

కల్నల్ గడాఫీ నిరంకుశపాలనకు నిదర్శనం లిబియా. ఎప్పుడూ అలజడులు అంతర్యుద్ధాలతో సతమతమయ్యే దేశం. ఆ దేశంమీదుగా ఆఫ్రికా గగనతలానికి ఎగిరితే కన్పించేది సహారా ఎడారి.

సువిశాలమైన ఆ ఎడారిని చుట్టి ఎన్నో దేశాలు

### 34 జరిగిన కథ

బిలమార్గంలో లియోపక్షి కాలిపోతుండగానే తన పరకాయప్రవేశ విద్యతో వెనక్కి వచ్చి కొమ్మల మీది కొంగ శరీరంలో తిరిగి ప్రవేశిస్తాడు కార్తికేయ.తను భైరవేశ్వర్‌ద్వారా చేయించిన ప్రయోగం విఫలమై రాకుమారి బ్రతికిందేమోనన్న సందేహం పీడించసాగింది స్వామి సత్యానంద్‌ని.

గత మూడు మాసాలుగా తనకేం జరిగిందో చెప్పమని తండ్రి రాజావారిని నిలదీస్తుంది సంజనా. స్వామి సత్యానంద రాజావారికి ఫోన్ చేస్తాడు.

సంజనా యోగక్షేమాలను విచారిస్తాడు. తన కూతురు ఇంకా కోలుకోలేదని అబద్ధం చెప్తారు రాజావారు. తమ ఆస్థానానికి స్వామి సత్యానందే శత్రువని తెలిసి ఆశ్చర్యపోతుంది సంజనా.

ఇంగ్లండ్ వెళ్ళే ఒక ఓడ క్యాబిన్‌పై ప్రయాణించడం మొదలుపెడతాడు బకరూపుడైన కార్తికేయ. ఓ పక్షంరోజులతర్వాత ఆ ఓడ ఇంగ్లాండ్ చేరాక అక్కడినుండి ఎగురుతూ మధ్యధరా సముద్రం దక్షిణ నైరుతి ప్రాంతానికి చేరుకుంటాడు కార్తికేయ. ఇక జరిగేది చదవండి.



వున్నాయి. అటు వెళితే ఎడారి భూములలో ఎక్కడా తనకు ఆహారం దొరకదు. అందుకే సముద్రతీర ఆకాశంలోనే సాగుతోంది కొంగ పయనం.

మధ్యధరా సముద్రంమీద తిరుగాడే చేపలబోట్లు ఓడలను చూస్తూ ముందుకుపోతోంది కొంగ. ఆక లేస్తే తీరంమీద వాలి లోతు తక్కువ జలాల్లో దొరికి నవి తినటం, తిరిగి ముందుకు సాగటం.

ఇలా వారం దినాలు దివారాత్రులు ప్రయాణం చేసి ఈజిప్టు సరిహద్దులకు చేరుకుంది. తీరంవెంట గ్రామాలు, పట్టణాలు దాటి వెళ్ళిపోతోంది.

ఆసియా ఖండం దగ్గరపడుతున్నకొద్దీ తొందర అధికరిస్తోంది. ఇండియా ఎప్పుడు త్వరగా చేరుకుం టానా... సంజనా యోగక్షేమాలు ఎప్పుడు తెలుసు కుంటానా అని ఆత్రపడుతున్నాడు కార్తికేయ. పక్షం దినాలు ఈజిప్టు తీరంవెంట ప్రయాణించి ఈజిప్టు రేవు పట్టణం అలెగ్జాండ్రియా చేరుకుంది కొంగ.

అలెగ్జాండ్రియా చరిత్ర ప్రసిద్ధికెక్కిన నగరం. ఎన్నో యుద్ధాలు చూసింది. కొలంబియాలో తను చంపిన పాబ్లో ఎస్కోబార్ చివరిసారిగా దర్శిం చిన నగరం ఇదే. ఆ సమయంలో తను వాడి కుడి భుజం పీటర్ ఇంట్లో ఉన్నాడు.

ఇంకో రెండు దినాలు ప్రయాణం చేస్తే చాలు. తను ఆఫ్రికాదాటి ఆసియా భూభాగంమీద ఎగురు తూంటాడు. అందుకే అలెగ్జాండ్రియా నగర పరిసరా లలో ఎక్కడా ఆగలేదు.దాటి ముందుకు సాగాడు.

మబ్బుల ఎత్తున ఎగురుతూంటే సుదూరంలో కైరో నగరం, సహారా ఎడారి, పిరమిడ్‌లు, నైలునది ఛాయలూ కన్పిస్తున్నాయి. అలెగ్జాండ్రియా వదిలిన మూడోరోజున సూయాజ్ కెనాల్‌దాటి ఆసియా ఆకాశ మార్గంలో ప్రవేశించింది కొంగ.

అక్కడినుండి తూర్పుగా వెళితే అన్నీ గల్ఫ్ దేశాలే. ఎప్పుడు ఎక్కడ ఏంగొడవలు జరుగుతూంటాయో తెలీదు. ముఖ్యంగా యెమన్, ఇరాక్, ఇజ్రాయెల్, ఇరాన్, పాకిస్తాన్‌లమీదుగా ప్రయాణం కాస్త రిస్క్ వ్యవహారమే. అందుకే రూట్ మార్చి దక్షిణంగా ఎర్ర సముద్రంమీదుగా వచ్చి సౌదీ చేరుకున్నాడు.

అరేబియా సముద్రజలాలను చూస్తూ తీరంమీద వాలగానే చాలా సంతోషం వేసింది. ఆ సమయంలో వర్షం కూడా పడుతోంది. వాతావరణం చాలా బాగుంది. ఆసియా వచ్చేశాడు.

సొంత దేశం చేరినట్టే ఉంది. తీరంవెంట తిన గలిగినంత ఆహారం. అక్కడినుంచి తీరజలాలమీదే ఎగురుతూ తూర్పుగా ప్రయాణం ఆరంభించింది.

పదిరోజుల్లోనే అది పాకిస్తాన్ తీరాన్ని కూడా దాటి సింధూనదీ పరీవాహక ప్రాంతానికి చేరుకుంది. చాలా అందమైన ప్రాంతం. అవతల కచ్. దీన్ని 'రాన్ ఆఫ్ కచ్' అని 'భృగుకచ్ఛ' అనీ అంటారు.

భారత పాకిస్తాన్ సరిహద్దు అది. ఇక ఇండియా వచ్చేసినట్టే అనుకొంటూండగా ఉన్నట్టుండి వాతా వరణం మారింది. అరేబియా సముద్రంమీద ఏర్పడిన అల్పపీడన ద్రోణి వాయుగుండంగా మారింది.



## మరిన్ని చిత్రాలు

టాలీవుడ్‌లో ఏవో కొద్దిపాటి సినిమాలు చేసినా బ్రేక్ మాత్రం అనీషా ఆంబ్రోస్‌కు ఆమడదూరంలోనే వుండిపోయింది.

రాబోయే 'ఈ నగరానికి ఏమైంది' సినిమాపైన బోలెడన్ని ఆశలుపెట్టుకున్నది.

"నేను ఇంతకుముందు సురేష్ ప్రొడక్షన్స్‌లో 'గోపాల గోపాల'లో చిన్న పాత్ర పోషించాను.

ఇప్పుడు వాళ్ళు ఈ చిత్రంలో ఓ హీరోయిన్ పాత్ర ఇచ్చారు. ఈ బృందంతో కలిసి పనిచేయడం సంతోషంగా వుంది. వారితో కలిసి మరిన్ని సినిమాలు చేయాలనుకుంటున్నా" అని తెలిపింది.

## ఇంకో ఇరవై సినిమాలు

భర్తతో కలిసి విహారయాత్రలు చేస్తూ, వినోదాలు పండిస్తూనే సినిమాలు చేస్తున్నది శ్రియా శరణ్. 'పెళ్ళయిందికదా, మరి తల్లి అయ్యే ఆలోచన ఉందా?' అని అడిగితే తనదైన మార్కు చిలిపి నవ్వులు చిందించింది.

"మరో ఇరవై సినిమాలు పూర్తయ్యేదాకా పిల్లల్ని కనకూడదని అనుకుంటున్నాను. నా భర్త అభిప్రాయం కూడా అదే. అర్థంచేసుకునే మంచి మనసున్న వ్యక్తి భర్తగా లభించడం నా అదృష్టం" అంటూ పనిలో పనిగా భర్తను కూడా పొగుడుకున్నది.



ఉవ్వెత్తున కెరటాలు లేచిపడి సముద్రం అల్లకల్లోలంగా ఉంది. పెనుగాలికి ఎదురీదలేక నేలకు వాలింది కొంగ. సరిహద్దు దాటిపోలేక ఒక కొండగుట్టపైన సేఫ్ ప్లేస్ చూసుకుని నక్కికూర్చుంది.

ఒంటరిగా చీకట్లలో బిక్కుబిక్కుమంటూ ఏమీ తినకుండా అయిదు రోజులు గడిపింది. అప్పటికి శాంతించింది సముద్రం. తుఫాను ఎక్కడ తీరం ఎక్కిందోగాని ప్రమాదం తప్పింది.

వాతావరణం శాంతించేసరికి సాయంకాలమయింది. మబ్బులవలన అప్పటికే చీకటి పడినట్టుంది. దొరికినవి తిని రాత్రికి చెట్లమీదే గడిపి ఉదయమే తిరిగి ప్రయాణం ఆరంభించింది.

కచ్ ప్రాంతమంతా సముద్రం వదిలేసిన ప్రాంతంలోతు తక్కువ జలాలతో కూడిన సముద్ర కయ్యలు దిబ్బలు కన్పిస్తాయి. వాటిమీద దట్టమైన పొదలు చెట్లు ఉంటాయి. అనేక పాయలతో కూడిన నీటి కయ్యల్లో చేపలు పుష్కలంగా దొరుకుతాయి.

పదిగంటల ప్రాంతంలో కొన్ని కొంగలతో కలిసి ఆహారంకోసం తనూ నేలకు వాలింది కొంగ. వలస పక్షులు అతిథులవంటివి. వాటిని చంపకూడదు.

చంపితే నేరమంటూ ప్రపంచవ్యాప్తంగా చాలా దేశాలు చట్టాలు చేశాయి. పక్షి వలస కేంద్రాలు (బర్డ్స్ శాంక్చురీస్) ఏర్పాటుచేసి సంరక్షిస్తూ ఉన్నాయి.

అయినా కూడా చట్టాన్ని పట్టించుకోని పాషండులు కొందరు వాటిని వేటాడి చంపి తింటూనేవున్నారు.

అలాంటి సమీప గ్రామవాసి ఒకడు నాటు తుపాకీతో నక్కినక్కి వచ్చి కొంగల్ని షూట్‌చేశాడు. పిట్టల్ని కాల్చే నాటు తుపాకీలో తూటాలుండవు.

చిన్న చిన్న సీసపు గుళ్ళు కూరి పేలుస్తుంటారు. వీటిని రవ్వలంటారు. చెల్లాచెదురుగా దూసుకెళ్ళే రవ్వలు పక్షుల ప్రాణాలు తీస్తూంటాయి. తుపాకి దెబ్బకి రెండు కొంగలు స్పాట్‌లోనే కూలిపోయాయి.

తుపాకి శబ్దం వింటూనే మిగిలినవి రివ్వున గాల్లోకి ఎగిరాయి. అలా ఎగురుతూండగానే ఒక రవ్వ దూసుకొచ్చి కార్తికేయ కొంగ కుడి రెక్క మధ్యలో గాయం చేస్తూ దూసుకుపోయింది.

అంతే... ప్రాణం పోతున్నంత బాధతో విలవిల్లాడుతూ గిరికీలు తిరుగుతూ వచ్చి కిందపడింది.

మిగిలిన కొంగలు అన్నీ ఎగిరిపోయాయి. తుపాకి ఊపుకుంటూ పరుగెత్తుకువస్తున్నాడు గ్రామవాసి. వాడ్ని చూడగానే తన పని అయిపోయిందనుకున్నాడు కార్తికేయ. వచ్చాడంటే మెడ మెలితిప్పి చంపేస్తాడు. వాడు చచ్చిన కొంగలు రెంటినీ తీసుకుని మోకాలిలోతు నీటిలో గబగబా తనవైపు వస్తున్నాడు.

భూగోళం అర్ధభాగాన్ని చుట్టివచ్చేశాడు. ఇంకో నాలుగు రోజుల్లో గమ్యం చేరుకోగలడు. అలాంటిది చివరి క్షణంలో ఈ పరీక్ష ఏమిటో అర్థంగావటంలేదు. తనకు చావు తప్పదా? శక్తినంతా కూడదీసుకున్నాడు. రెక్క బాధను పట్టించుకోకుండా గాల్లోకి ఎగిరాడు.

అది చూసి కోపంతో తుపాకితో కొట్టబోయాడు వాడు. ఎగిరి వాడి ముఖాన్ని తన వాడి గోళ్ళతో బలంగా రక్కి కసి తీర్చుకుంది. నెత్తిమీద రెట్టవేసి పైపైకి ఎగిరి కిందకు చూసింది. గోళ్ళు గీరుకుపోయి నెత్తురోడుతున్న ముఖంతో తలెత్తి తననే ఆశ్చర్యంగా చూస్తున్నాడు వాడు. ఆ శిక్ష వాడికి చాలదనిపించింది. కాని చేయగలిగింది ఏమీలేదు.

కచ్ ప్రాంతంమీదుగా ఎగురుతూ ద్వారకానగరంవైపు ప్రయాణం సాగించింది. గాయం నుంచి నెత్తురు స్రవిస్తోంది. భరింపరాని సలుపు. రెక్క తాటించటం కష్టంగా ఉంది. ప్రయాణ వేగం మందగించింది.

గాలివాటున రెక్కలు చాపి గ్లైడర్‌లా ఎగురుతూ ముందుకెళ్తోంది. మధ్యాహ్న సమయానికి గోమతీ నదీముఖద్వారంలో ఒకప్పుడు కృష్ణుని ద్వారక ఉండే ఏడు దీవులను దాటి క్రమంగా తీరంలోని నేటి ద్వారకా నగరాన్ని చేరుకుంది కొంగ.

అదికూడా దాటి ప్రభాసమీదుగా సోమనాథ ఆలయాన్ని సమీపించేసరికి సాయంకాలమైంది. అప్పటికి కొంగ శరీరంలోని శక్తి పూర్తిగా హరించుకుపోతోంది. రెక్క గాయం నరకం చూపిస్తోంది.

SMYFRIENDS.COM

ఇక ఎగరగల పరిస్థితి కన్పించటంలేదు. తన పనై పోయిందనుకున్నాడు కొంగ శరీరంలోని కార్తికేయ. మదిలో పరమశివుడు మెదిలాడు. ఇక ఏం జరిగినా తన చేతుల్లో లేదు. అంతా ఈశ్వరేచ్ఛ అనుకున్నాడు. తన భారాన్ని ఆ సోమేశ్వరునిమీద ఉంచి ఆలయం పైన మూడు ప్రదక్షిణలు ఎగిరాడు. తర్వాత నేరుగా ఆలయంలోకి ఎగురుకుంటూ వచ్చేశాడు.

సాయంకాలం దర్శనంకోసం భక్తులు చాలామంది వరసలుతీరి ఉన్నారు. లోనకొస్తున్న కొంగను చూసి కంగారుపడి కొందరు పక్కకు తప్పుకుంటే కొందరు బెదిరించి బయటకు తరమాలని చూశారు.

"అమ్మో ఎంత పెద్ద కొంగ" అనుకుంటూ స్త్రీలు పిల్లలు ఆశ్చర్యంగా చూస్తున్నారు. గర్భగుడి ముందు మండపంలోకి ఎగురుతూ వచ్చిన కొంగ మెడ పొడవుగా ఉంచి రెక్కలు బార్లా చాపి సాష్టాంగ ప్రణామం చేస్తున్నట్టు నేలమీద ఒరిగిపోయింది.

"ఛీఛీ పాడు కొంగ. ఏకంగా గుడిలోకే వచ్చేసింది. బైటికి తోసేయండి.." అంటూ ఎవడో ధూర్తుడు అరుస్తున్నాడు.

కోసం కాస్త కష్టమైనా ఓర్చుకోవాలి. తప్పదు" అంటూ బయటికి వచ్చి గుడి మెట్లమీద కూర్చున్నాడు.

అది కాకతాళీయమో దైవఘటనో తెలీదుగాని ఆయనో ప్రముఖ డాక్టరు. గుజరాత్ జీవకారుణ్య సంఘం వైస్ ప్రెసిడెంట్. అన్ని ప్రాణులూ ఒక్కటే. సమస్త జీవులను సమదృష్టితో చూడాలి. భూతదయ కలిగివుండాలి. తోటి జీవులకు చేతనైన సాయం చేసి కాపాడాలి. కొంగ పొడవలేదు సరికదా పెంపుడు పక్షిలా ఆయన చేతుల్లో ఒదిగిపోయింది.

ఈలోపల ఆ పెద్దాయనతోపాటే ఆయన భార్య ఇద్దరు కొడుకులు కోడళ్ళు మనుమలు మనుమరాళ్ళు అంతా దర్శనం లైను వదిలి ఆయనవద్దకొచ్చేశారు. పిల్లలు చుట్టూచేరి కొంగను వినోదంగా చూస్తున్నారు. డాక్టర్‌గాబట్టి తన మెడికల్ కిట్ తెరిచాడు ఆయన. భార్య తన మినరల్ బాటిల్ వంపి నీరు పోస్తుంటే కొంగ గాయాన్ని కడిగి క్లీన్ చేశాడు.

చక్కగా తుడిచి టించర్ వేసి అదిమాడు. పైన మందువేసి అది ఊడిపోకుండా రెక్కలోన పైనకూడా టేప్ అతికించాడు. తర్వాత ఒక ఇంజక్షనిచ్చాడు. బాధను ఓర్చుకుంటూ దయతో ఆ మహానుభావుడు అందించిన

ఉత్సాహం ఏర్పడుతున్నాయి. ఆ రోజు సాదూభాయ్‌గా డ్రైవర్ దీనారామ్‌తో కలిసి ఛోటా రామ్‌పూర్ నుంచి భోపాల్‌వరకు కారులో వచ్చాడు.

అదే మార్గంలో ఎగురుకుంటూ తెలతెలవారే సమయానికి ఛోటారామ్ పూర్ చేరుకున్నాడు. తొలి వెలుగులో దూరంగా అడవిలో కొండల వరుస కనిపిస్తోంది. తన గమ్యం అదే. రెట్టించిన వేగంతో అటు ప్రయాణించాడు బకరూపుడు కార్తికేయ. సరిగ్గా అమెరికాను వదిలిన రెండుమాసాల ఏడురోజులకు అతడు జలపాతంవద్దకు చేరుకున్నాడు.

సరాసరి ఎగురుకుంటూ నేరుగా గుహలోపలికె వచ్చేస్తున్న కొంగను చూశారు శిష్యులు ఐదుగురు. ఉదయపు పనుల్లో వాళ్ళంతా బిజీగా ఉన్నారు. కొంగను అదలించి బయటకు తరమాలని చూశారు.

అంతలో అక్కడికొచ్చిన మర్మయోగి చిరునవ్వుతో శిష్యుల ప్రయత్నాన్ని ఆపాడు. ఆ రోజు పర్లాకిమిడి పోలీస్‌స్టేషన్‌లోంచి కార్తికేయ తప్పించుకుని పారిపోయివచ్చింది ఈ మర్మయోగివెంటే.

"మూర్ఖులారా, సాధారణ కొంగకాదురా. తన నిజ శరీరంలో చేరటానికొస్తున్న కార్తికేయ.వెళ్ళి గురుదేవుడు మణిసిద్ధులవారికి ఈ విషయం తెలియ జేయండి..." అంటూ



**ఆంధ్రప్రదేశ్‌కి రైల్వే జోన్ పదేళ్ళలో పరిశీలించాలని వుంది... పరిశీలిస్తున్నాం.**

-పీయూష్ గోయల్, కేంద్రమంత్రి



**చదువుండి సంస్కారం లేని విద్యావంతులవల్లనే ప్లాస్టిక్ కాలుష్యం పెరుగుతోంది.**

-మనోహర్ పారికర్, గోవా సి.ఎం.

"పవిత్రమయిన సోమనాథాలయంలోకి కొంగ రావటమా. అరిష్టం. గుడిని శుద్ధి చేయాలేమో" మరో భక్తుడు అరిచాడు. దర్శనానికి వేచివున్న భక్తులు అంతా లోనకు వచ్చిన కొంగను విచిత్రంగా చూస్తూ గోలగా అరుస్తున్నారు.

గుడి పూజారి ఒకడు కొంగను బయటకు తోసేయటానికి పొడవాటి కర్ర ఊపుకుంటూ వస్తున్నాడు. ఇంతలో- "ఆగండాగండి..." అంటూ అరవై ఏళ్ళ వృద్ధుడొకడు గబగబా అడ్డంవచ్చాడు.

"ఇదిగో పెద్దాయనా తప్పుకో... దాన్ని బయటికి తోసేస్తాను" అని పూజారి అరిచాడు.

"బయటికి తోసేస్తావా. శివుని దృష్టిలో ప్రాణులన్నీ సమానమని నీకు తెలీదా? కొంచెం కూడా మీకు దయాదాక్షిణ్యాలు లేవా? ఇలా చూడండి. దీని కుడి రెక్కమీద గాయం తాలూకు ఎండిన నెత్తురు.

ప్రాణావశిష్టమయి కాపాడమని ఆ సోమనాథుని సన్నిధికి చేరిన మూగప్రాణి. నిర్దయగా తోసేస్తావా? బాధ అందరిదీ ఒకటి కాదా. దీనిసంగతి నేను చూస్తాగాని నువ్వు వెళ్ళి పని చూసుకో" అంటూ ప్రేమగా కొంగను చేతుల్లోకి ఎత్తుకున్నాడు.

'ముక్కుతో పొడుస్తుందేమోనండీ జాగ్రత్త" అని ఆయన భార్య అరుస్తోంది.

"పొడవనీ" అన్నాడు నవ్వుతూ. "ఒక మంచి పని

ట్రీట్‌మెంట్ తీసుకున్నాడు కార్తికేయ.

"ఇక నీకు వచ్చిన శ్రమ లేదు. ఈ రాత్రి విశ్రాంతి తీసుకుంటే రేపట్నుంచి ఎప్పట్లా తిరగ్గలవు. హ్యాపీగా వెళ్ళిపో" అంటూ వెన్నుతట్టాడా డాక్టర్.

కృతజ్ఞతగా మెడచాపి ఆయన బుగ్గను స్పృశించింది కొంగ. తర్వాత చివ్వున ఎగిరి సమీపంలోని ఒక చెట్టు కొమ్మమీద కూర్చుంది.

డాక్టర్ కుటుంబం తిరిగి స్వామి దర్శనంకోసం గుడిలోకి వెళ్ళిపోయింది. ఆ సోమనాథుడే డాక్టర్ రూపంలో తనను ఆదుకున్నాడనుకుంటూ స్వామిని స్మరించుకున్నాడు కార్తికేయ.

దొరికింది తిని ఆ రాత్రికి ప్రభాసలోని చెట్లమీదే విశ్రాంతిగా ఉండిపోయాడు. దైవకటాక్షం కావచ్చు డాక్టర్ ట్రీట్‌మెంట్ కావచ్చు. మరునాడు ఉదయానికే గాయం బాధ తెలీకుండా పోయింది. దాంతో నెమ్మదిగా తిరిగి ప్రయాణం ఆరంభించింది కొంగ.

త్వరగా చేరుకునే ఉద్దేశంతో అది గుజరాత్ తీరం వదిలి క్రాస్‌గా అరేబియా సముద్రంమీదుగా బాంబే వైపు సాగింది. ప్రభాస్‌ను వదిలిన మూడోరోజుకు బాంబే చేరుకుంది. అక్కడినుంచి పూణే, పూణే దాటగానే దిశమార్చుకుని తూర్పు దిక్కుగా సాగిపోతూ మధ్యప్రదేశ్‌లోని భోపాల్‌ను చేరుకుంది.

గమ్యం దగ్గరవుతున్నకొద్దీ కొంగలో కొత్త శక్తి,

శిష్యులను హెచ్చరించాడు. ఈలోపల కొంగ తన శరీరం ఉంచబడిన తిన్నెమీదకు వచ్చి వాలింది.

తను వదిలి వెళ్ళినప్పుడు ఎలా ఉందో ఇప్పుడూ అలాగే ఉంది తన శరీరం. నిద్రపోతున్నట్టుంది. ప్రతి జీవికీ తన శరీరంమీద ప్రేమ ఉంటుంది. కార్తికేయ కూడా తన శరీరాన్ని కళ్ళారా చూసుకున్నాడు. ఇలా ఒక శరీరంలో ఉండి తన నిజశరీరాన్ని వీక్షించటం ఎవరికోగాని లభించని అదృష్టం.

అంతలో గురునాథుడు మణిసిద్ధుడు అక్కడికొచ్చాడు. అంతే రివ్వున వచ్చి ఆయన పాదాలమీద వాలిపోయాడు బకరూపుడు కార్తికేయ.

"దీర్ఘాయుష్మాన్ భవ... అభీష్టసిద్ధిరస్తు... లేనాయనా. ఎన్నో కష్టాలనధిగమించావు. విజయుడవై తిరిగివచ్చావు. చాలా ఆనందంగా ఉంది. ఇంకెందుకు ఆలస్యం. వెళ్ళు, నీ నిజశరీరంలో ప్రవేశించు..." అంటూ ఆనతిచ్చాడు మణిసిద్ధుడు.

వెంటనే పరకాయప్రవేశ విద్యతో కొంగ శరీరాన్ని వదిలి తన నిజశరీరంలో ప్రవేశించాడు కార్తికేయ. అంతే ఒక్కసారిగా నిద్ర మేల్కొన్నట్టు కళ్ళు తెరిచి లేచి కూర్చున్నాడు.

తిన్నె దిగివచ్చి అందర్నీ చూస్తూ మణిసిద్ధునికి, మర్మయోగికీ పాదాభివందనం చేసి ఆశీస్సులు



The Largest Circulated Telugu Monthly

సచిత్ర మాసపత్రిక

సరస్వతీ మానసపుత్రిక
స్వాతి సచిత్ర మాసపత్రిక


అందుకున్నాడు. మిగిలిన తాపసులందరికీ సవినయంగా నమస్కరించాడు.

పిమ్మట గుహామధ్యలో జలధారలతో సదా అభిషేకించబడుతున్న శివలింగాన్ని దర్శించి భక్తితో నమస్కరించాడు. కొంగను తీసుకుని మడుగు చెంతకు బయలుదేరాడు.

కొంగను వదలబుద్ధిగావటంలేదు. కళ్ళు చెమరుస్తున్నాయి. ఎక్కడో అమెరికాలోని కొలంబియా అటవీ ప్రాంతం నదీ తీరంలో ప్రాణాలు వదిలిన కొంగ శరీరం.

తను ఇక్కడికి చేరుకోవడానికి ఉపకరణంగా పనిచేసింది. సంజనాను కాపాడడానికి ప్రధాన కారణమైంది. ఎలా వదలగలడు.ఐనా తప్పదు. జలపాతం దిగువన మడుగుతీరంలో లోతుగా గొయ్యితీసి కొంగను పాతిపెట్టాడు కార్తికేయ. దాని ఆత్మ ఎక్కడ వున్నా శాంతించాలని ప్రార్థించాడు. మడుగులో శుచిగా తలస్నానం చేసి పొడి దుస్తులు ధరించి గుహలోకి వచ్చాడు.

చాలా ఆకలిగా ఉంది. ఉదయం ఆరాధనలో పాల్గొని శివలింగాన్ని అర్చించాక శిష్యులు అందించిన పండ్లు తిని పాలుతాగాడు.శరీరానికి కొత్త శక్తి చేకూరినట్టుంది. కార్తికేయకు తెలియని కొన్ని విషయాలు చెప్పి సంశయ నివృత్తిగావించాడు మణిసిద్ధుడు.

"స్వామీ నాదో విన్నపం..." బయలుదేరేముందు మణిసిద్ధుని అడిగాడు కార్తికేయ.

"ఏమిటది?"

"మొదటి శుభలేఖ తెచ్చి మీకే ఇస్తాను. మా వివాహానికి వచ్చి మమ్మల్ని ఆశీర్వదించాలి"

"అందుకు ఇంకా చాలా సమయం ఉంది నాయనా. అయినా నీవు శ్రమపడి రానక్కర్లేదు... మనస్ఫూర్తిగా నన్ను తలుచుకుని మనసులో చెబితే చాలు. మీ వివాహానికి తప్పక వస్తాను" అంటూ మాటిచ్చాడు మణిసిద్ధుడు.

అందరినుంచీ వీడ్కోలు తీసుకుని గుహలోంచి బయటికొచ్చేశాడు కార్తికేయ. కొండను చుట్టి వెనక తట్టున ఉంచిన తన జీప్ వద్దకు చేరుకున్నాడు.

కార్తికేయ జీప్‌లో ఛోటారామ్‌పూర్ చేరుకునే సరికి ఉదయం పదిగంటలు దాటింది సమయం. తను సరిహద్దులు దాటి ఒరిస్సాలో అడుగుపెడితే పోలీసులు అరెస్ట్ చేస్తారన్న భయం ఉంది. అందుకే అడవిలోంచి హైవేకు చేరుకోగానే ఎడంపక్క తిరిగి ఛోటారామ్‌పూర్ వచ్చేశాడు. మూడుమాసాలపాటు అడవిలో వదిలేసిన తన జీప్‌కు ఏమీ గాకపోవడం విశేషం. డాష్‌బోర్డులో ఉంచిన రివాల్వరు, మనీ పర్సు అందులోని ఏటీఎమ్ కార్డులు డబ్బు అంతా భద్రంగా ఉంది.

కాని అవతల తన చేతిలో ఆ రోజు హతమారిపోయిన కిట్టప్పనాయుడి వర్గం వ్యాన్‌మాత్రం దారుణంగా డ్యామేజీఅయి




తెలుగు రాష్ట్రాలలో నెం.1 స్వాతి


పక్కకు ఒరిగిపోయింది. ఏ అడవిదున్నలో దాన్ని నాశనం చేసుండాలి. చిరుతపులిగా తన చేతిలో చచ్చినవాళ్ళలో ఒకటి రెండు అస్థిపంజరాలే కన్పించాయి.

మిగిలిన శవాల్ని జంతువులు లాక్కుపోయివుండాలి. కాసేపు ట్రబులు ఇచ్చినా స్టార్ట్‌గావటంతో నిరాటంకంగా రాగల్గాడు. వెంటనే ప్యాలెస్‌కు ఫోన్‌చేయాలనుందికాని తన సెల్‌ఫోన్ ఛార్జింగ్ అయిపోయింది.

నేరుగా వచ్చి హోటల్లో రూమ్ తీసుకున్నాడు. ఫోన్ ఛార్జింగ్‌లో ఉంచాడు. కిందకొచ్చి హోటల్లో టిఫిన్ చేశాడు.

పక్కనే ఉన్న పబ్లిక్ కాల్ ఆఫీసులోకి వెళ్ళి ప్యాలెస్‌కు ఫోన్ చేశాడు. వెంటనే లైన్లోకొచ్చారు రాజా విష్ణుచంద్ర గజపతి మహదేవ్. ఏం వినాల్సివస్తుందోనని టెన్షన్‌గా ఉంది. గొంతు తడబడింది. "మావయ్యా... నేను కార్తిని"

"కార్తీ... నిజంగా నువ్వేనా?" అటునుంచి చాలా ఉద్వేగంగా వినవచ్చింది రాజావారి గొంతు.

"నేనే మావయ్యా... ఇంతకుముందే ఇక్కడ ఛోటారామ్‌పూర్ చేరుకున్నాన"ని చెప్పాడు కార్తికేయ.

"థ్యాంక్‌గాడ్. వచ్చావా... నువ్వు ఎక్కడున్నావో ఏమయిపోయావోనని ఎంత టెన్షన్ పడుతున్నామో తెలుసా? నీ కోసం క్షణం ఒక యుగంలా ఎదురు చూస్తున్నాం కార్తీ. నువ్వెళ్ళి మూడుమాసాలు దాటిపోయింది తెలుసా. ఫోన్ కూడా చేయలేదు..." సంతోషంలో గబగబా మాట్లాడేస్తున్నారు రాజావారు.

"మావయ్యా. మీ అమ్మాయి ఎలా ఉంది. అది చెప్పండి. సంజు లేచిందా? తను లేచి కోలుకుని ఎప్పటిలా తిరిగితేనే నేనుపడ్డ శ్రమ ఫలించినట్టు"

"లేచి తిరగటమా... కార్తీ రెండుమాసాల క్రితమే తను సడెన్‌గా కోమానుంచి బయటపడింది. ఇప్పుడు పూర్తి ఆరోగ్యంతో ఎప్పటిలా తిరుగుతోంది. తను లేవగానే ప్యాలెస్‌కు ఎప్పటి కళ వచ్చేసింది.

ఇప్పుడు నాతో పోట్లాడుతోంది. నీ గురించి చెప్పలేక నా ప్రాణం పోతోందిరా. ఏమైనా నా బిడ్డ నాకు దక్కిందిరా కార్తీ నీవల్ల. నీకోసం కలవరిస్తోంది. ఫోన్‌మోగితే చాలు నువ్వనుకుని పరుగెత్తుకొస్తోంది. దిగులుతో ఏడుస్తోంది"

"ఫోన్ సంజూకి ఇవ్వండి మావయ్యా..." అన్నాడు కార్తికేయ.

"అది. ప్రస్తుతం తన ప్యాలెస్‌లో లేదు"

"మావయ్యా ఏమంటున్నారు. తను ప్యాలెస్‌లో లేదా" అనడిగాడు కార్తికేయ.

"ఔను, తనిక్కడ లేదు", "లేదా" అంటూ షాక్‌తో కొయ్యబారిపోయాడు కార్తికేయ.

"కార్తీ..." అంటూ అటునుంచి పిలుస్తున్నారు రాజావారు.

"సంజనా ఇప్పుడు ఎక్కడుంది?" ఆత్రుత అణచుకుంటూ అడిగాడు కార్తికేయ.

"ఆహా... నువ్వేం కంగారుపడకు. నువ్వులేని





ఆగష్టు 2018 సంచిక
మార్కెట్లో సిద్ధంగా ఉంది
నవల ఉచితం


ప్యాలెస్‌లో తను ఉండలేదట. 'బావ వచ్చేవరకు తన జ్ఞాపకాలతోనే బతికేస్తాను. మా ఇంటికి వెళ్ళిపోతాను' అంటూ ఎంత చెప్పినా వినకుండా నాతో గొడవపడి రెండ్రోజుల క్రితమే తను నీ ఇంటికి వెళ్ళిపోయింది" అంటూ అసలు విషయం చెప్పారు రాజావారు.

ఆ మాటలు విన్నాకగాని మనసు కుదుటపడలేదు. నవ్వుకూడా వచ్చింది. "ఏమిటి మావయ్యా. తనకి తెలియకపోవచ్చు. అన్నీ తెలిసికూడా మీరెలా వెళ్ళనిచ్చారు? తను అక్కడ ఉండటం సేఫ్‌కాదని తెలీదా?" అన్నాడు కార్తికేయ. **ఇంకా ఉంది**

# నేనెవరో తెలుసా!

స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొని జైలుశిక్ష అనుభవించినవారిలో పదవులు దక్కినవారు ఆరుశాతం కూడా వుండరు. మిగిలినవారందరికీ నాటి స్వాతంత్ర్య పోరాట జ్ఞాపకాలే ఆస్తిగా నిలిచిపోయాయి.నాడు ప్రజల అభిమానం సంపాదించి, ప్రజల దృష్టిలో సర్దారులైన వారున్నారు. సర్దార్ వల్లభాయ్ పటేల్‌కి ముందు ప్రజలిచ్చిన ఆ గౌరవ బిరుదు లేకుండా మరోలా పిలవటం కుదరనంతగా అమరింది.

ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు ఇన్‌లాండ్ కవర్‌పై రాసి స్వాతి చిరునామాకు 14 జూలై 2018 తేదీలోగా పంపించండి. కరెక్టు సమాధానాలు రాసినవారిలో లాటరీ పద్ధతి ద్వారా ఒకరిని విజేతగా ఎంపిక చేసి ₹ 500/- నగదు బహుమతిని అందజేస్తాం.

అటువంటి బిరుదునే తెలుగులోనూ పొందిన వారున్నారు. ఆయనకున్న బిరుదు పేరుతో కలిసి పోయింది. ఆ బిరుదును కలిపి పిలిస్తే తప్పించి ఆయన పేరు పూర్తికానంతగా కలిసిపోయింది.

ఆ నేత మాట్లాడితే అధికారంలో వున్న వారు చెవులు రిక్కించి వినక తప్పేది కాదు. వారి సూచనలకు విలువనిచ్చేవారు. ఒక ప్రాంతానికే పరిమితం కారు ఆ నేతలు. 'తెలంగాణ నాది, రాయలసీమ నాది' అంటూ ఒక సినిమాలో తెలంగాణ కవి రాసినట్టు ఆ నాయకుడు ఎక్కడికి వెళ్ళినా ఆ యా వర్గాల వారు బ్రహ్మ రథం పట్టేవారు.

ఉత్తరాంధ్రలో బయలుదేరి అదిలాబాద్ వరకు ఎక్కడికి వెళ్ళినా ఆయనకు స్వాగతం లభించేది. సొంత ప్రాంతం దాటివచ్చి ఎన్నికల్లో పోటీచేయగలిగిన సాహసం ఆయనది.

స్కూలుస్థాయి వయసు దాటకముందే వివాహం. స్కూల్ ఫైనల్ పాసవటానికే నానా కష్టాలు. పైగా వారి వృత్తి కల్లుగీత. అది లాభసాటి వృత్తే అయినా మహాత్మాగాంధీజీ నిషేధం గురించి మాట్లాడిన అంశాలలో మద్యపానం ఒకటి.

మరి గాంధీజీ శిష్యుడిని అని చెప్పుకుంటూ, కల్లుముంతల ఇంటిలో తిరగలేడు కదా! తాను గాంధీజీ మార్గంలోకి వెళుతున్నాకాబట్టి తన ఇంటిలో కల్లు వాతావరణం వుండకూడదు అని ఆయన అనుకున్నాడు. అయితే ఆ కుటుంబ పెత్తనం తన చేతిలో లేదు. ఇంకా తండ్రిదే పెత్తనం.

అయినా ధైర్యంగా తండ్రికి చెప్పి,ఆ వృత్తిలో నుండి బయటకు తెచ్చాడు తన కుటుంబాన్ని. అన్నంపెట్టే వ్యవసాయం ఉత్తమం అన్నది ఆయన అభిప్రాయం. అందుకే ఆయన తన జీవితకాలంలో రైతాంగ అంశాలమీద దృష్టిపెట్టాడు.

గాంధీజీ ఆశయాలకు అనుగుణంగా దళితులకు దేవాలయ ప్రవేశం కల్పించి, పాఠశాలలు నిర్వహించాడు. శాసన ఉల్లంఘనోద్యమం, ఉప్పు సత్యాగ్రహం వంటి వాటిలో పాల్గొని జైలు శిక్షకు గురయ్యాడు. నేడు తరచుగా వినిపిస్తున్నది యాత్ర. పాద యాత్ర, బస్సు యాత్రలు వంటివి అనేకం వింటున్నాం.

ఇందులో కొత్తదనం ఏమీ లేదు. ఇప్పుడు జరుగుతున్నవి రాజకీయ యాత్రలు. కాని ఇటువంటి యాత్ర ఒకటి 80 సంవత్సరాలక్రితం ఇచ్చాపురం నుండి చెన్నపట్నంవరకు సాగింది ఆయన ఆధ్వర్యంలోనే. అప్పుడు అమలులో వున్న జమీందారీ విధానాన్ని రద్దుచేయాలని కోరుతూ రైతుల యాత్ర నిర్వహించి చివరికి నాటి మద్రాసు ప్రభుత్వంచేత రద్దు చేయించగలిగారు.

స్వాతంత్ర్య పోరాటం తర్వాత ఎంతో సౌమ్యుడిగా కనిపించిన నేత ఆయన. కాని ఆయన్ని బ్రిటీష్ ప్రభుత్వం ఆ రోజుల్లో అత్యంత ప్రమాదకర ఆంధ్రుడిగా ప్రకటించింది. ఆయన ఎక్కడ కనిపిస్తే అక్కడ కాల్చేయమన్న ఉత్తర్వులు ఇచ్చారు. 1940 సంవత్సరాల్లోనే ఆయన్ని పట్టిస్తే పదివేల బహుమతి ప్రకటించారు. దానినిబట్టి ఆయన పోరాటం ఏ స్థాయిలో చేసి వుంటాడో ఊహించవచ్చు.

స్వతంత్ర భారతదేశంలో కూడా ఆయన బాట పోరాటబాటే. మద్రాసు రాష్ట్ర శాసనసభకి ఎన్నికయ్యాడు. 1953లో ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన తర్వాత తొలి మంత్రివర్గంలో సభ్యుడు ఆయన.

ఇప్పుడు నవ్యాంధ్ర ఆంధ్రప్రదేశ్‌కి రాజధాని అమరావతి. కృష్ణానదీ తీరంలో, మిగిలిన జిల్లాలన్నింటికీ నడిబొడ్డుగా వుంది. అలా అందరికీ అందుబాటులో వుండే బెజవాడ ఆంధ్ర రాష్ట్ర రాజధాని కావాలన్నది ఆ నేత వాదన. కాని అది నెగ్గలేదు.

కర్నూలువైపు మొగ్గుచూపారు నాడు. తన వాదన వీగిపోయిన తర్వాత మంత్రిగా కొనసాగటం అనవసరం అని రాజీనామా చేసినా తిరిగి మరో ముఖ్యమంత్రి కింది కర్నూలు రాజధానిలోనే మంత్రిత్వం నిర్వహించాడు ఆయన. కాంగ్రెస్ పార్టీలో చేరినా ఆయనకు లభించిన గుర్తింపు అంతంతమాత్రమే. ఉత్తరాంధ్ర ప్రాంతాన్ని కాంగ్రెస్ వ్యతిరేక ప్రాంతంగా తయారుచేయటంలో ఆయన పాత్ర వుంది.

తన జీవితకాలంలో పలు పార్టీలు మారాడన్న ఆరోపణ ఎదుర్కొన్నాడు. విజయనగరం రాజా వారితో కలిసి సోషలిస్టు పార్టీ పెట్టాడు.తన రాజకీయ గురువుతో కలిసి స్వతంత్ర పార్టీలో చేరాడు. జనతా పార్టీ ఎమ్.ఎల్.ఎ. అయ్యాడు.

తెలుగుదేశం అభిమానిగా బహిరంగంగానే కనిపించేవాడు. చివరికి బహుజన పార్టీలో చేరి బయటకు వచ్చాడు. ఎన్ని పార్టీలు మారినా ప్రజల నాయకుడిగా ఆయన్ని గౌరవించారు.

'నిష్కళంక చరిత్ర', 'రైతు ఉద్యమ పోరాటం' అవి చివరిదాకా ఆయన నిలబెట్టుకున్నవి.దాదాపు చివరి రెండు దశాబ్దాలు పార్టీ రాజకీయాలకు అతీతంగా వున్నప్పటికీ అన్ని పార్టీలనుండీ గౌరవం పొందాడు. ఇంతకీ...

*1. ఆ ప్రజా నేత ఎవరు?*

*2. ఆయన రాజకీయ గురువు ఎవరు?*

29.6.2018 సంచికలో ప్రచురించబడిన 'నేనెవరో తెలుసా!' శీర్షిక సమాధానాలు :
1. ఉడిపి రామచంద్రరావు (యు.ఆర్.రావు), 2.అనంతపూర్.
విజేత : కె.అశోక్‌కుమార్, డోర్ నెం. 2-3-25, సానా స్ట్రీట్, డి.సి.సి.బి కాలనీ, శ్రీకాకుళం 532 001.

₹ 10,000
బహుమతి పొందిన కథ

# కుహూయోగం

పోల్కంపల్లి శాంతాదేవి

ఒక ప్రభాత సమయం. కన్నడ సామ్రాజ్యచక్రవర్తి శ్రీకృష్ణదేవరాయల ప్రధాన మంత్రివర్యులు రాయలతో ప్రేమగా 'అప్పాజీ'గా పిలువబడే తిమ్మరుసు... పూజ ముగించి పూజాగృహం నుండి బయటికి వచ్చాడు. వారి రాకకోసమే నిరీక్షిస్తున్న ఆస్థాన పండితులు లొల్ల లక్ష్మీధరబట్టు శ్రీ వంగర వరదరాజయ్యంగార్, గోవింద నారాయణాచార్యులూ లేచి నిలబడి నమస్కరించారు.

"కూర్చోండి! త్రిమూర్తులవలె ముగ్గురూ ఒక్కసారే వేంచేశారు. ఏదో విశేషమే ఉండి ఉంటుంది!" చిరునవ్వుతో అన్నాడు తిమ్మరుసు. "ఎలా చెప్పటమా" అన్నట్టు ఇబ్బందిగా ఒకరిముఖాలు ఒకరు చూచుకొన్నారు ముగ్గురూ.

తిమ్మరుసు ముఖంలో గాంభీర్యం చోటు చేసుకుంది. "దేనికి సందేహిస్తున్నారు? ఏదో చెప్పాలనే కదా వచ్చారు?" ఆస్థాన పురోహితుడూ, దైవజ్ఞుడూ అయిన లొల్ల లక్ష్మీధర బట్టు గొంతు సవరించుకుని మొదలుపెట్టాడు.

"ఆ విషయం చెప్పాలనే వచ్చాము మంత్రివర్యా! ఇది... మన ప్రియతముడైన చక్రవర్తి శ్రీ కృష్ణదేవరాయలకు సంబంధించిన విషయం! సంతోషకరమైనది. అయితేనేరుగావారికేవిన్నవించి బహుమతులు అందుకునేవాళ్ళం కాదు కాబట్టే ముందు మీకు చెప్పడం బాగుంటుందని మీ దగ్గరికి వచ్చాం!

రాయలవారి జాతకరీత్యా వచ్చే మాఘ కృష్ణ అమావాస్యరోజున వారికి కుహూయోగ గండముంది! అమావాస్య గడిచి పాడ్యమి ప్రారంభమయ్యే సంధి కాలంలో చంద్రకళలు కష్టమై విషఘడియతో కూడి ఉన్నప్పుడు... నాలుగు గ్రహాలు శని, సూర్యుడు, అంగారకుడు, రాహువు రాయల జన్మలగ్నం నుండి ద్వాదశస్థానమున ఒకే ఇంట చేరి, చంఢాలత్వం పొంది, అతి క్రూరమైన కుహూయోగంగా మారి... సంప్రాప్తమైనప్పుడు దేశానికి అధిపతి అయిన రాజు వెంటనే మృత్యువాత పడతాడు!"

"వారి జాతకరీత్యా లోగడ కూడా రెండు మూడు సార్లు కుహూ యోగం సంభవించింది కదా? మన ఆస్థాన గురువర్యులు శ్రీవ్యాస తీర్థులవారు వారి పేరున జపహోమాలు జరిపించి ఆ గండం నుండి తప్పించారు కదా? దీనికీ ఏదో పరిహారముండక పోదు!" తేలిగ్గా అన్నాడు తిమ్మరుసు.

"ఇది వరలో వచ్చినవి అంత బలమైనవి కాదు అమాత్యా! ఇప్పుడొస్తున్నది సంపూర్ణ కుహూయోగం! దీనినుండి తప్పించుకోవడం అసాధ్యం! దీనికి ఏ పరిహారమూ లేదు!" ముగ్గురిదీ ఒకే మాట!

చెబుతున్నది జ్యోతిశ్శాస్త్రంలో ఉద్దండులైనవారు! వారి మాట ఎప్పుడూ పొల్లుపోలేదు! తిమ్మరుసు ముఖం చింతాక్రాంతమైపోయింది! ఈ విపత్తు విషయం రాయల వరకూ పోకుండా తనొక్కడూ పరిష్కరించేది కాదు!

ఏకాంతమందిరాన రాయలతో సమావేశమై ఆస్థాన జ్యోతిష్యులు చెప్పిన విషయంచెప్పాడు తిమ్మరుసు. ఎప్పుడూ సంతోషంతో నిండి చిరునవ్వు లొలికే రాయలవారి ముఖం చిన్నబోయి మబ్బులు కమ్మిన చంద్రుడిలా వన్నె తరిగిపోయింది.

"అప్పాజీ! ఇప్పుడు కర్తవ్యమేమిటో చెప్పండి. రానున్న మృత్యుదేవతకు లొంగిపోవడం తప్ప మరో ఉపాయమేదీ కనిపించడం లేదు నాకు...!" దుఃఖ భారంతో అన్నారు రాయలవారు.

"జాతకరీత్యా వచ్చే ఏ ఆపదకైనా శాస్త్రంలో ఏదో ఒక పరిహారం చెప్పబడే ఉంటుంది, మహారాజా! ఉదయం నుండి నేనిదే ఆలోచిస్తున్నాను. వస్తున్న కుహూయోగం వల్ల దేశానికి రాజు అయినవారికి ప్రాణాపాయమని చెప్పారు.

మీరు సామ్రాట్టు కాక సామాన్య ప్రజలయితే ఈ కుహూయోగం మీకు మారకం కాకపోవచ్చుననిపిస్తుంది ప్రభూ! తాత్కాలికంగా సామ్రాజ్యాన్ని ఎవరికైనా దానమిచ్చి..."

"తాత్కాలికంగా అంటే ఆ గండం గడిచాకమళ్ళీ రాజ్యాన్ని తీసుకోవచ్చునని కదా? దానం ఇచ్చిన తరువాత మళ్ళీ తీసుకోవడం చక్రవర్తిగా నా హోదాకు తగిన విషయమా? ఐనా రాజ్యాన్ని పొందినవాడికి తిరిగి ఇచ్చేంత ఔదార్యం ఉంటుందా? తిరిగి ఇచ్చినా, ఇయ్యకపోయినా దానమిచ్చిన వస్తువును తిరిగి తీసుకోవడమంత చండాలత్వం మరొకటి ఉండదు!" గంభీరంగా అన్నారు రాయలు.

"వారికీ వీరికీ దానమిచ్చిన కదా మీరన్నట్టు జరిగేది? తమను తాము కాపాడుకోగల తపశ్శీలురూ, త్యాగధనులూ అయినవారికీ మనం రాజ్యం దానమివ్వాలి ప్రభూ!" "అలాంటివారు ఉన్నారా? మీదంతా భ్రమ, అప్పాజీ! ఒకసారి రాజ్యం చేతికి వచ్చాక..." "నాది భ్రమ కాదు, మహారాజా! అలాంటివారున్నారు! సామ్రాజ్య హితకాంక్షులూ, మహాతపస్సంపన్నులూ, పరమపూజ్యులూ అయిన మన ఆస్థాన గురువర్యులు శ్రీ వ్యాసరాజతీర్థులున్నారు! ఈ మహత్కార్యానికి సమర్థులు వారొక్కరే!"

"పాపం శమించుగాక!" చెవులు మూసుకొన్నారు రాయలవారు. "నా ప్రాణం నిలబెట్టుకోవడానికి పూజ్యగురుపాదులను విపత్తుకు గురిచేసి పాపం మూట గట్టుకోలేను"



"వ్యాసతీర్థులను మీరు తక్కువగా అంచనా వేసినట్టున్నారు ప్రభూ! వారు భగవదనుగ్రహం పొందిన మహాతపస్సంపన్నులు! అనునిత్యం వారిచేత పూజలందుకునే మూలగోపాలకృష్ణుని మూర్తి అయిదేళ్ళ బాలుడిగా మారి వారితో ఆడిపాడతాడట!

ప్రభూ! రేపుదయం మనం వారి విశ్వ పావనమఠానికి వెళ్ళి వారి దర్శనం చేసుకుందాం! భారమంతా వారిమీద వదిలిపెడదాము!"

మరునాడుదయం ఇరువురూ కలిసి విశ్వపావన మఠానికి బయల్దేరారు. రాయలు తిమ్మరుసు బలవంతంతో వచ్చాడేగాని, ఆయన మనసు మనసులో లేదు. ఏం ముఖం పెట్టుకొని నాప్రాణానికి మీ ప్రాణం అడ్డువేయమని అడగాలి?

వ్యాసరాయలవారు అప్పుడే దేవతార్చన ముగించి, ఏవో తాళపత్రాలను ముందు ఉంచుకొని పరిశీలిస్తున్నారు. శిష్యుడు పరుగునవచ్చి చక్రవర్తి, తిమ్మరుసుల ఆగమనం సంగతి చెప్పాడు. వారిని సాదరంగా లోపలికి ఆహ్వానించి ఉచితాసనంలో కూర్చోబెట్టి వారి రాకకు కారణం తెలుసుకొన్నారు వ్యాసతీర్థులు. "సామ్రాజ్యాన్ని,సామ్రాట్టునూ కాపాడుకునే మార్గం సెలవీయండి గురుదేవా!" అన్నాడు తిమ్మరుసు.

"ఈ నాలుగైదు రోజుల నుండి జ్యోతిషగ్రంథాలను వివరంగా చదివి రాయలవారిని కాపాడుకునే మార్గాన్ని అన్వేషిస్తూనే ఉన్నాము"

"భూత భవిష్యత్ వర్తమానకాలాలు తెలిసిన దైవాంశసంభూతులు! మీకు తెలియనిదేమున్నది గురుదేవా?" రాయలు కన్నీటిపర్యంతమై అన్నారు ఇది అప్పాజీకి వచ్చిన ఆలోచన మాత్రమే! నాకు మాత్రం సమ్మతం కాదు! మిమ్మల్ని ఆపదలో పడవేయటానికి మనస్కరించటం లేదు!"





## తెలుగు కోరిక

హిందీ హీరోయిన్ స్వరాభాస్కర్‌కు తెలుగు సినిమాలో నటించాలని మహా కోరికగా వుందట. అదీ ప్రభాస్‌తో నటించాలన్న కోరిక ప్రగాఢంగా వుందంటున్నది. "మా నాన్నగారు చిత్రవు ఉదయ్ భాస్కర్‌ఢిల్లీలో సెటిలయిన తెలుగువారే.

అంటే నేను తెలుగు సంత తికి చెందిన హిందీ అమ్మాయిని అన్నమాట. సో, నాకు భాషాపరమైన ఇబ్బందులు లేవు. 'వీరెది వెడ్డింగ్'లో నా నటన, ఓ సన్నివేశం గురించి కొన్ని విమర్శలు వచ్చాయి. అటువంటి విమర్శలను నేను అస్సలు పట్టించుకోను. అలా గనుక పట్టించుకుంటే ఆ ప్రభావం నటనపై పడుతుంది కదా" అంటున్నది స్వరా.

## కావాలని రాలేదు

ఆరేళ్ళ వయస్సునుంచీ డ్యాన్స్ ప్రాక్టీస్‌చేస్తున్న సిమ్రాన్‌చౌదరి షోబిజ్‌లోకి రావాలని తాను అస్సలు ప్లాన్ చేసుకోలేదని చెప్తోంది. "సినిమాల్లోకి రావాలన్న నిర్ణయం కావాలని తీసుకున్నది కాదు. నేను క్లాసికల్ డ్యాన్సర్‌ను. కూచిపూడి, భరతనాట్యంలలో శిక్షణ తీసుకున్నాను. కొన్ని యాడ్స్ చేశాను.

2017 మిస్ తెలంగాణా పోటీల్లో పాల్గొన్నాను. అలా నా షోబిజ్ మొదలైంది. హైదరాబాద్‌లో పుట్టి పెరిగాను.నా ఎక్స్‌ప్రెషన్లు సరిగ్గా రావడానికి భరతనాట్యం ఉపయోగపడింది. థియేటర్ కాని, వర్క్‌షాపులు కాని చెయ్యలేదు" అని చెప్పింది.



"మహామంత్రి తప్పుగా ఏం మాట్లాడలేదు! నేనైనా అతడైనా మీ క్షేమమే కదా కోరుకునేది? ఇప్పటికి నలభై ఎనిమిది సంవత్సరాలకు పూర్వమే సాళువ నరసింహభూపతి రాజ్యహితం కోసం మమ్మలను రాజగురువులుగా ఉండమని ప్రార్థించారు.

మా గురువుల ఆజ్ఞ, శ్రీహరి ప్రేరణ చేత వారి ఆహ్వానాన్ని మన్నించి ఈ కన్నడ సామ్రాజ్యాన్ని ధర్మ సామ్రాజ్యంగా తీర్చిదిద్దుటకు పూనుకున్నాము! ఆనాటి నుండి ఆ గద్దెనెక్కిన ప్రతి సామ్రాట్టుక్షేమాన్ని కోరుతూ, దేశాభ్యుదయమే లక్ష్యంగా మా తపస్సును ధారబోస్తున్నాము.

మేము సన్యాసులం! మాది అనేది మాకేమీ ఉండదు! అంతా ఆ సర్వేశ్వరునిదే! ఆయన సంకల్పానుసారం పోవడమే మా కర్తవ్యం! రాజ్యాన్ని ధర్మబద్ధంగా పాలిస్తూ గురుభక్తీ, దైవభక్తీ కలిగిన మీకు అభయమివ్వడమే మా కర్తవ్యం రాజన్!

దీనికోసమే ఈ తాళపత్రగ్రంథాలను పరిశీలిస్తున్నాను! ఈరోజు మాఘ శుద్ధ పాడ్యమి. ఈ రోజు నుండి పధ్నాలుగవరోజున కుహూయోగం సంప్రాప్తమవుతుంది మీ జాతకరీత్యా! నేను చెప్పే రెండు షరతులకు మీరు అంగీకరిస్తే నేను ఈ సామ్రాజ్య దానానికి అంగీకరిస్తాను"

తిమ్మరుసు ముఖంలో పట్టలేని సంభ్రమం! "మీ షరతులు చెప్పండి, గురుదేవా!"

"కుహూయోగానికి అయిదారు రోజులముందు నుండే మా పేరున, సామ్రాట్టు పేరున దేవాలయాల్లో విశేషపూజలూ, అభిషేకాలూ, అన్నదానం, వస్త్రదానం చేయాలి. శ్రోత్రియ బ్రాహ్మలకు, పండితులకు అగ్రహారాలు, భూములు, ధనకనక వస్తువాహనాలు విరివిగా మా చేత దానమిప్పించాలి!

ఇది చక్రవర్తి శ్రేయోభివృద్ధికి తప్పక చేయాల్సిన కార్యం! దాన వివరాల పట్టిక వ్రాసి ఇస్తాము. దాని ప్రకారం దానపత్రాలు సిద్ధం చేయవలసి ఉంటుంది! ఇదంతా మేం రాజ్యాన్ని దానం తీసుకుని సింహాసనాన్ని అధిరోహించడానికి ముందే జరగాలి! ఇది మా మొదటి షరతు..."

రాయలవారు హర్షపులకితులైపోయారు. కళ్ళలో కన్నీటిపొర కమ్ముకురాగా సాష్టాంగపడి లేచారు. "మా క్షేమంకోసం మీరు ఈ దాన కార్యక్రమం నిర్వహించడంమాకు ఆనందదాయకం, గురువర్యా!"

"మరి రెండవ షరతు..." తిమ్మరుసు సంకోచంతో ఆగాడు. "ఆ శ్రీహరిదయతో మేమూ,రాయలవారూ కుహూయోగంనుండి క్షేమంగా బయటపడినతర్వాత ఆ రెండవ షరతు వెల్లడిస్తాము" ఆ షరతు ఏమిటో తెలియకపోయినా సంతోషంగా తమ అంగీకారాన్ని తెలిపారు రాయలవారూ, తిమ్మరుసూ.

ఆ రోజు మాఘ కృష్ణ చతుర్దశి. పట్టాభిషేకానికి సమయం సమీపించింది. రాయల వారు సమీపించి సాదరంగా రాజగురువులకు రత్న సింహాసనం మీద కూర్చోబెట్టి, రాజపురోహితులు మంత్రపఠనం గావిస్తుండగా సామ్రాజ్యాన్ని దానమిచ్చారు. రాజోచితమైన దుస్తులు, కంఠహారాది సువర్ణాభరణాలు, పట్టాకత్తి బంగారుపళ్ళెరంలో ఉంచి ఇచ్చారు.వాటిని తాకిపక్కనున్న అచ్యుతరాయలకిచ్చారు గురుదేవులు. చివరి అంకంగా నవరత్న ఖచితమైన రాజముద్రికను గురువుల కుడిచేతి వేలికి తొడిగారు రాయలవారు.

వ్యాసరాజ తీర్థులు కన్నడసీమకు సామ్రాట్టుగా రాజదర్బారు ప్రారంభమయింది.

గురుదేవుల సూచనమేరకు శ్రీ కృష్ణదేవరాయలు, వారి పత్నులు,పుత్రుడు తిరుమలరాయుడు,తమ్ముడు అచ్యుతరాయలు రాజసింహాసనానికి వెనుకవైపున వారికోసం వేయబడిన ఆసనాలలో కూర్చున్నారు.

రాయల ముఖంలో ఉత్కంఠ... ఏం జరుగుతుందోనన్న ఆందోళన! వ్యాసతీర్థులు మంత్రోచ్చాటన సల్పుతూ రాయలవారి కుటుంబం చుట్టూ వృత్తమొకటి దిగ్బంధనం చేశారు.

"ఏం జరిగినా భయపడొద్దు! భగవంతుడిని స్మరిస్తూ ధైర్యచిత్తులై ఉండండి" అని చెప్పి సింహాసనం ముందుకు వచ్చి అక్కడ కూడా ఒక గీత గీసి ధీర గంభీరంగా సభనుద్దేశించి అన్నారు.

"ఏం జరిగినా భయపడొద్దు! ఉన్న చోటునుండి కదలొద్దు! భగవన్నామస్మరణ చేస్తూ ఉండండి!" అన్నారు. తమ కరుణాకటాక్ష వీక్షణాలు సభనంతటినీ బరుస్తూ అభయమిస్తున్నట్టుగా చెయ్యెత్తారు.

అందరూ శాంతచిత్తులై ఉండమని ఆదేశించి,



SMYFRIENDS.COM

ఎడమ చెయ్యి రాజకిరీటం, పట్టాకత్తి మీదుంచి, అర్ధ నిమీలిత నేత్రులై తులసిమాలను త్రిప్పుతూ జపం చేసుకోసాగారు వ్యాసతీర్థులవారు.

వారి ముఖ మండలం ఎంతో తేజోవంతంగా, ప్రశాంతసరోవరంలా ఉందప్పుడు. ఆ నీరవనిశ్శబ్దంలో క్షణాలు బరువుగా కదిలిపోతున్నాయి.

ఆ నిశ్శబ్దాన్ని కకావికలు చేస్తూ పెళపెళమంటూ పిడుగుపడ్డట్టుగా భయానక కఠోరశబ్దం! అందరూ భయవిహ్వలురైపోయారు. ఇంతకుముందున్న ధైర్యం చెప్పకుండా పారిపోగా వణికిపోసాగారు.

ఆ శబ్దం వెన్నంటి కళ్ళు మిరుమిట్లు గొల్పుతూ ఆకాశంలో మెరుపును బోలిన ఒక కాంతిరేఖ రాజు ద్వారం దగ్గర ప్రత్యక్షమై మూడు నాలుగు బారలు ఉన్న మహాకృష్ణసర్పంగా రూపుదాల్చింది.

కుహూయోగ విపత్తు సర్పాకృతి దాల్చినట్టుగా అర్థమైంది అందరికీ! ఆ మహాసర్పంచురుగ్గా రాజద్వారందాటి సరసరా రాజసింహాసనంవైపు సాగిపోయింది! "సర్పరాజా! ఆగక్కడే!" ఆజ్ఞగా అన్నారు వ్యాసరాయలవారు.

క్రోధంతో బుసలు కొడుతూ ముందుకురావాలని శతధా ప్రయత్నించిందా కృష్ణసర్పం.

కాని, గురుదేవులు గీచిన గీతను దాటలేక మంత్ర బద్ధమైనట్టుగా ఆగిపోయింది. ముందుకు రాలేని ఆ నిస్సహాయత రోషంగా మారిపోగా పూత్కారాలు చేస్తూ, క్రోధం పట్టలేక తన చాటంత పడగను నేలకు వేసి కొట్ట సాగింది. అందరూ ఊపిరి బిగబట్టుకుని భయ భ్రాంతులై చూస్తున్నారు.

వ్యాసులవారు మాత్రం ప్రశాంతంగా ఒక చిరు నవ్వు నవ్వి, తాము కప్పుకొన్న కాషాయ అంగవస్త్రం తీసి ఆ సర్పం ముందుకు విసిరారు "ఇక నీ కర్తవ్యం నిర్వహించు!" సర్రున నిలువెత్తున ఎత్తిన పడగను ఏమాత్రం తగ్గని క్రోధంతో మెరుపులా క్రిందికి దించి ఆకావి వస్త్రం మీద కాటువేసింది.

ఆ మరు క్షణమే అక్కడొక మహాద్భుతం జరిగింది. ఆ కావివస్త్రం అగ్నిజ్వాలతోధగధగమండి కాలి క్షణమాత్రంలో బూడిదకుప్పగా మిగిలింది!

వచ్చిన పని పూర్తి అయిట్టుగా వెనుదిరిగిన కృష్ణ సర్పం రాజద్వారందగ్గర కళ్ళుమిరుమిట్లుగొల్పుతూ ఒక వెలుగు దివ్వెగా మారి అదృశ్యమైంది.

"హమ్మయ్యా! వచ్చిన కుహూయోగ గండం గడిచిపోయింది!" అందరూ నిశ్చింతగా గుండెలమీద చేతి నుంచుకున్నారు.



అంబరాన్ని తాకుతున్నట్టుగా అందరిలో వెల్లువెత్తిన




ఆనందోత్సాహాలు "కన్నడరాజ్య సామ్రాట్టులకూ జై! వ్యాసరాయమునీంద్రులకూ జై!" వ్యాసమునీంద్రుల తపశ్శక్తిని వేనోళ్ళ కీర్తించారు.

గురుదేవులు మందస్మితవదనులై "మూలగోపాల కృష్ణుల దయావాత్సల్యాలు మనమీద ఉండగా మనకు ఏ విపత్తూ రాదన్న ధైర్యం నాకుంది!" అన్నారు.

రాయలవారి కళ్ళనుండి ఆనందబాష్పాలు జాలు వారుతున్నాయి "గురుదేవా! అపారమైన మీ తపశ్శక్తిని ధారబోసి మమ్ములనూ, ఈ కన్నడ రాజ్యలక్ష్మినీ కాపాడారు. ఏమిచ్చి మీరుణంతీర్చుకోగలం స్వామీ?" అంటూ సాష్టాంగపడ్డారు.

వారిని లేపి చెరో చేత దగ్గరికి తీసుకుని ప్రేమగా ఆలింగనం చేసుకున్నారు గురుదేవులు.

"ఇదంతా భగవదనుగ్రహం! మాదేమీ లేదు! వారి ప్రేరణ చేతనే ఇదంతా జరిగింది. వారి సంకల్పానుసారమే ఈ విజయం దక్కింది!"

మరునాడు కూడా శ్రీ వ్యాసతీర్థులు సింహాసనం మీద కూర్చొని రాజదర్బారు నిర్వహించిన పిదప రాయలవారిని చెంతకు పిలిచి చెప్పారు.

"మేము సామ్రాజ్యదానాన్ని స్వీకరించడానికి రెండు షరతులు చెప్పాము ఆనాడు. రాజ్యక్షేమం కోసం, మీ క్షేమంకోసం దేవాలయాలలో హోమాలు విశేషపూజలు అభిషేకాలు జరిపించమనిచెప్పాం. అర్హులైనవారికి మా చేత సువర్ణరత్నరాశులే కాకుండా భూములు, అగ్రహారాలు కూడా దాన మిప్పించే కార్యక్రమం ఏర్పాటుచేయమని చెప్పాము. ఆ పూజా కార్యక్రమాలు చాలా సంతృప్తిగా జరిపించారు. ఇక రెండవషరతు ఇప్పుడు పూర్తిచేయవలసి ఉంది!"

"ఆజ్ఞ ఇవ్వండి, గురుదేవా!" చేతులు జోడించి వినయపూర్వకంగా అన్నారు రాయలవారు.

"మహారాజా! ఈ కన్నడ రాజ్యలక్ష్మిని మా నుండి దానం తీసుకుని మీరే పరిపాలించాలి! ఇదే మా రెండవ షరతు"

రాయలవారి చెయ్యిపట్టుకుని మంత్రోదకదారా పురస్సరంగా రాజ్యదానమిచ్చి, రాయలవారి శిరస్సున రత్నకిరీటం పెట్టి, రాజముద్రికను వేలికి తొడిగి ఆదరంతో రాయలభుజాలమీద చేతులువేసి నడిపించి సింహాసనంమీద కూర్చోబెట్టారు వ్యాస తీర్థుల వారు. అందరూ జయజయ ధ్వానాలుచేశారు. గురుదేవులు రాయలవారిని సింహాసనంమీద కూర్చోబెట్టి బరువు దింపుకున్నారేమోగాని రాయలవారికి మాత్రం ఊరట లేకుండాపోయింది.

మహాతపస్సంపన్నులైన గురుదేవులు ఆశీనులైన సింహాసనంమీద తాను కూర్చోవడానికి మనస్కరించడంలేదు. రాయలను అపరాధభారం పీడింపసాగింది. తన మనోవేదనంతటినీ ఆత్మీయుడైన తిమ్మరుసుకు చెప్పుకున్నారు. తిమ్మరుసు ఎన్నోవిధాలుగా నచ్చచెప్పాలనిచూశారుగాని రాయలవారు వినలేదు. అందరినీ ఒప్పించి నాలుగేళ్ళవయసున్న తన కొడుకు తిరుమలరాయుడినిసింహాసనంమీదకూర్చోబెట్టి పట్టాభిషేకంచేసి, తాను రాజప్రతినిధిగా అనేకప్రజాయోపకార్యాలుచేసి చిరకీర్తి పొందారు!

రాహుల్‌గాంధీ కాంగ్రెస్‌పార్టీని నడుపుతున్నతీరు చూడండి. ప్రతి పక్షాలకు ఆయనకన్నా నాయకుడు ఎవరున్నారు. -షీలాదీక్షిత్, కాంగ్రెస్ నేత

జాతీయ పార్టీ, ప్రాంతీయపార్టీలతో జోడీకట్టకూడదు. కాశ్మీర్‌లో రెండు ప్రాంతీయపార్టీలు జోడీకట్టాలి. -గులామ్‌నబీ ఆజాద్, కాంగ్రెస్ ఎమ్.పి.



# ఏమిటీ తెలుపు



కారణం ఏదైనాకాని చర్మంపై ప్రభావాలు రకరకాలుగా వుంటుంటాయి. అది బాహ్యంగా కావచ్చు, అంతర్గతంగా అయినా కావచ్చు. ఒకసారి చర్మసంబంధిత సమస్యలు తలెత్తాయంటే అవి అంత త్వరితంగా తగ్గవు. నెమ్మదిగా, క్రమంగా చికిత్సలతో తగ్గుతుంటాయి.

అటువంటి చర్మసమస్యల్లో ముఖంపైన ఇతర శరీరభాగాల్లో తెల్లమచ్చలు రావడం ఒకటి. దీనినే 'విటిలిగో' అంటారు. సాధారణ శారీరక రంగు తగ్గి, చర్మంపై తెల్లని మచ్చలు ఏర్పడుతుంటాయి.

చర్మంలో పిగ్మెంట్ ఉత్పత్తికణాల (మెలనొసైట్స్) పనితీరు సరిగ్గా లేకపోవడంవల్ల ఈ సమస్య తలెత్తుతుంది. ఇందుకు కారణాలేంటి? ఎలా నివారించుకోవాలి? తదితరాల గురించి తెలుసుకుందాం

**లక్షణాలు :** విటిలిగో శరీరంలో ఏ భాగంపైనఅయినా రావచ్చు. అయితే, సాధారణంగా సూర్యకిరణాలు సోకే ముఖం, చేతులు, ముంజేతులు, కాళ్ళు, పెదవులపై వస్తుంటుంది. ఓరల్ క్యావిటీ, జననాంగాలు, రెక్టాల్ ప్రదేశాల వంటి మ్యూకస్ మెంబ్రాన్స్‌లను కూడా ప్రభావితం చెయ్యవచ్చు.

ఏ రంగు చర్మంగలవారికైనా రావచ్చు కాని, నలుపు రంగుగలవారికి మరింతగా కనపడుతుంది. విటిలిగోతోపాటు చర్మంలో, శిరోజాల్లో రంగు తగ్గిపోవడం జరుగుతుంది.చిన్నచిన్న ప్యాచెస్‌గా వుండవచ్చు లేదా శరీరంలో ఎక్కువభాగాన్నీ కప్పేయవచ్చు.

## కారణాలు

విటిలిగో రావడానికి అనేక కారణాలుంటాయి. వారసత్వ ప్రభావం కావచ్చు. లేదా ఆటో ఇమ్యూనిటీ కావచ్చు. అంటే శరీరంలోని స్వంత కణాలు మెలనొసైట్‌పై దాడిచేయడం అన్నమాట.

చేపలు తిన్నతర్వాత పాలు లేదా పాల పదార్థాలు తీసుకోవడంవల్ల తెల్లమచ్చలు వస్తాయన్న విషయంలో శాస్త్రీయబద్ధమైన ఆధారాలు ఏవీలేవు. చేపలు తాజాగా ఉన్నాయా? బాగా ఉండికించారా, పాలు, పాలపదార్థాలను ఎక్స్‌పైరీ తేదీకంటే ముందుగా తీసుకుంటున్నారా? లేదా? అన్న విషయాలను పరిశీలించుకుంటే చాలు.

ఆక్సిడేటివ్ స్ట్రెస్ కారణం కావచ్చు.సూర్యునిఅతి నీలలోహిత కిరణాల ఎక్స్‌పోజర్ వంటి వాతావరణ కారణాలు, మానసిక ఒత్తిడి విటిలిగోకు దారితీయవచ్చు.ఎవరి కారణాలు వారికి వుంటుంటాయి.

విటిలిగో వల్ల నాన్-మెలనొమ స్కిన్ క్యాన్సర్ రావచ్చుననే అపోహ చాలామందిలో వుంది. చర్మాన్ని పరిరక్షించడంలో ముఖ్యమైన పాత్ర పోషించే మెలనిన్ లోపంవల్ల క్యాన్సర్ ముప్పు వస్తుందన్న భావన వుంది. అయితే, విటిలిగోతో ఇబ్బందిపడేవారికి మెలనోమ, నాన్‌మెలనొమ స్కిన్ క్యాన్సర్‌వచ్చే అవకాశాలేవీ లేవని పరిశోధనల్లో గుర్తించారు. విటిలిగో సంబంధిత జీన్స్ స్కిన్ క్యాన్సర్లకు వ్యతిరేకంగా నిరోధక కార్యక్రమాలను మెరుగుపరుస్తాయి.

## అరికట్టేదెలా?

దీన్ని అసలంటూ రాకుండా అడ్డుకునే చర్యలు ఏవీ లేవుకానీ, పరిస్థితిని సమర్థవంతంగా ట్రీట్ చేయగల చర్యలు వున్నాయి.

- సూర్యకిరణాలు సోకే శరీరభాగాలన్నింటికీ బయటకు వెళ్ళడానికి ఇరవై నిమిషాలముందుగానే కనీసం ముప్పై లేదా అవసరాన్నిబట్టి అంతకంటే ఎక్కువ ఎస్‌పిఎఫ్ గల సన్‌స్క్రీన్ అప్లయ్ చేయాలి. చర్మంపై సూర్యుని కిరణాల హాని లేకుండా వుండేందుకు ప్రతి మూడుగంటలకు ఒకసారి సన్‌స్క్రీన్ రాస్తుండాలి.
- యాంటీ ఆక్సిడెంట్స్, విటమిన్లు, బి12, కాపర్, సెలీనియం వంటి ఖనిజాలు అధికంగా లభించే ఆహారపదార్థాలను తీసుకోవాలి.

ఆహారంలో పోషకాలు ఎక్కువగా ఉండే విధంగా తగిన జాగ్రత్తలు తీసుకోవాలి.

- జీవనశైలిలో మార్పులు చేసుకోవడం ద్వారా ఒత్తిడిని తగ్గించుకోవాలి.ఒత్తిడి విటిలిగోకు ప్రధాన కారణం కావచ్చు కూడా. చర్మాన్ని అన్ని హానికారకాల నుంచి రక్షించుకోవడం అవసరం.

## చికిత్స ఎలా చేస్తారు?

దీనికి విటిలిగో వచ్చిన ప్రదేశం, తీవ్రత, స్థాయిలను బట్టి అనేక చికిత్సా ప్రత్యామ్నాయాలుంటాయి. ఏ చికిత్స తీసుకున్నా, తెల్లని మచ్చలపై తిరిగి పిగ్మెంటేషన్ తెప్పించే దిశగానే సాగుతాయి.

చికిత్సలో సాధారణంగా పైపూత క్రీములను ఉపయోగిస్తారు. వచ్చిన ప్రదేశం, మచ్చల స్థాయిని అనుసరించి క్రీముల సిఫార్సు వుంటుంది.

లీజన్ల పురోగతి ఎక్కువగా వుంటే నోటిద్వారా మందులు ఇస్తారు. మచ్చలు విస్తరించకుండా నియం








త్రించడానికి ఇమ్యునోసప్రెసెంట్ల అవసరం వుంటుంది.

కొత్తగా మచ్చలు విస్తరించకుండా, ఉన్నవే స్థిరంగా కొనసాగుతుంటే 'లైట్ థెరపీ' లేదా 'లేజర్', 'యువిబి' లేదా 'పువా థెరపీ'లను 'రీ పిగ్మెంటేషన్' కోసం సిఫార్సు చేస్తారు.

ఒకవేళ స్థిరంగా కొనసాగుతున్న వ్యాధి వైద్య చికిత్సా ప్రత్యామ్నాయాలకు స్పందించకపోతే, పంచ్ గ్రాఫ్టింగ్, స్లిట్‌స్కిన్ గ్రాఫ్టింగ్, మెలనోసైట్‌ట్రాన్స్‌ఫర్ వంటి సర్జికల్ ప్రత్యామ్నాయాలు వుంటాయి.

వీటన్నింటికీ తోడుగా కొన్ని విటమిన్లు, ఖనిజాలు, ఎమినోయాసిడ్స్, ఎంజైమ్‌లను వాడడంవల్ల విటిలిగో గలవారి చర్మం రంగును పరిరక్షించుకోవచ్చు.

తెల్లమచ్చలు అంతగా కనపడకుండా జాగ్రత్తపడేందుకుగాను క్యామోఫ్లాగ్, మైక్రోపిగ్మెంటేషన్ వంటి క్రీముల్ని వాడే సౌందర్య పరిరక్షణా ప్రత్యామ్నాయాలు కూడా వుంటాయి.

## ఆహార పానీయాలు

విటిలిగో గలవారు ఆహారం విషయంలో కూడా ప్రత్యేకశ్రద్ధ వహించాలి. యాంటీ ఆక్సిడెంట్స్, విటమిన్ బి12, ఇ-ఫోలిక్ యాసిడ్, ఆల్ఫా లిపోయిక్ యాసిడ్, ఒమెగా 3 ఫ్యాటీ యాసిడ్స్ గల పదార్థాలు అధికంగా తింటుండాలి.

రాగిపాత్రలలోగల నీటిని తాగడంవల్ల విటిలిగో నివారణలో మెరుగుదల కన్పించిన దాఖలాలూ వున్నాయి. రాగిపాత్రల్లో నీటిని ఎనిమిది నుంచి పది గంటలు నిల్వవుంచి తాగడంవల్ల, శరీరానికి అవసరమైన మెలానిన్ ఉత్పత్తి ఉద్దీప్తం అయినట్లు గుర్తించారు. దీనివల్ల తెల్లమచ్చలు పెరగడం, ఇతర ప్రదేశాలలో వ్యాపించడం వంటివి తగ్గుతాయి.

అంతేకాకుండా చర్మం పై పొరలను తాజాగా వుంచేందుకు కావాల్సిన కొత్త కణాల ఉత్పత్తిలో సైతం కాపర్ సహకరిస్తుంది.

సిట్రస్ పదార్థాలను తగ్గించాలి. ఎస్కార్బిక్ యాసిడ్‌గల పదార్థాలు పిగ్మెంటేషన్ తగ్గించే అవకాశాలుంటాయి. మామిడి, ఎండు మిరపకాయలు, జీడిపప్పు, పిస్తా, చెర్రీ వంటివీ తగ్గించాలి. ఇవి శరీరంలో ఆక్సిడేటివ్ ఒత్తిడిని పెంచుతాయి.

ఎస్.సురేష్


సత్యమేవ జయతే

R&D

Approved IN-House R&D UNIT by Government of India, Ministry of Science & Technology, New Delhi

GMP CERTIFIED

First GMP Certified Ayurveda Company in AP & TS

ISO 9001 Certified Company

మధుమేహ నియంత్రణలో విశ్వసనీయమైనది

VK4 డయాకాన్®

VAN ESTD 1925

ESTD : 1925
VK4 DIACON
Patent No. 231146
CONTAINED PURE GOLD

ESTD: 1925

వేంకటేశ్వర ఆయుర్వేద నిలయం లి.,

చింతలూరు - 533232, తూర్పుగోదావరి జిల్లా, ఆంధ్రప్రదేశ్.

TEL: (08855) 278429, MKTG: 278060 E-mail: 1925@vanchintaluru.com

Web: www.vanchintaluru.com, Shoponline: AyurAarogyam.com

Approved IN-HOUSE R&D UNIT by Government of India, Ministry of Science & Technology, New Delhi.

Toll Free No.1800 - 425 1925

మీ దగ్గరలోని మా ఆయుర్వేద షాపులలో లభించును.

# వారి మద్దతు మాటల్లో చెప్పలేనిది



సినీకుటుంబంనుంచిసినిమాల్లోకి దూసుకువచ్చిన తార కల్యాణి ప్రియదర్శన్. స్టార్ కిడ్‌గా చిన్నప్పటి నుంచే సెట్స్‌లో గుర్తింపు పొందింది.

సినీసెట్స్‌లో పెరిగిన కల్యాణి అసంకల్పితంగానే చిత్రపరిశ్రమలోకి ప్రవేశించింది. తెలుగులో 'హలో'సినిమాతో పరిచయం అయినప్పటికీ ఆమె పరిధి విస్తృతమైనది. నాన్న దర్శకుడు ప్రియదర్శన్, అమ్మ లిసా నటి.

మలయాళ చిత్రపరిశ్రమలోప్రసిద్ధి గాంచిన వ్యక్తులు. కూతురికి బీజాలు మలయాళ చిత్రపరిశ్రమలో వేసుకున్నారు.ఆమెతో ఇంటర్వ్యూవిశేషాలు.

**చిన్నతనంనుంచీ సినిమాలు జీర్ణించుకుపోయాయేమో?**

(నవ్వేస్తూ) అవును. మా నాన్నగారి సెట్స్‌కు ఎప్పుడూ వెళ్తుండేదాన్ని.

కొన్నిసార్లు నా వెకేషన్లను సైతం సెట్స్‌లోనే గడిపేసేదాన్ని.

**అంటే చిన్నప్పుడే సినిమాల్లోకి రావాలని అనుకునేవారా?**

మొదట్లో నా ప్లాన్స్‌లో నటన లేదు. నేను చాలా సున్నిత మనస్కురాలిని. విమర్శల్ని బాగా వ్యక్తిగతంగా తీసుకునే తత్వం నాది. కాబట్టి నటిగా మనగలనేమో అనుకునేదాన్ని. అయితే సినిమాలో భాగం కావాలన్న కోరిక మాత్రం ఉండేది. దాంతో సెట్స్ వెనుక పనిచేయడాన్ని ముందుగా మొదలుపెట్టాను. యు.ఎస్‌లో డిజైనింగ్‌లో డిగ్రీ చేశా.2013లో 'క్రిష్ 3'కి అసిస్టెంట్ ప్రొడక్షన్ డిజైనర్‌గా పనిచేశాను. తర్వాత సాబు సైరిల్ సర్‌తో కలిసి 'ఇరుముగన్' సినిమాకు పనిచేశాను.

**స్టార్‌కిడ్‌గా సినిమాల్లోకి రావడం సులువు అయిందా?**

సినిమాల్లోకి ప్రవేశించకముందు సైతం నా తల్లిదండ్రులకు నాపట్ల నమ్మకం ఎక్కువగా వుండేది. వాళ్ళెప్పుడూ నేరుగా నాకు సలహాలు ఇవ్వలేదు.అయితే, వారినుంచి ఎమోషనల్ సపోర్ట్ బాగా లభించేది.

దాన్ని వివరించడం చాలా కష్టం. స్టార్‌కిడ్‌కు పరిశ్రమలో ఈజీ టికెట్ లభిస్తుందని చాలామంది భావిస్తుంటారు. కాని, ఇది కష్టం. ముఖ్యంగా మాపైన చాలా ఒత్తిడి వుంటుంది.

**మీ నాన్నగారి సినిమాలద్వారా ప్రవేశించాలని అనుకోలేదా?**

మా నాన్న ప్రాజెక్టుల్లో ప్రవేశించడం నాకు సాధ్యమే. కాని పరిశ్రమలో నా స్వంతమార్గం అవసరమని నాన్న చెప్పేవారు. నాన్న ఇచ్చిన సలహాలు నాకెంత గానో ఉపకరించాయి. నా తొలి సినిమాకు విక్రమ్‌కుమార్ దర్శకత్వంలో పనిచేయడం సంతోషంగా వుంది.

ఆయన గొప్ప నటుడన్న సంగతి చాలా మందికి తెలియదు. ఏదో ఒకరోజు నటిస్తారని ఎప్పుడూ అంటుండేదాన్ని. 'హలో'సినిమాలో నేనేం చేస్తున్నానన్న ఐడియా వాళ్ళిద్దరికీ లేదు.

టీజర్ చూశాకే వారికి తెలిసింది.

**సినిమా చూసినతర్వాత వాళ్ళెలా స్పందించారు?**

అమ్మచాలా ఎమోషనల్ వ్యక్తి.నాకు మంచి అభిమాని. నేనేం చేసినా ఇష్టపడుతుంది. సినిమా చూశాక నన్ను కౌగిలించుకుని, పదినిమిషాలపాటు ఏడవడం నాకు ఇప్పటికీ గుర్తుంది.

దర్శకుడిదగ్గర కూడా అలాగే చేసింది. అంటే నా పని తనకెంత నచ్చిందో అర్థంచేసుకోవచ్చు.

మా నాన్న దీనికి పూర్తిగా వ్యతిరేక దృక్పథం. ఆయన పెద్ద క్రిటిక్. నేనెప్పుడు చిన్నతప్పు చేసినా, గంటల తరబడి విశ్లేషిస్తారు. 'హలో' సినిమా చూసిన తర్వాత ఆయన ఒక్కమాట కూడా మాట్లాడలేదు. అదే ఆయన నుంచి నాకు లభించిన గొప్ప ప్రశంస.



**మొదటి సినిమాలో భాష మిమ్మల్ని ఇబ్బందిపెట్టిందా?**

'హలో'నాటికి నాకు ఒక్క తెలుగు పదంకూడా తెలియదు.నాన్నకువిక్రమ్ కుమార్‌పట్ల చాలా విశ్వాసం ఉంది. దర్శకుడు ఏం చెప్తే అది.

పూర్తి నమ్మకంతో చేయాల్సిందిగా నాకు సలహా ఇచ్చారు.

**సినిమాకు ప్రేరేపడానికి అమ్మా నాన్న సాయపడ్డారా?**

నేను అమ్మనుంచికంటేనాన్ననుంచి నటనలో ఎక్కువగా స్ఫూర్తి పొందాను.

**తెరవెనుక పనిచేసిన మీకు, తెరపై పని ఎలా ఉంది?**

షూటింగ్ మొదలైన తొలి రెండు రోజులు ఎక్కడచూసినా నేనే కనిపించా. ప్రొడక్షన్ డిజైన్ అసిస్టెంట్‌గా చేసిన అనుభవం ప్రతిదాన్నీ నియంత్రణలో ఉంచుకోగల తత్వాన్ని అలవరిచింది. ప్రతి విషయంలో చొరబడకూడదని సెట్స్‌లో అర్థంచేసుకున్నాను.

**ఏ భాషా చిత్రానికయినా అభ్యంతరం లేదా?**

లేదు. మలయాళం సినిమా ఇష్టం. ఇది నా మాతృభూమి.

స్క్రిప్టుల విషయంలో మాత్రం చాలా జాగ్రత్తగా వుంటాను.

తమిళంతో మంచి కనెక్షన్ వుంది. నేను చెన్నైలో చదువుకున్నాను.

ఇక, తెలుగు సంగతి చెప్పనే అక్కర్లేదు అంటూ ముగించింది కల్యాణి ప్రియదర్శన్.

**అయినపూరి సుజాత**



25 జరిగిన కథ

భైరవుడు సముద్రగుప్తుడిని ఆవహిస్తాడు. దాంతో తన చేతిలోని గండ్రగొడ్డలితో శత్రు సైనికుల్ని ఊచకోత కోయడం మొదలుపెడతాడు.

నాగాయకుడిని సజీవంగా బందీని చేస్తాడు సముద్రగుప్తుడు. గజదొంగ రక్తబాహుడితో కచుడు చేతులు కలిపాడని తెలిసి గాంధార దేశాన్ని ముట్టడిస్తాడు. కచగుప్తుడు, రక్తబాహుడు ఇద్దరూ కలసి కిదారుడిపై దండెత్తి కిదారుడ్ని చంపేస్తారు.

కిదారుడి కుమార్తె హేమమాల పారిపోయివచ్చి సముద్రగుప్తుని శరణు కోరుతుంది.

నిద్రపోతున్న కచుడ్ని హత్యచేస్తాడు రక్తబాహుడు. దాంతో ఆగ్రహించిన సముద్రగుప్తుడు రక్తబాహుడిని ఇతర దారిదోపిడీ దొంగలను హతమారుస్తాడు. హేమమాల తనని వివాహం చేసుకొమ్మని సముద్రగుప్తుడ్ని కోరితే అతను తిరస్కరిస్తాడు. ఇక జరగబోయేది చదవండి.

“హేమమాలా! నేను నిస్సహాయుడను”

హేమమాల ఆ తర్వాత శిరోముండనం (గుండు) చేయించుకుని, కాషాయాలు ధరించి బౌద్ధసన్యాసినియై సింహళానికి వెళ్ళిపోయింది. వెళుతూ తన సమస్త రాజ్యాన్నీ సముద్రుడికి ధారపోసింది. ఇంత జరిగినా సముద్రుడు తన పట్టును సడలించలేకపోయాడు.

కారణం అతని హృదయాన్ని ఇపుడు లావినియా శాసిస్తోంది. ఆమె సౌందర్యం, సౌజన్యం ముందు వీరందరూ సూర్యుడిముందు దివిటీలే. ఈ విధంగా హేమమాల కథ కూడా ముగింపు అయింది.

స్త్రీ గురించి విఫలమైన వ్యక్తి ఈ ప్రపంచంలో అక్కడక్కడా సన్యాస దీక్షను స్వీకరించడం ఒక పరిపాటి. కానీ పురుషుడి గురించి ఒక స్త్రీ, అందునా మహా సౌందర్యవతి, అఖండ సామ్రాజ్యానికి వారసురాలు అయిన, ఆ స్త్రీ సన్యసించటం చరిత్రలో అపురూపమైన విషయం.

ఆ సముద్రుడి వీరశౌర్య ప్రతాపాలకు, అతడి సౌందర్యానికి ఇంతకు మించి నీరాజనాలు ఏంకావాలి?

సముద్రగుప్తుడు కుషాన్ల రాజవంశీయులలో ఒక అర్హుడయిన రాజ బంధువును ఎన్నిక చేసి గుప్తుల సామ్రాజ్య సామంతాధీశుడిగా పట్టాభిషిక్తుడ్ని చేసి పాటలీపుత్ర నగరానికి తిరుగు ప్రయాణం కట్టాడు.

ఇక సముద్రగుప్తుడ్ని ఎదిరించగల్గిన వారెవ్వరూ లేకపోయారు. 'సముద్రగుప్త పరాక్రమాంక' బిరుదాంకితుడై నలుదిశలా జైత్రయాత్రను చేసుకుంటూ భూమి దద్దరిల్లేట్టుగా తన అపార సేనావాహిని ద్విగణం బహుళం చేసుకుంటూ పాటలీపుత్రానికి చేరుకుంటున్నాడు.

మార్గంమధ్యలో పాటలీపుత్రం నుంచి ప్రత్యేక వార్తా వాహకులు వచ్చారు. సముద్రుడికి లావినియా పంపిన కానుకను అందజేశారు. అవి జాక్ డాస్ పక్షులు. సముద్రగుప్తుడికి ఆ పక్షులను చూడగానే మొహంలో ఆనందం వెల్లివిరిసిపోయింది.

“లావణ్య తమ రేపటి అపురూపమైన దాంపత్యానికి ప్రతీకగా పంపిన అద్భుత కానుక”

జాక్ డాస్ సముద్రుడ్ని కూడా తమ యజమానురాలులాగానే ప్రేమించసాగాయ్! అతడి రెండు భుజాలపైనే ఆ రెండూ సంసారం సాగిస్తున్నట్టుగా ఉంది చూపరులకు.

పాటలీపుత్ర నగరం సమీపిస్తున్న తరుణంలో సముద్రుడికి ప్రతీహారి వర్తమానం తెచ్చాడు.

“మహాప్రభూ...! మీ దర్శనార్థం కొందరు బాహ్మణులు వచ్చారు”

“ప్రవేశపెట్టు” సముద్రగుప్తుడు ఆజ్ఞ ఇచ్చాడు.

పదిమంది బ్రాహ్మణులు లోపలకు వచ్చారు.ముందు వారిని గుర్తుపట్టలేకపోయాడు. వారు పరిచయం చేసుకున్నారు. “మహాప్రభూ! కొన్ని సంవత్సరాలక్రితం మీ తండ్రిచేత కొరడాదెబ్బలు తిన్న జ్యోతిష్కులం”

అపుడు సముద్రుడికి గుర్తుకు వచ్చింది. తన తండ్రి చంద్రగుప్తుడు ఒకప్పుడు వీరందర్నీ కూడా దండించి ఉన్నాడు, తను మహాచక్రవర్తి అవుతాడని జోస్యం చెప్పినందుకు.

అందులో నుండి ఒక యువకుడు వచ్చి “నేను చంద్రగుప్త ప్రభువులచేత దండింపబడకుండా వదలబడిన ఆ వృద్ధ బ్రాహ్మణుడి కొడుకును. నా తండ్రి ఇటీవలే గతించాడు... మా కుటుంబం ఇప్పటికీ దారిద్ర్యంతో కృంగిపోతోంది” అన్నాడు.

సముద్రగుప్తుడు వారందరికీ ఇతోధికమైన కానుకలు ఇచ్చి అగ్రహారాలు దానంచేసి సత్కరించాడు.

సముద్రగుప్తుడు “ఇంతకీ జోస్యం దేనికి... జరగవలసినదేదో జరిగే తీరుతుంది కదా!” అడిగాడు.

అందుకా జ్యోతిష్యులు “అవును యువరాజా! జరగవలసినదేమిటో జరిగిపోతుందని తాను కేవలం సాక్షీభూతుడై దేనియందు నిరాసక్తుడుగా జీవించటం





## నెక్ట్స్ ఏంటి?

కారణం ఏదైనా కాని 'పద్మావత్' తర్వాత దీపికా పడుకొనె మరో సినిమా మొదలు పెట్టలేదు. విశాల్ భరద్వాజ్‌తో ఒక సినిమా అంగీకరించింది కాని, అది ఆగిపోయింది.

మరో సూపర్ హీరోయిన్ చిత్రంలో నటిస్తున్నట్లు టాక్ వచ్చినా అదీ ఇంకా ఆలోచన దశలోనే వుంది. శ్రీదేవి నలభై ఏళ్ళనాడు నటించిన సూపర్ హిట్ సినిమా రీమేక్‌లో దీపిక నటిస్తుందన్న తాజా కబురు షికారు చేస్తుందేతప్ప ఇంకా రీమేక్ హక్కుల దగ్గరే ప్రక్రియ వుంది. అదంతా అయ్యాక కాని, అధికారికంగా ప్రకటించరు. మరి అప్పటి దాకా దీపికమ్మ ఏం చేస్తుందట! ఏమో?!

## కన్నడంలోనూ...

మలయాళంనుంచి తెలుగుకు, తర్వాత తమిళానికి పరిచయం అయిన అనుపమా పరమేశ్వరన్ ఇప్పుడు కన్నడంలోనూ కాలు పెట్టి, దక్షిణాదిని మొత్తం కవర్ చేశానని ఆనందపడుతున్నది.

"పునీత్ రాజ్‌కుమార్‌వంటి స్టార్‌తో కలిసి కన్నడంతో ప్రవేశించడం భలే థ్రిల్లింగ్‌గా వుంది. బాగా ఎగ్జయిట్ అవుతున్నాను. తెలుగు, తమిళంతో పాటు ఇప్పుడు కన్నడంకూడా నేర్చుకుంటాను. నాది జూనియర్ లాయర్ పాత్ర" అంటూ గలగలా గళం విప్పింది అనుపమా పరమేశ్వరన్.



ఒక్క మహాత్ములకే సాధ్యం. అది పండిపోయిన కర్మయోగులకే చెల్లుతుంది"

"అయితే..."

"అయితే సామాన్యులకు భవిష్యత్ మీద ఆశ, ఒక ప్రేరణ. 'రేపు' అనేదే శూన్యంగా మిగిలితే ఎవరైనా సమస్త కర్తవ్యాల్నీ త్యజిస్తాడు. ఈ రేపు అనేది ఒక ఆశ. ఈ ఆశ జీవితాన్ని నడిపిస్తుంది. ఈ ఆశే మనిషి క్రిందపడి కూలిపోయినా మళ్ళీ జీవితాన్ని చిగురింపజేస్తుంది. ఈ 'రేపు' కొందరి మనుషులకు ఊపిరిపోస్తుంది.

అనేక మహత్తర కార్యాలకు ప్రేరణ అవుతుంది. కార్యశూరతకు, అకుంఠిత పట్టుదలను, దీక్షను ప్రసాదిస్తుంది. ఈ ప్రపంచంలో ప్రతిఒక్కరికీ 'రేపు' అనేది ఒక తీయని స్వప్నం.

"మరి దురదృష్టవంతులకో..."

"లేదు యువరాజా! ఈ విశ్వంలో ఏ ఒక్కరూ దురదృష్టవంతుడనే వాడు లేడు. దురదృష్ట జీవితం కేవలం ఒక దశమాత్రమే, అంతేకానీ అదే అంతం కాదు. అలాకాక ఏ మనిషికయినా దురదృష్టమే శాశ్వతమయిననాడు భగవంతుడు ఈ సృష్టిలో ఆ కొందరికి అన్యాయం చేసినవాడవుతాడు"

"... ... ..."

"అందుకనే అందరికీ అవకాశాలు ఇవ్వటానికి, పోగొట్టుకున్నవి తిరిగి పొందడానికి తన సమస్త సృష్టిలోని జీవులకు ఆ ఈశ్వరుడు 'రేపు'ను సృష్టించి ఇచ్చాడు. ఈ 'రేపు'ను నిర్వచించి వ్యాఖ్యానించేదే జ్యోతిష్యశాస్త్రం"

"కానీ... మీ జోస్యాలు అపుడపుడూ ఫలించవుకదా!"

"మేము కేవలం మానవమాత్రులం. ఈ విశ్వంలో నిజమైన పరిపూర్ణ జ్యోతిష్కుడు - ఆ త్రినేత్రుడొక్కడే... ఇక మేమందరమూ మా పొట్టకూటికోసం ఈ శాస్త్రాన్ని అభ్యసిస్తున్నాం"

సముద్రగుప్తుడు వారి నిజాయితీకి అభినందించకుండా ఉండలేకపోయాడు. "కొందరికి జీవితమంతా అదృష్టమయంగా, మరికొందరికి అదే జీవితం దురదృష్టమయంగా ఉంటుంది. జీవితం ప్రారబ్ధానుసారం నడుస్తుంది యువరాజా! ఐనా వీటన్నిటికీ మించి మరొక మహత్తర సత్యముంది"

"ఏమిటది?"

అందరిలో ఆ వృద్ధ జ్యోతిష్యుడు చెప్పాడు- "యువరాజులే స్వయంగా వేద వేదాంగ పారంగతులు. అనేక శాస్త్రాలు చదివినవారు. మీకు తెలియని కొత్త విషయాలు మా దగ్గర లేవు"

"అయినా చెప్పండి ఆచార్యా..!" సముద్రుడు కోరాడు.

"ఈ ఆత్మ అనంత నామాలలో, అనంత రూపాలలో నిర్విరామంగా ప్రయాణం చేస్తుందిట. జీవితంలో మరణం కూడా ఒక రూపాంతర దశే కాని, అంతం కాదు.

చినిగిపోయిన వస్త్రాలను వదిలి కొత్త వస్త్రాలు ధరించినట్టుగా ఈ ఆత్మ ఒక రూపంనుండి మరొక రూపానికి ప్రయాణం చేస్తుంటుంది. యువరాజులు పూర్వజన్మలో చేసుకున్న విశేష సత్కర్మ ఫలితమే ఇపుడు నడుస్తున్న అద్వితీయ ప్రాభవ వైభవాలకు కారణమని మా అభిప్రాయం"

సముద్రుడు తల ఊపాడు. 'తన అంతరంగంలోని విశ్వాసాలనే ఏకరువు పెట్టారు వీరందరూ' ఆ తర్వాత వారందరూ సెలవు పుచ్చుకొని వెళ్ళిపోయారు. సముద్రుడికి హఠాత్తుగా తాళపత్రాలు గుర్తుకొచ్చాయ్!

"ఏమైనాయ్... ఆ తాళపత్రాలు... తన భవిష్యత్‌వాణిని నిక్షిప్తం చేసిన ఆ తాళపత్రాలు ఏమయ్యాయి! ఎవరి చేతిలోకి చేరాయ్!"

'మళ్ళీ తనపై హత్యాయత్నాన్ని చేసింది ఎవరు? లావినియాకు ఈ విషయం తెలుసట... చెప్పబోతున్న చివరి తరుణంలో అవాంతరమొచ్చి ఆ ఉదంతాన్ని వినలేకపోయాడు'

సముద్రుడి మనసులో వేగిరపాటు. వెళ్ళి ఎపుడెపుడు లావినియా ఒళ్ళో వాలిపోతానా అని అతడి మనసు ఉవ్విళ్ళూరుతోంది. మరికొన్ని రోజులకు సముద్రగుప్తుడు తన అఖండ జైత్రయాత్రలను ముగించుకొని పాటలీపుత్ర నగరానికి చేరాడు.

SMYFRIENDS.COM

మగధ సామ్రాజ్యమంతా వేడుకలు, వినోదాలతో మునిగిపోయింది. సముద్రుడి రాకతో నగరమంతా అలంకరించబడింది. ఇపుడు సముద్రగుప్తుడు అద్వితీయ మహావీరుడు. భారతావని సామ్రాట్. అతడిపుడు భూమ్మీద నడుస్తోన్న ఒక ఇంద్రుడు!

మూడు శ్వేతాశ్వాలను పూనిన రథంలో నగరానికొచ్చాడు. సముద్రుడ్ని చూడటానికి, అతడికి స్వాగతం పలకటానికి దేశదేశాలనుండి సముద్రంలాగా ప్రజలు చేరుకున్నారు.

సముద్రుడు సాక్షాత్ ఆ పరశురామ అవతారమేనని ప్రజలలో ప్రబలిన విశ్వాసం. పరశువుతో అతడు చేసిన జైత్రయాత్ర కథలు కథలుగా కీర్తించారు, కావ్యాలుగా గానంచేస్తున్నారు.

జీవితం నిజంగా ఎంత ధన్యం! తామెంతటి అదృష్టాన్ని చేసుకున్నారు'

సముద్రగుప్తుడు దేశదేశాల నుంచి తెచ్చిన కానుకలను, బహుమతులను, అమూల్యమైన వస్తుసంపదను, అశేష దాసదాసీజనాలకు సమర్పించాడు.

సముద్రగుప్తుడే ఒక నడిచివస్తున్న అద్వితీయ మహా ప్రాభవ వైభవంలా కన్పడ్డాడు, తన తల్లిదండ్రులకే గాక అక్కడున్న ఆ యావన్మందికీ.

ఇంతలో అక్కడకొచ్చిన జాక్ డాస్ పక్షులు సముద్రుడిచుట్టూ గిరికీలు కొట్టి అంతఃపురంవైపు వెళ్ళిపోయాయి. సముగ్రుప్తుడు జాక్-డాస్‌లు వెళ్ళిన ఆవైపు నిర్నిమేషంగా చూస్తున్నాడు.

అక్కడ వున్న ఆంతరంగికులకు సముద్రగుప్తుడి మనోభావం అర్థమైంది. మహారాణి కుమారదేవి పక్కన ఉన్న

యువరాజా...! కానీ నేటినుంచి ఆ కర్తవ్యం యువరాణులే స్వీకరిస్తారేమో అని భయం" అన్నది.

"అయితే..."

"నేను అందుకు ఒప్పుకోను యువరాజా! సామ్రాట్ సముద్రగుప్తుల్ని అనునిత్యమూ అలంకరణ చేసే అపూర్వ అవకాశం నాకే లభించాలి. ఇది నా జీవితాంతమూ కొనసాగాలి. ఈ ఇంద్రుడిని స్వయంగా నా చేతుల్తో కొలుచుకునే ఈ అపూర్వ వరాన్ని నాకు ప్రసాదించాలి" అని అడిగింది.

సముద్రగుప్తుడు సుకన్యవైపు ఆప్యాయంగా చూశాడు- "అలాగే సుకన్యా! నీవు అడిగింది ఇవ్వబడింది"

సుకన్య కళ్ళలో ఆరాధన. ఆతర్వాత ఆ కళ్ళలో ప్రేమాన్విత జల్లు. వెనువెంటనే లావినియాను తోడ్కొని రావటానికి లోపలకు వెళ్ళిపోయింది.

లావినియా సముద్రుడి ఒళ్ళో చేరింది. ఆ గాఢ పరిష్వంగన, ఆ ప్రియ పరిష్వంగనకు లావినియాలో ఆపాదమస్తకం సుమధుర సంగీతం.

సముద్రుడిలో ఏమైందో ఏమిటో కాని ఆ రాజసమూ, ఆ దర్పం అన్నీ ఆ క్షణంలో కరిగిపోయి ఆమె ఒడిలోకి జారిపోయి ఓడిపోయాడా ధరణీమండలాధీశుడు.

"లావణ్యా!" రెండు చేతులతో ఆమె మోహాన్ని తీసుకొని ఆమె అధరంపై చుంబించాడు. లేత తమలపాకుల వంటి ఆమె సున్నిత అధరాలపై సముద్రుడి చుంబనమేరకు రక్తం పొంగి పొర్లిపోయింది.

లావినియాలో మైమరపు!

అలా ఎంతోసేపు ఆ గాఢపరిష్వంగ



**నాకు, ముఖ్యమంత్రి కుమారస్వామికి చుక్కెదురు. అయినా కాంగ్రెస్ పార్టీకోసం నా అహం చంపుకుని అతని మంత్రివర్గంలో చేరాను.**

*-డి.కె.శివకుమార్, కాంగ్రెస్ నేత*

**అర్ధనగ్న అమ్మాయిలు గెంతటం అనేది క్రికెట్ స్టేడియంలో చూడటం ఏమీ బాగాలేదు. ఐ.పి.ఎల్. నుండి ఆ విన్యాసాలు ఆపేయాలి.**

*-గౌతమ్ గంభీర్, క్రికెటర్*



జ్యేష్ఠ కుమారుడు కచగుప్తుడి మరణం కొన్ని రోజులు సామ్రాట్‌చంద్రగుప్త దంపతులను కలచివేసింది. కాని కచుడి మరణం ఈ దేశ సౌభాగ్యానికి, బహుజన శ్రేయస్సుకు దారి తీసింది. ధర్మసంస్థాపనకు, ధర్మపరిరక్షణకు కొత్త ఊపిరి పోసినట్టయింది.

అశేషప్రజానీకం, అఖండసామ్రాజ్య పరిరక్షణకు బాధ్యత వహించవలసిన సామ్రాట్ చంద్రగుప్తుడికి, మహారాణికి ఈ భావనలే చివరకు ఊరటను కల్గించాయ్! మమకారపాశాన్ని, రక్తసంబంధాన్ని వెనక్కి నెట్టి ఆలోచింపచేయగలిగాయ్! సమస్త రాజపరివారం, అంతఃపుర దాసదాసీజనం, సమస్త ప్రజానీకం, సామ్రాట్ దంపతులు, కశ్యపబ్రహ్మ సముద్రగుప్తుడికి ఎదురుగా వెళ్ళారు సముద్రుడికి స్వాగతం ఇస్తూ -

సముద్రుడు భద్రగజంనుంచి దిగి తల్లిదండ్రులకు సాష్టాంగ ప్రణామం చేశాడు. చంద్రగుప్త, కుమారదేవీలలో పొర్లిపొర్లి పొంగుతున్న ఆనందం.

'ఇలాంటి తనయుడ్ని కన్న తమ

సుకన్య సముద్రగుప్తుడిని చిలిపిగా చూస్తోంది. సుకన్య "యువరాజా...! యువరాణులవారు చిక్కిశల్యమయిపోయారు" అంది అలవోకగా.

సముద్రుడిలో ఆరాటం...

"యువరాణి లావినియాను మీ ముందు ఉంచాలంటే నాకు తగిన బహుమతి ఇవ్వాలి యువరాజా!"

సముద్రుడు తన మెడలోని నవరత్నఖచిత హారాన్ని సుకన్యకు అందజేశాడు.

"ఇంతేనా!" అని సుకన్య అదోలా చూసింది.

"... ... ..."

"యువరాజా...! అమూల్యానికి మూల్యాన్ని చెల్లిస్తున్నారు. ఇదేనా మా యువరాణిని మీకు అప్పగించేందుకు మీరు కట్టే విలువ.

"మరేం కావాలి సుకన్యా!"

"వరాన్ని ప్రసాదించాలి"

"అడుగు సుకన్యా!"

"ఇంత కాలమూ మీకు నేను అలంకరణలు చేసే ప్రత్యేక పరిచారికను

సముద్రగుప్తుడిని సమస్త రాజపరివారం, రాజబంధువులు అంతా, స్నేహితులు... పురప్రముఖులు చుట్టుముట్టారు. వేదఘోషల మధ్య, మంగళవాయిద్యాలు మోగుతుండగా సముద్రగుప్తుడు తన రాజప్రాసాదానికి చేరుకున్నాడు.

మహారాణి కుమారదేవి సముద్రుడికి విశ్రాంతి మిషపెట్టి ఏకాంతాన్ని సృష్టించింది. సముద్రుడు అంతఃపురం చేరి అక్కడ ఉన్న గవాక్షంనుండి వినీలాకాశంలోకి చూస్తున్నాడు.

వెనుక కాలి అందెల సవ్వడి.

ఒక్క ఉదుటున వెనుతిరిగాడు సముద్రుడు.

లావినియా నుంచుని ఉన్నది. ఇద్దరి నయనాలు కలుసుకున్నాయ్!

మౌనంగా చూపులతో ఒకరినొకరు స్పృశించుకున్నారు! ఆ ఇద్దరి హృదయాలలో కోటిరాగాల ఆలాపన మొదలయింది. "లావణ్యా!" అని చేతులు చాచాడు సముద్రుడు.

"సామ్రాట్!" అని ఒక్క ఉదుటున

నలో ఉన్నారో వారికే తెలియదు.

ఇద్దరిలో మమేకమయి కాలం ఆగిపోయిన అనిర్వచనీయ ఆనందం.

సముద్రుడు "నీవు కోరిన కానుకను, నీవు కోరినవిధంగానే తీసుకు వచ్చాను లావణ్యా!"

"నాగాయకుడిని!" లావినియాలో ప్రతీకారజ్వాల ఆరిపోయింది.

మరోసారి లావినియా సముద్రుడ్ని గాఢంగా హత్తుకొంది.

"యువరాజులకు ఇంత వరకూ శృంగరాజని మాత్రమే బిరుదు ఉండేది ఇపుడు"

"... ... ..."

"పరాక్రమాంక' బిరుదాంకితులు అయ్యారు. జీవితాన్ని సాధించారు, శాసించారు, గెల్చుకున్నారు"

"అవును లావణ్యా...! అన్నిటికీ మించి ఈ అద్వితీయ సౌందర్యరాశిని గెల్చుకున్నాను"

మరోసారి ఆ ఇరువురూ హత్తుకొని పోయారు.

"మన ఇద్దరం ఇంతసేపు ఏకాంతంలో ఉంటే... ఆ బయట" లావినియాలో సిగ్గు. బయట అశేష ప్రజానీకం, పరివారం సముద్రుడి సమాగమంకోసం అతడితో సంభాషించటంకోసం అర్రులు చాస్తున్నారు.

సముద్రుడు ఈ లోకంలో పడ్డాడు. "అవును లావణ్యా! కాపాలికుడు ఏమయ్యాడు"

లావినియా కళ్ళలో కన్నీటిపొర.

"ఏమయింది లావణ్యా!"

"కాపాలికుడు నన్ను పుత్రీ అని ఎంతో ప్రేమతో సంబోధించేవాడు యువరాజా!" అని చెప్పింది.

సముద్రుడు ఆశ్చర్యంగా చూశాడు.



డెబ్బైల వయసు దాటినతర్వాత ఇక మిగిలిన సమయం తక్కువ. ఆ సమయంలో ఆనందంగా అనుభవించు అని అనుకోవటం సహజం.

-ఆంథోనీ హాప్కిన్స్, హాలీవుడ్ నటుడు



కవి, తత్వవేత్త అయిన అటల్ బిహారీ వాజ్‌పేయివంటి వ్యక్తి పాకిస్తాన్‌కి ప్రధానిగా దొరికితే ఎంతో బాగుండేది.

-మహమ్మద్ అసాద్ దుర్రాని
ఐ.ఎస్.ఐ. మాజీ చీఫ్

"అదేమిటి కాపాలికుడు నీకు తెల్సా!" అనడిగాడు సముద్రుడు.

"తెలుసు ప్రభూ...! కాపాలికుడే నన్ను ఇంద్రప్రస్థం నుండి పాటలీపుత్రానికి చేర్చాడు. అతడి సాయమే లేకపోతే నేనింతదూరం ప్రయాణించగల్గేదాన్ని కాదు. అంతేకాదు నాగాయకుడి చెరకు బలి అయ్యేదాన్ని"

"మరి కాపాలికుడేమయ్యాడు?"

"వెళ్ళిపోయాడు యువరాజా...! అందరివద్ద సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు. తన పాత్ర అయిపోయిందని భద్రకాళీ చెప్పిందట. నిష్క్రమించాడు" అని చెప్పింది.

"... ... ..."

"అంతేకాదు ప్రభూ! కాపాలికుడు భైరవుడ్ని మీమీదకు ఆవాహన చేశాడు. మీ విజయాగ్నికి ఆజ్యం పోశాడు"

సముద్రుడికి ఎడతెగని ఆశ్చర్య సంభ్రమాలు. 'తనలోని వీరావేశం, ఒక్కసారిగా కట్టలు తెంచుకున్న శౌర్యానికి తనే ఇంతవరకూ అచ్చెరువొందుతున్నాడు. తనను ఏదో ఆవహించిందని ఆ యుద్ధభూమిలో అనుకునేవాడు. దానికి కారణం ఇదా!'

"గుప్తవంశీయులు అందరూ కాళీ భక్తులట. పూర్వజన్మలో కాపాలికులట. ఆ తల్లి అనుగ్రహము మీ అందరియందూ తరతరాలుగా అవిచ్ఛిన్నంగా కొనసాగుతోందిట. భైరవుడు మీకు దాసుడట ప్రభూ!

వీరభైరవుడు యుద్ధభూమిలో మిమ్మల్ని ఆవహించి శత్రువులపై తన రక్తదాహాన్ని తీర్చుకుంటాడని కాపాలికుడు చెప్పాడు"

సముద్రుడు ఆ జగన్మాతకు వినమ్రంగా మనసులో అంజలి ఘటించాడు. లావినియా చేయి జాచింది. ఆమె చేతిలో ఒక బంగారునాణెం.

సముద్రుడు ఆ నాణాన్ని తీసుకొని అటూ ఇటూ చూశాడు.

ఒకవైపు గుప్తుల రాజచిహ్నం... మరోకవైపు గొడ్డలిని ధరించిన తన బొమ్మ ముద్రితమై ఉన్నాయ్ ఆ నాణెం ఇరువైపులా.

"మీ విజయవార్తలను విని సామ్రాట్ ఈ నాణాలను ముద్రించారు యువరాజా!" అని చెప్పింది.

సముద్రగుప్తుడిలో ఆనందం తెరలు తెరలుగా పొంగింది. ఉన్నట్టుండి సముద్రుడికి గుర్తుకువచ్చింది. "ఆ రోజు నాపై హత్యాయత్నం జరిగింది. ఆ వ్యక్తి ఎవరో నీకు తెలుసన్నావ్!"

"అవును... కాపాలికుడు"

"కాపాలికుడా! మన శ్రేయోభిలాషి కాపాలికుడా!"

"అవును.. కాపాలికుడే రహస్య మార్గాలలో రాజప్రాసాదంలో తిరిగి ఎవ్వరికీ తెలియకుండా మాయమవుతుండేవాడు. ఆ రోజు రాత్రి కాపాలికుడు నా మందిరంలోకి ప్రవేశించి ఆ రహస్యమార్గాల గురించి బోధిస్తూ మీ మందిరానికి తీసుకువచ్చాడు.

అపుడే నా కాలిపాదాల గుర్తులు పడ్డాయ్! కాపాలికుడే ఆ కత్తి విసిరింది. ఆ వెనువెంటనే మాయమయ్యాం ఇరువురం ఆ మార్గాలనుండి.

భావిభారత గుప్తసామ్రాజ్య పట్టమహిషిగా ఆ రహస్యమార్గాలను నాకు కరతలామలకం చేశాడు.

ఈ మార్గంనుండే పారిపోయి కచుడినుంచి తప్పించుకోగలిగాను"

"కానీ కాపాలికుడు కత్తి ఎందుకు విసిరాడు" అనడిగాడు.

"మిమ్మల్ని చంపటానికి కాదు, యువరాజా! ఆ కత్తిని కావాలనే మీ ఆసనానికి గురిచూసి విసిరాడు"

"ఎందుకు?"

"మీలో మృత్యుభయం కలిగించేందుకు. మీలో జాగ్రత్తను పెంచి ఏమరుపాటు కాకుండా చేసేందుకు. ప్రాసాదంలో ప్రచ్ఛన్నంగా అనేక శత్రువులను పెట్టుకుని నిశ్చింతగా నిదురపోయే మిమ్మల్ని జాగరూకుడ్నై, శత్రువుల గురించి ఆలోచించమని బోధించేందుకు" అని చెప్పింది.

సముద్రుడిలో ఉప్పెనలుగా ఆశ్చర్యము. "మరి తాళపత్రాలు దొంగిలించిందెవరు?" అడిగాడు.

"ఎవ్వరకూ తెలియదు. ఆఖరకు కాపాలికుడికి కూడా తెలియదు. ఎంత ప్రార్థించినా భద్రకాళి కూడా ఈ విషయంలో తన గుప్పెటను విప్పలేదని చెప్పాడు కాపాలికుడు. ఇది ఎవ్వరికీ తెలియని రహస్యం. ఇంకా ఈ రహస్యం ఛేదించబడాల్సివుంది"

ఆ తర్వాత ఎంత ప్రయత్నించినా, ఎంత శోధించినా తాళపత్రాల ఆచూకీ మాత్రం దొరకలేదు సముద్రగుప్తుడికి. తాళపత్రాలు గుర్తుకువచ్చినప్పుడల్లా సముద్రుడు ఏదో తెలియని ఉద్వేగానికి గురి అయ్యేవాడు.

సముద్రగుప్తుడు లావినియాను వివాహం చేసుకున్నాడు. ఆ తర్వాత మళ్ళీ దండయాత్రలను మొదలు పెట్టాడు. ఉత్తర భారతావనిలోనుంచి మొదలయిన అతడి జైత్రయాత్ర దక్షిణాపథంవరకు విస్తరించింది.

చంద్రగుప్తుడు సముద్రుడ్ని పట్టాభిషిక్తుడ్ని చేశాడు. ఇపుడు యువరాజు సముద్రగుప్తుడు సామ్రాట్ సముద్రగుప్తుడు అయ్యాడు.

సముద్రగుప్తుడి కాలంలో అశేష సంపదలు, భోగభాగ్యాల్ని అనుభవించారు ప్రజలు. అతడి రాజ్యంలో రత్నాలు రాసులురాసులుగా గుట్టలు గుట్టలుగా పోసి అమ్మేవారు.

ఎక్కడ చూసినా శాంతి సంతృప్తి ఆనందాలు! ఏ చక్రవర్తికయినా ఇంత కంటే ఏం కావాలి?

లావినియాకు సంతానం కలగలేదు. రాజపురోహితుడు పట్టమహిషి లావినియాకు సలహా ఇచ్చాడు, కుమారస్వామిని ప్రార్థించమని.

లావినియా దీక్ష వహించి కుమారస్వామిని ఆరాధించింది. చివరకు ఆమె కడుపు పండి గర్భవతి అయింది.

ఆ ఆనందపు వార్తకు రాజ్యమంతా వేడుకలు వైభవాలు.

సామ్రాట్ సముద్రగుప్తుడు పట్టమహిషిని చేరాడు, ఆ రోజున. లావినియా సిగ్గులమొగ్గ అయింది.

"మనకు కొడుకు పుట్టబోతున్నాడు లావణ్యా! అతడికి చంద్రగుప్త విక్రమాదిత్యుడని పేరు ఏనాడో నిర్ధారించుకున్నాను" అన్నాడు సముద్రుడు.

లావినియా మనసులో వెలితి... "తనకు పుట్టబోయే కుమారుడికి కుమారస్వామి పేరున కుమారగుప్తుడని పేరు పెట్టాలనుకుంటున్నానని తను ప్రార్థన చేసింది" లావినియా తన మనసులోని అసంతృప్తిని వెలిబుచ్చలేదు. "అలాగే ప్రభూ...! సామ్రాట్ సంకల్పం అందరికీ శిరోధార్యం"

వారిద్దరి మధ్య నిత్యమూ పూర్ణచంద్రోదయాలు. అనుక్షణం ఆనందం. జీవితమంతా ఒక మధురస్వప్నంగా,



## ప్చ్! సోదరి పాత్ర

'నేనింతే' చిత్రంలో నటించిన అదితీ శీయ గుర్తుందా? అసలు పేరు శియా గౌతమ్‌ను అదితీ శీయగా మార్చుకున్నది.

'సంజు' బయోపిక్‌లో ఈ అమ్మాయి సంజయ్ దత్ సోదరి ప్రియాదత్ పాత్ర పోషించింది. ఇటువంటి చిత్రంలో నటించడం బోల్డెంత ఆనందాన్ని కలిగించినా, లవర్ బాయ్ రణబీర్‌కపూర్ సిస్టర్‌గా నటించడంమాత్రం అసంతృప్తిని మిగిల్చింది.

రణబీర్ సోదరిగా నటించాలన్న విషయాన్ని అతికష్టంమీద జీర్ణించుకుని, మరీ చేసినట్లుంది. "సంజయ్‌దత్‌గారి సోదరిని నేను ఎప్పుడూ కలవలేదు. ఆవిడ ఇంటర్వ్యూలు చూసి మేనరిజమ్స్ నేర్చుకున్నాను. రణబీర్‌కపూర్ గొప్ప నటుడు. అతన్ని సోదరుడిగా మాత్రం ఊహించుకోలేకపోయాను" అంటూ ఫ్రాంక్‌గా చెప్పింది.

## అన్నీ సూపర్!

'సాహో'లో తనది యాక్షన్ ఓరియంటెడ్ రోల్ అంటూ చెప్పుకుని ఆనందపడుతున్నది ఎవెలిన్ శర్మ. "నేనెప్పుడూ చేయాలని కోరుకునేరకం పాత్ర. ఇంతకుముందు నాలో చూడని మరో కోణాన్ని ప్రేక్షకులకు చూపించడానికి ఎగ్జైట్ అవుతున్నాను. ఈ పాత్రకోసం నేనెంతో కసరత్తులు చేశాను.

యాక్షన్ సీక్వెన్సుల షూటింగ్ చాలా ఛాలెంజింగ్‌గా వుంది. నాకు కొన్ని గన్‌షాట్ సన్నివేశాలు కూడా వున్నాయి. 'సాహో' పూర్తిస్థాయి యాక్షన్ సినిమా. ప్రభాస్ జెంటిల్‌మెన్. సూపర్‌స్టార్. అతను వుంటే చుట్టుపక్కలంతా సూపర్ ఫన్" అంటూ సకల సంగతులూ ఏకరువుపెట్టింది.



తీయని అనుభూతులతో అష్టైశ్వర్యాల మధ్య, అఖండ ప్రాభవవైభవాలతో సామ్రాట్,సామ్రాజ్ఞి తమచుట్టూ ఒక ఇంద్రలోకాన్ని సృష్టించుకున్నారు.

లావినియాలో తీయని తలపులు- తనకు పుట్టబోయే కొడుకుగురించి.

సముద్రగుప్తుడిలో మధురస్వప్నాలు తన వంశ ప్రాభవ వైభవాలకు ప్రతీకగా అవతరించబోయే సుపుత్రుడి కోసం... నవమాసాలు నిండాయ్ లావినియాకు!

సూర్యుడు మకర సంక్రమణం చేస్తోన్న పవిత్ర ఘడియల్లో లావినియా ప్రసవించింది.

సుకన్య పరుగు పరుగున వచ్చి సామ్రాట్‌ను చేరింది.

అదే సమయంలో సామ్రాట్ చివరి ఘడియలకు చేరుకున్న తన మాతామహి మహాదేవి సన్నిధిలో కూర్చున్నాడు సముద్రగుప్తుడు... మహాదేవి మరికొద్ది క్షణాల్లో మరణించవచ్చుని రాజవైద్యుడి ధృవీకరణ.

"సామ్రాట్! శుభవార్త... మహారాణి లావినియా ప్రసవించారు..." అని సుకన్య చెప్పింది.

మహాదేవి సుకన్యను వారించింది. "ఆ వార్త నేను చెబుతాను అంది"

"సముద్రా! లావినియాకు కవల పిల్లలు జన్మించినారు... ఒక శిశువు ఆ వృద్ధుడు... రెండవ శిశువు ఆ కపోతం... ఔనా"

సామ్రాట్ ఆశ్చర్యంతో స్థాణువైపోయాడు. సుకన్య ఇక్కడ ఉత్సాహంతో చెప్పుకుపోతోంది.

"అవును ప్రభూ కవలలు జన్మించారు. ఒక శిశువుకు ఎదలో అర్ధచంద్రాకార పుట్టుమచ్చ ఉన్నది"

అలనాటి ఆ వృద్ధుడు గుర్తుకు వచ్చాడు సముద్రుడికి... మహాదేవి "ఒకరు కుమారగుప్తుడు. రెండవవాడు చంద్రగుప్త విక్రమాదిత్యుడు"

సముద్రగుప్తుడు ఆశ్చర్యం నుంచి తేరుకోవడానికి చాలాసేపు పట్టింది.

"ఎలా తెలుసు మాతామహీ!"

"ఆ తాళపత్రాలలో చదివాను"

"ఏమిటీ ఆ తాళపత్రాలు నీ దగ్గరకు చేరాయా?" అనడిగాడు.

"అవును... ఆ రోజున మీ ఇరువురి సంభాషణను రహస్యంగా నేను విన్నాను. ఆ తాళపత్రాలను నేనే దొంగిలించాను" అని చెప్పింది.

"ఎందుకు?"

'రే'పు అనేది తెలిస్తే జీవితం చదివిన పుస్తకంలా నిస్సారమయిపోతుంది. నీ జీవితంలో జరుగుతున్న విజయాలకు, నీలో ఎటువంటి ఉత్సుకతా స్పందనా ఉండదు"

"... ... ..."

"కారణం... అన్నీ ముందుగానే నీ గురించి 'నీ 'రేపు' గురించి తెలిసిన విషయాలే' నీ జీవితంలో జరుగుతున్న ఏ విజయానికయినా నాలో ఎటువంటి స్పందనా ఉండేదికాదు"

"నీ భవిష్యత్ జ్ఞానం నాకే అలా అనిపిస్తే నీకు మరెలాగ ఉంటుంది. అందుకనే నిర్ణయించాను"

"ఏమని....?"

"ఆ తాళపత్రాలు నేనే దగ్ధంచేశాను. అగ్నికి ఆహుతి చేశాను"

సంభ్రమాశ్చర్యములతో మునిగిపోయిన సముద్రగుప్తుడు! సముద్రుడు మాతామహిలను ప్రేమగా తన ఒళ్ళోకి తీసుకున్నాడు.

'మాతామహీ! ఆ తాళపత్రాలలో ఇంకేమని రాసి ఉంది"

మాతామహి మహాదేవి తలడ్డంగా తాటించి, సముద్రుడి చేతులను ఆప్యాయంగా లాక్కొని తన పెదవులను మూసివేసింది, 'చెప్పనన్నట్టుగా'

ఆ తర్వాత సముద్రగుప్తుడి కళ్ళలోకి కొన్ని క్షణాలు ప్రేమగా చూస్తూ సంతృప్తిగా చివరి శ్వాసను ఒడిలో విడిచింది మాతామహి మహాదేవి.

నివ్వెరబోయిన సముద్రుడు! సామ్రాట్ సముద్రగుప్తుడు!!

-: అయిపోయింది :-

## ఎలా ఆడుతున్నాయి?

- 'సమ్మోహనం' సినిమాకు టాక్ వచ్చిన మేరకు కలెక్షన్లు లేవు. తెలుగు రాష్ట్రాల్లో ఐదుకోట్ల రూపాయలమేరకు, ఓవర్ సీస్‌లో హాఫ్ మిలియన్ డాలర్లు దాటి వసూళ్ళు చేయగలిగింది.
- ఆ మాటకు వస్తే ఏ సినిమాకు కూడా బలమైన వసూళ్ళు లేవు. జూన్ నెల టాలీవుడ్‌కు పెద్దగా కలిసివచ్చే నెల కాదు. స్కూళ్ళు, కాలేజీల వ్యవహారాలే కానీ సినిమాలవైపు చూసే టైమ్ కాదు. దానికితోడు విడుదలవుతున్న సినిమాలు అంతంతమాత్రమే వుంటున్నాయి.
- అయితే సినిమాల సంఖ్యమాత్రం ఇబ్బడి ముబ్బడిగా విడుదలవుతూనే వున్నాయి. వారానికి మూడు నుంచి పది సినిమాల వరకు విడుదలవుతూనేవున్నాయి. ◆




# కదిలే బొమ్మల కబుర్లు

Review

## తాగుబోతు కుర్రాళ్ళ బయోపిక్

మన సినిమా జనాల దృష్టిలో యూత్ అంటే బూతే.ఆవారా బాపతే. బుద్ధిమంతులైన కుర్రాళ్ళు వీళ్ళ కళ్ళకు ఆనరు. ఎందుకంటే వాళ్ళ కథలు తీస్తే ఎవరుచూస్తారు. యథేచ్ఛగా బూతులు మాట్లాడుతూ అమ్మాయిలు, అబ్బాయిలు మందు కొడుతూ, గాలిపటం అంత ఎత్తుకు ఎదగాలనే ఆశలు, కానీ గాలికి తిరిగే వ్యవహారాలు, అదే మన కుర్ర డైరెక్టర్ల దృష్టిలో యూత్ సినిమాలు.

టాలీవుడ్‌లోకి వస్తున్న కొత్త తరంవల్ల ఒక ఉపయోగం ఉంది. సినిమాల్లో రానురాను డ్రామా పర్సంటేజ్ తగ్గిపోతోంది. అదే కొత్తతరంవల్ల ఒక నష్టం. యూత్ సినిమాల పేరిట, పనికిరాని, పనికిమాలిన, గాలికి తిరిగే ఆవారా బాపతు కుర్రాళ్ళ కథలు తెరకెక్కించి, అదే హీరోయిజం అనుకోమనటం. ఈ బాపతు సినిమానే ఈ వారం విడుదలైన 'ఈ నగరానికి ఏమైంది?'

ఇంతకీ ఈ సినిమా కథేంటంటే, డైరెక్టర్ అవుదాం అనుకున్న కుర్రాడు ఓ అమ్మాయితో బ్రేకప్. అప్పటినుంచి పగలు, రాత్రి నల్లకళ్ళజోడు పెట్టుకుని, మందుకొడుతూ, ఉద్యోగం లేకుండానే ఉన్నట్లు నటించడం.తన బైక్‌కు ఆ అమ్మాయి కారు నెంబర్ ప్లేట్ వాడి, ఫైన్ల బిల్లు ఆ అమ్మాయికి వెళ్ళేలా చేయడం. ఇతగాడికి ఓ ముగ్గురు స్నేహితులు.

పెళ్ళిని సైతం బతుకుకు ప్రమోషన్‌గా చూసేవాడు ఒకడు.వాళ్ళకి తందానతాన అనేవాళ్ళుమరో ఇద్దరు. వీళ్ళ కథకు ఓ లైనూ లెంగ్తూ ఉండదు. పోనీ జీవితాలు కూడా ఇలాగే లైనూ లెంగ్తూలేకుండా వెళ్తుంటాయి. వీళ్ళందరూ కలిసి అనుకోకుండా గోవా వెళ్తారు. అక్కడ ఓ షార్ట్ ఫిలిమ్ చేయాల్సిన అవసరం వస్తుంది. ఇలాంటి నేపథ్యంలో చివరకు ఏం జరిగింది అన్నది మిగిలిన సినిమా.

'ఈ నగరానికి ఏమయింది?' సినిమాను రెండు కోణాల్లో చూడాలి. ఒకటి ఇప్పుడిప్పుడే ఛందో బందో బస్తులు అన్నీతెంచుకుని కొత్తదారిలోకి అడుగుపెడుతున్న తెలుగుసినిమా అనే కోణంలో.

'పెళ్ళిచూపులు', 'అర్జున్‌రెడ్డి' ఇలాంటి సినిమాల బాటలో అన్నమాట.సినిమాలో మెలోడ్రామాను తగ్గించడం, డ్రామాను పూర్తిగా తుడిచిపెట్టడం, సహజమైన లైటింగ్‌లో చిత్రీకరణ, సున్నితమైన సంగీతం, అంతకన్నా సహజంగా వుండే నటన ఇవన్నీ 'ఈ నగరానికి ఏమైంది' సినిమాలోనూ చోటుచేసుకున్నాయి. అందువల్ల ఆ విధంగా ఈ సినిమాను మెచ్చుకోవాలి. ఈ విషయంలో నూటికి ఎనభై మార్కులు వస్తాయి.



కానీ, అదేసమయంలో ఇలాంటి గుడ్ క్వాలిటీలు అన్నీ ఓ మంచి కథకు జోడైతే అన్నదే అసలు సమస్య. జీవితం ఓ క్రమపద్ధతిలో వెళ్ళదు కదా?

సినిమా కథమాత్రం అలాగే వుండాలనే వితండవాదన సరికాదు. మన జీవితం ఎంత ఆర్గనైజ్డ్‌గా లేకున్నా, మనకి అన్నీ ఆర్గనైజ్డ్‌గా వుంటేనే చూడ్డానికి బాగుంటుందని అనుకుంటాం.

కానీ ఈ విషయంలో 'ఈ నగరానికి ఏమైంది' సినిమాకు గట్టిగా పది మార్కులు కూడా పడవు.

ఎందుకంటే అసలు ఈ సినిమాలో కథే లేదు. సినిమా అలా గాలివాటానా కొట్టుకుంటూ వెళ్తుందంతే. సినిమా ముగింపు కూడా అంతే. పద్ధతిగా వుండాలనుకున్న కుర్రాళ్ళు, గాలివాటానికే వెళ్ళిపోవాలని డిసైడ్ కావడంతో సినిమా ముగుస్తుంది.

సినిమా ప్రారంభమైంది లగాయతు, ముగిసే

## అన్నింటికీ సిద్ధం

పొడుగు కాళ్ళ సుందరి కృతీసనన్‌కు తెలుగులో పెద్దగా కలిసి రాలేదు కాని, బాలీవుడ్‌లో బాగానే వుంది. కమర్షియల్ తారగా ఉత్తరాదివారి గుర్తింపు పొందింది. ప్రస్తుతం హిందీలో చారిత్రక నేపథ్యం గల ఓ చిత్రంలో, మరో కమర్షియల్ సినిమాలో నటిస్తోంది. అంటే రెండు రకాల ప్రేక్షకులనూ అలరించబోతోందన్నమాట.

ఈ విషయాన్ని కదిలిస్తే, మన ప్రేక్షకులు కొన్ని తరహా సినిమాలకు అలవాటుపడిపోయారు.

వాళ్ళకు నచ్చేవి అందిస్తేనే సంతృప్తి చెందుతారు. ఇంకొందరు కొత్తదనం కోరుకునేవాళ్ళుంటారు. వారికి ప్రయోగాత్మక సినిమాలు కావాలి.

కాబట్టి మేము అన్ని తరహా పాత్రలకూ సిద్ధంగా వుండాలి" అంటూ సమాధానం ఇచ్చింది. ◆

వరకు ఒకటే వ్యవహారం. తాగుడు... తాగుడు... వాగుడు... వాగుడు...ఎంతకు దిగిపోయారు అంటే, పట్టుమని పన్నెండేళ్ళు లేని కుర్రాడిని తమ గదిలో వుంచుకునేందుకు అమ్మాయిల్ని తీసుకెళ్తుంటే వీళ్ళు, ఆడు అదృష్టవంతుడురా.... అని అనుకోవడం.

లక్షల ఖరీదైన ఉంగరాన్ని కూడా తాగుడు మైకంలో కాపాడుకోలేనివాడు లక్షలు వచ్చిపడితే మాత్రం ఏం జాగ్రత్తచేసుకోగలడు? ఇలా కథా పరంగా, స్క్రిప్టుపరంగా అంతా దిగజారుడే.

వాస్తవానికి పాత థ్రెడ్ అయినా కథ అనేది అంతర్లీనంగా వుంది. నలుగురు కుర్రాళ్ళు తమకు కావాల్సింది అందక, అక్కర్లేనిది చేతి లోకి వచ్చి, దాంతో రాజీపడలేక, అలా అని తెగించలేక, అయోమయస్థితిలో బతికేస్తూ, చివ రకు తెగించి, తమదైన దార్లోకి అడుగుపెట్టడం అన్నది పాయింట్. ఇది కొత్తది కాదు.

కానీ ఈ పాత పాయింట్‌ను, కొత్తగా, ఓ న్యూ జోనర్‌ను తెలుగు ప్రేక్షకులకు అందించాలనే ఐడి యాతో తయారుచేశాడు దర్శకుడు తరుణ్‌భాస్కర్. 'పెళ్ళిచూపులు' సినిమాలో పద్ధతిగా సినిమాను చెక్కిన దర్శకుడు ఈ సినిమాలో పూర్తిగా హాలీవుడ్, బాలీవుడ్ బాటలో నడవాలని, మళ్ళీ మరోసారి తెలుగు సినిమాకు కొత్త జోనర్‌ను పరిచయం చేయా లని అనుకున్నాడు.

జోనర్‌ను పరిచయంచేయడంవరకు ఓకే కానీ, దానికి పద్ధతి అయిన, ఒద్దిక అయిన స్క్రిప్ట్‌ను సమ కూర్చుకోలేకపోవడం సమస్యగా మారింది.

సినిమాకు ఒకటే రిలీఫ్. కొత్తనటుల్లో, ఒకడైన అభినవ్ గౌతమ్ తన కామెడీ డైలాగ్ టైమింగ్‌తో ఆకట్టుకున్నాడు.అతగాడి కామెడీనే సినిమాకు రిలీఫ్. నటీనటులు అందరూ కొత్తవాళ్ళే.

అమీషా అంబ్రోస్ సినహా. అందరూ వారి వారి పాత్రలలో బాగానే సెట్ అయిపోయారు. సహజంగా బాగానే చేశారు.

వివేక్ సాగర్ మంచి నేపథ్య సంగీతం, ఓ మంచి ట్యూన్ వున్న పాట అందించాడు. నికేత్ బొమ్మిరెడ్డి మంచి ఛాయాగ్రహణం అందించాడు.

గోవా అందాలు సినిమా అంతటా కాకపోయినా, ఒకటి రెండు సన్నివేశాల్లో తళుక్కుమనేలా చేశాడు. రవితేజ ఎడిటింగ్ కూడా అన్ కన్వెన్షనల్ దారిలో వెళ్ళి, కొత్తదనాన్ని సినిమాకు అందించింది.

దర్శకుడు తరుణ్‌భాస్కర్ అందించిన మాటలు అత్యంత సహజంగా నిత్యం కుర్రాళ్ళు తమ తమ అడ్డాలో కూర్చుని మాట్లాడుకునేలాగే వున్నాయి. కానీ మరీ 'నీ... మ్మ' అని కూడా అనిపించేయడం, సెన్సారు ఓకె చేయడం చూస్తుంటే, సినిమాలో సహ జత్వం ఎక్కడికి వెళ్తోంది అనిపిస్తోంది.

కుర్రాళ్ళంటే ఆవారా గ్యాంగ్‌లే కాదు, తాగుబోతు బాపతే కాదు, ఐఐటీలు, ఐఎఎస్‌లు, ఐపిఎస్ శిఖ రాలు అధిరోహిస్తున్నవాళ్ళు, ర్యాంకులు సాధిస్తున్న వాళ్ళు వున్నారు.

యూత్ అంటే వాళ్ళు కూడా. ఈ సంగతి మన సినిమా జనాలు ఎప్పుడు గుర్తిస్తారో? ఈ తాగుబోతు కుర్రాళ్ళ సినిమాలు ఎప్పుడు ఆపుతారో?

**ప్లస్‌పాయింట్స్...**
అన్ కన్వెన్షన్ చిత్రీకరణ
సహజమైన వ్యవహారాలు

**మైనస్‌పాయింట్స్...**
సరైన స్క్రిప్ట్ లేకపోవడం

**పంచ్‌లైన్**
గజిబిజి నగరం ◆



## ఎంతో ప్రత్యేకం

ఆదినుంచికూడా తాను నటించే సినిమాలు ప్రత్యేకంగా వుండేలా జాగ్రత్త వహించింది అనుష్క శర్మ. అటు గ్లామర్ పాత్రలతో, ఇటు హీరోయిన్ ప్రాధాన్య రోల్స్‌లో మెప్పించడమే కాదు 'పరి' హారర్ చిత్రంలోనూ తనదైన హవా చాటింది.

ఇప్పుడు షారుక్‌ఖాన్‌తో కలిసి 'జీరో'లో తళుక్కుమననున్నది. ఈ సినిమాలో బేబీ హెయిర్ కట్‌తో అనుష్కశర్మ డిఫరెంట్‌గా వుంటుంది. పైగా ఈ సినిమా తనకు చాలా ప్రత్యేకం అంటూ భావోద్వేగంతో చెపుతున్నది కూడా.

"షారుక్‌ఖాన్, కత్రినాకైఫ్, ఆనం ద్‌లు నాపై చూపించిన ప్రేమను ఎప్పటికీ మర్చిపోలేను. ప్రేమ, ఆప్యాయతలున్న మనుషులతో కలిసి పనిచేశా" అంటూ చెమ్మ గిల్లిన కన్నులతో చెప్పింది. ◆

## ఎన్నో ఎమోషన్లు

'**47** రోజులు' తెలుగు సినిమా, ఇంకో తమిళ చిత్రం షూటింగ్‌లను పూర్తిచేసు కుంటున్న పూజా ఝవేరి మరో తెలుగు సినిమాకు సంతకాలు చేసింది.

అల్లరి నరేష్ సరసన చేసే ఈ పాత్ర బోల్డన్ని ఎమోషన్లతో నిండి వుంటుందని చెప్తోంది.

"విభిన్న పాత్రలు చేయాలన్నది నా కోరిక. ఈపాత్ర అటువంటిదే. ఇది లవ్ స్టోరీనే అయినప్పటికీ కామెడీ, యాక్షన్, ఫ్యామిలీ డ్రామావంటివి అనేకం మిళితం అయివుంటాయి. విభిన్నకోణాలు గల ఈ సినిమాలో పనిచేయడం థ్రిల్లింగ్‌గా వుంది" అని ఉత్సాహ పడింది పూజా ఝవేరి. ◆





## ఏమో! ఎలా వుంటుందో

హైదరాబాద్‌లో పుట్టి బెంగళూరులో పెరిగిన నిధి అగర్వాల్ తెలుగులో 'సవ్యసాచి' సినిమాతో తనను ప్రేక్షకులు సాదరంగా స్వాగతించగలరని అంచనాలు వేసుకుంటున్నది.

ముందుగా నిధి హిందీలో 'మున్నామిచాయల్' సినిమాద్వారా బాలీవుడ్‌కు పరిచయం అయింది. ఆపైన 'సవ్యసాచి' అవకాశం వచ్చింది. విశేషం ఏమిటంటే నాగచైతన్యతో కలిసి నటిస్తున్న నిధికి ఈ సినిమా విడుదలకాకముందే అతని తమ్ముడి సరసనా నటించే అవకాశం లభించింది. ఈ రెండు సినిమాలతో తన కెరీర్ మలుపులు ఏ విధంగా వుంటాయో కాలమే చెప్తుందని తెలివిగా పలుకుతుంది. ◆



## ఆరయ్యాయి

కెరీర్‌లో సమ్‌థింగ్ స్పెషల్ అన్నచందాన దూసుకుపోతున్నది సమంత. ఇప్పటికే మూడు చిత్రాలు విడుదలయ్యాయి. 'యు టర్న్' పూర్తిచేసింది. డబ్బింగ్ చెప్పడం కూడా మొదలుపెట్టేసింది.

తమిళంలో ఓ రెండు సినిమాలు పూర్తయ్యాయి. ఇవి ఈ సంవత్సరంలోనే విడుదలవుతాయి. మొత్తం మీద ఆరు సినిమాలు పూర్తిచేసి, ఉత్సాహంగా వుంది. తర్వాత బెటర్ హాఫ్ నాగచైతన్యతో కలిసి కొత్త సినిమా చేయబోతున్నది. లక్కీగాళ్ కదా! ◆





## కళ్ళు, నవ్వు చూసే...

తన కళ్ళు, తన నవ్వు చూసి తనపట్ల నమ్మకంతో పాత్ర ఇచ్చారంటున్నది 'జంబలకిడి పంబ' తార సిద్ధి ఇద్నానీ. "మా అమ్మ గుజరాతీ సినిమాల్లో, హిందీ సీరియల్స్‌లో నటించారు.

చిన్నప్పుడే అమ్మతో కలిసి సెట్స్‌కు వెళ్ళేదాన్ని. గుజరాతీలో ఒక సినిమా చేశా. హాస్యం పండించడం కష్టం. పైగా భాష తెలియనప్పుడు మరీ సమస్య.

అయినా భాషకంటే భావాలు ఎక్కువగా మాట్లాడతాయని నమ్ముతాను. అందుకే తెలుగు తెలియకపోయినా ఇక్కడ పని చేయగలుగుతున్నాను" అని తెలిపింది సిద్ధి ఇద్నానీ. ◆



## కోటి ఆశలు

కొత్త తారలు ఎక్కడనుంచి వచ్చినా, తర్వాతి సంగతి ఎలా వున్నా టాలీవుడ్ తొలుతమాత్రం సాదరంగా, ఘనంగా స్వాగతిస్తుంటుంది. ప్రియాంక జవల్కర్ ఇప్పుడదే దారిలో వుంది. అనంతపూర్‌కు చెందిన ఈ అమ్మాయి ఫ్యాషన్ టెక్నాలజీ కోర్స్ చేసింది. 'ట్యాక్సీవాలా' సినిమాతో టాలీవుడ్‌లో ప్రవేశించింది. బోల్డన్ని ఆశలతో వున్న ప్రియాంక జవల్కర్ ప్రేక్షకుల ఆదరణ దక్కితే చాలంటున్నది.

అంతేకదా- ఎంట్రీ టిక్కెట్ బావుంటే, ఆపైన కొన్ని సినిమాలతోనైనా కెరీర్ బండి నడిపించవచ్చు కదా!

గాంధీజీ భారతదేశానికి అవసరమని త్వరగా మాతృదేశానికి రమ్మని గోఖలే ఆహ్వానించాడు. అంతేకాదు, గాంధీజీ భారత్‌కి వచ్చేలా ఒప్పించాడు కూడా. అయితే గాంధీజీ దక్షిణాఫ్రికాను వీడి రావటం వెంటనే జరగలేదు. గాంధీజీ వస్తే పార్టీ నాయకత్వం ఆయనకు అప్పగించాలన్నది గోఖలే ఆలోచన.

# చివరి రోజుల్లో...



## గోపాలకృష్ణ గోఖలే
(1866-1915)

జాతీయ ఉద్యమంలో గాంధీజీకి ముందు తరం నేత గోపాలకృష్ణ గోఖలే. ఉద్యమానికి ఒక రూపు ఇచ్చినవాడు. కాంగ్రెస్ పార్టీని మితవాద పార్టీగా నడపాలని వాదించినవాడు. పాలకులకు సహకరిస్తూనే మనకు రావాల్సినవి రాబట్టుకోవటం చెయ్యాలన్న వాదన చేసినవాడు గోఖలే.

గోపాలకృష్ణ గోఖలే పుట్టింది మహారాష్ట్రలోని రత్నగిరి జిల్లాలోని ఒక గ్రామంలో పుట్టాడు. తండ్రి వ్యవసాయం చేసేవాడు. అది కలిసిరాక గుమాస్తా ఉద్యోగంలో చేరాడు.

భవిష్యత్తులో ఆంగ్లభాష అవసరం అవుతుందని కొడుకును ఇంగ్లీషు చదువులు చదివించాడు.

1866 మే 9న పుట్టిన గోఖలే ప్రతిభావంతుడు. ముంబయి విశ్వవిద్యాలయంనుండి ఇంగ్లీషు, పాలిటిక్స్‌లో డిగ్రీ తీసుకున్నాడు. పూనాలోని పెర్గూసన్ కాలేజీలో ఆచార్యుడిగా చేరాడు. ఆ తర్వాత ఆ కాలేజీకి ప్రిన్సిపాల్ అయ్యాడు.

నాటి సామాజిక సంస్కర్త మహాదేవ్ గోవింద్ రనడేతో కలిసి పనిచేస్తూ పూనా సార్వజనిక సభ కార్యదర్శి అయ్యాడు. క్రమంగా రనడేతో కలిసి రాజకీయంవైపు అడుగులు వేశాడు.

1885లో కాంగ్రెస్ ఆవిర్భవించింది. 1889లో గోఖలే కాంగ్రెస్ పార్టీలో సభ్యత్వం తీసుకున్నాడు. అప్పటికే మరో మరాఠీ వీరుడు బాలగంగాధర్ తిలక్ కాంగ్రెస్‌లో గొప్ప నాయకుడిగా ఉన్నాడు.

గోఖలేకి, తిలక్‌కి పోరాట విధానపరంగా పడేది కాదు. తిలక్‌ది అతివాదం, గోఖలేది మితవాదం. శాంతిమంత్రంతో సాధించేదేమీలేదన్న తిలక్, శాంతియుత ఉద్యమంద్వారానే స్వాతంత్ర్యం వస్తుందన్న గోఖలేకి చుక్కెదురు.

1905లో గోఖలే కాంగ్రెస్ అధ్యక్షుడయ్యాడు. అంతకుముందు గోఖలే, తిలక్‌లిద్దరూ కార్యదర్శులు. ఇద్దరూ చెరోవైపు సంస్థను, ఉద్యమాన్ని నడిపించేవారు. కాంగ్రెస్‌కి వారిద్దరి అతివాద, మితవాదాలలో ఏదో ఒకటి ఎంచుకోవాల్సివచ్చింది.

1905లో మెజారిటీ మితవాదంవైపు మొగ్గుచూపటంతో గోఖలే పార్టీ అధ్యక్షుడయ్యాడు. దీంతో కాంగ్రెస్ పార్టీ రెండుగా చీలిపోయింది.

గోఖలే విద్యద్వారా ప్రజలలో చైతన్యం తేగలమనేవాడు. ప్రజలను చైతన్యం చేసేందుకు విద్యావ్యాప్తి చెయ్యాలన్నాడు. అందుకోసం బ్రిటీష్ విద్యావ్యాప్తిని గోఖలే సమర్థించాడు.

నాటినుండి ఆయన దేశమంతా పర్యటించాడు. ఇంగ్లండ్ వెళ్ళివచ్చాడు. బెంగాల్ విభజనను తీవ్రంగా వ్యతిరేకించాడు గోఖలే. 'వందేమాతరం' నినాదంతో ప్రజలందరూ దాదాపుగా తిరుగుబాటు స్థాయికి చేరినపుడు తన మితవాద ధోరణిని సవరించుకోక తప్పదేమోనన్న అభిప్రాయానికొచ్చాడు.

"ప్రజల శ్రేయస్సుకోరి ప్రభుత్వంతో సహకరించాలన్న తన ఆలోచనకు స్వస్తి పలుకుతా" అని హెచ్చరించాడు. వంగ దేశంలో కట్టలు తెంచుకుంటున్న ప్రజాగ్రహం నిబంధనలు అతిక్రమించి ఉప్పెనలా రావటం సహజమేనన్నారు. వీలైనంతవరకు హింసాకాండవైపు మొగ్గకూడదన్నదే గోఖలే ఆలోచన.

1910లో ఆయన సెంట్రల్ లెజిస్లేటివ్ కౌన్సిల్‌కి ఎన్నికయ్యాడు. 1912లో గోఖలే దక్షిణాఫ్రికా వెళ్ళాడు. గోఖలే చేసిన టౌన్‌హాల్ ప్రసంగం గాంధీజీని ఆకట్టుకుంది. గోఖలేని తన ఆశ్రమానికి ఆహ్వానించి చర్చలు జరిపాడు. నాటికే గాంధీజీ సత్యాగ్రహం ఉద్యమం చేస్తున్నాడు దక్షిణాఫ్రికాలో.

అటువంటి గాంధీజీ భారతదేశానికి అవసరమని త్వరగా మాతృదేశానికి రమ్మని గోఖలే ఆహ్వానించాడు. అంతేకాదు, గాంధీజీ భారత్‌కి వచ్చేలా ఒప్పించాడు కూడా. అయితే గాంధీజీ దక్షిణాఫ్రికాను వీడిరావటం వెంటనే జరగలేదు. గాంధీజీ వస్తే పార్టీ నాయకత్వం ఆయనకు అప్పగించాలన్నది గోఖలే ఆలోచన.

అందుకోసం గాంధీజీతో ఉత్తరాల ద్వారా సంప్రదింపులు జరుపుతూనేవున్నాడు. గోఖలే ప్రజా జీవితంలోకి రావాలన్న నిర్ణయం తీసుకున్నతరువాత అవిశ్రాంతంగా దేశమంతా తిరిగాడు.

1905లో కాంగ్రెస్ అధ్యక్షుడి హోదాలో మరింత బిజీ అయ్యాడు. మరోవైపు 'సర్వెంట్ ఆఫ్ ఇండియా సొసైటీ' ప్రారంభించాడు. ప్రజలకు హక్కుల గురించే కాదు, బాధ్యతల గురించి కూడా తెలియచెప్పాలన్నది గోఖలే మాట.

అందుకే ప్రజలందరూ సేవకులు. తమ బాధ్యతలను తాము సక్రమంగా నిర్వహిస్తుంటే, ధర్మబద్ధంగా వ్యవహరిస్తుంటే సమాజంలో ఎటువంటి ఇబ్బందులూ తలెత్తవన్నది గోఖలే మాట.

తాను వెళ్ళినచోటల్లా అదే సందేశం. ఆ సందేశం ఇవ్వటంకోసమే దేశ విదేశాలు తిరిగాడు. నిరంతరం తిరగటమే. ఆ రోజు ఉన్న రవాణా సౌకర్యాలు పరిమితం. రహదారులు సరిగా లేవు. అయినా అవన్నీ లెక్కచేయక తిరిగేవాడు.

గోపాలకృష్ణ గోఖలేకి ఆస్మా సమస్య ఉండేది. వివిధ ప్రదేశాలలోని వాతావరణం, దుమ్మూ, ధూళి ఆయన ఆస్మా సమస్యను మరింత జటిలంచేసింది. అయినా దానిని లెక్కచేయక వెళుతుండేవాడు.

ఆస్మాకి తోడు మధుమేహం వచ్చింది. ఆ షుగర్ జబ్బును సరిగా గుర్తించలేదో లేక గుర్తించినా లెక్కచేయలేదో కాని బాగా పెరిగిపోయి సమస్యలు పెరిగాయి. అయినా తన వ్యక్తిత్వంతో కూడిన పోరాటం వదల్లేదు. మహమ్మదాలీ జిన్నా కూడా గోఖలేకి అభిమాని అయ్యాడు. అప్పటికే దేశంలో పలువురు విద్యావంతులు ఉన్నారు.

వీరికితోడు గాంధీజీ వచ్చిచేరతాడు. ఇక వారి చేతిలో పెట్టి తాను విశ్రాంతి తీసుకోవచ్చు అనుకున్నాడు. సి.ఎఫ్. ఆండ్రూస్ ద్వారా గాంధీజీకి పంపిన సందేశానికి అంగీకరించి గాంధీజీ దక్షిణాఫ్రికా వదిలి, భారత్ వచ్చాడు.

గోఖలే శిష్యుడిగా పనిచేయాలనుకున్నాడు. కాని తన ప్రియ శిష్యుడి పాత్రను చూడకుండానే గాంధీజీ కాంగ్రెస్‌లోకి చేరి పని మొదలుపెట్టకముందే ఫిబ్రవరి 19, 1915న గోపాలకృష్ణ గోఖలే కన్నుమూశాడు. అప్పటికి ఆయన వయసు నలభై ఎనిమిది సంవత్సరాలు మాత్రమే.

# ఈ శీర్షిక మీదే

ఉత్తమ ప్రశ్నకు ₹500
ప్రతి ప్రశ్నకు ₹300 బహుమతి

## ఉత్తమ ప్రశ్న-సమాధానం

కె.జ్యోతి, సికింద్రాబాద్
**రోగి?**
'రో'గంతో 'గి'లగిలలాడేవాడు.

వై.ముత్యాలరావు, రాయకుదురు
**మేధావులకి అర్థం కానివి?**
చిన్నచిన్న విషయాలు.

ఆర్.ప్రశాంతి, విజయనగరం
**ఆపద ఎదురైతే?**
ఆ... పద అనాలి.

కె.వి.ఎస్.ఎస్.ఎల్.ఎన్.నగేష్, విశాఖపట్నం
**'కా'య'కష్టంచేసే రైతుకు మిగిలేవి?**
తిండిగింజలు.

జి.భారతి, నెల్లూరు
**కోడి ముందా! గుడ్డు ముందా?**
గుడ్డు వెనకొస్తుంది కోడే ముందు.

ఎస్.ఎస్.చంద్రబోస్, విశాఖపట్నం
**'ఆడియో' ఫంక్షన్‌లెందుకు?**
ఆడే ఫంక్షన్‌లు ఎలాగూ ఉండవు కనుక.

పి.స్వర్ణలత, విశాఖపట్నం
**'పెద్దలమాట చద్దిమూట'. అయితే పిల్లల మాట?**
పిజ్జా, బర్గర్.

కె.ఉమాదేవి, విశాఖపట్నం
**'ఏకత్వంలో భిన్నత్వం' అంటే?**
హస్తం.

సిహెచ్.నాగేశ్వరరావు, కాగాం
**మీ ఆరోగ్యం మీ చేతుల్లోనే! అంటారు ఎందుకు?**
'చేతి'తో తినే తిండినిబట్టే 'మన ఆరోగ్యం' వుంటుందని.

ఎ.అశోక్‌కుమార్, హైదరాబాద్
**మీడియా, కామెంట్ ప్లీజ్?**
ముఖ్యమైన విషయాన్ని మూడు సార్లు; పనికిరాని విషయాన్ని పదిసార్లు చూపించేది.

కె.ఎస్.శ్యామ్‌ప్రసాద్, విశాఖపట్నం
**మగాడిని మత్తెక్కించేవి?**
'బ్రా'ందీ.

టి.వి.రామకృష్ణ, కొత్తపేట
**కొడితే 'కయ్'మనేదెవరు?**
గోలీ సోడా.

పి.యోబు, ముదునూరు
**భలే కామెడీ మేన్?**
"గొడ్డలి ఒకసారి ఇవ్వ'మంటే "ఏం గోటితో పనవ్వలేదా?" అనేవాడు.

పి.వి.రమణకుమార్, చిలకలూరిపేట
**ఎవ్వరూ చేయలేని పని?**
ఒకే అగ్గిపుల్లను రెండుసార్లు వెలిగించటం.

ఎస్.ఎస్.చంద్రబోస్, విశాఖపట్నం
**'కుర్చీ' అందరికీ ఆదర్శమెలా?**
తన కాళ్ళమీద తాను నిలబడుతూ ఎవర్నైనా కూర్చోబెట్టుకునేది.

# B హ్యాపీ

"ధర్మంచెయ్యండి బాబయ్యా"
"చిల్లర లేదు నా దగ్గర... అన్నీ వందలే వున్నాయి" "నా దగ్గర చిల్లరుంది సార్" అన్నాడు బిచ్చగాడు.
"మరి ఇంకేం...ఆ చిల్లర వాడుకో" అంటూవెళ్ళిపోయాడు సాంబశివరావు.

ఒక ఆసుపత్రిలో రోగం తగ్గలేదని మరో ఆసుపత్రికి వెళ్ళిన భర్త వెంటనే వెనక్కి రావటం చూసి 'ఏమైంద'ని అడిగితే "ఇక్కడ అదే డాక్టర్ వచ్చి కూర్చున్నాడు. నాకేం తెలుసు డాక్టర్లు పొద్దున ఒకచోట సాయంకాలం పని చేస్తారని" అంటూ వాపోయాడు.

ఆఫీసుకు లేటుగా వచ్చిన శంకరాన్ని కారణం చెప్పమని నిలదీశాడు మేనేజర్. "నిద్ర ఆలస్యంగా లేచాను సార్... అన్నాడు శంకరావు.
"ఏమిటి! నువ్వు ఇంటి దగ్గర కూడా నిద్రపోతున్నావా!" అంటూ ఆశ్చర్యపోయాడు మేనేజర్.

"ఒకటికి ఒకటి కలిపితే మూడవ్వాలంటే ఏంచేయాలి?" అనే ప్రశ్న వేశాడు ఒక ఇంటర్వ్యూలో ఆఫీసర్.అంతే కాదు తన గొప్ప ప్రశ్నకు ఎవరూ సమాధానం చెప్పలేరని మిగిలిన బోర్డు మెంబర్స్ దగ్గర గొప్పగా చెప్పుకున్నాడు.
కాని ఇంటర్వ్యూకి వచ్చిన అమ్మాయిలు చాలామంది మాత్రం 'పెళ్ళి చేసుకోవాలి' అని కరెక్ట్ సమాధానం చెప్పారు.

"ఫోన్ రింగ్ అయితే భయమేస్తుందండీ" అంటూ సైకియాట్రిస్ట్ దగ్గరికి వెళ్ళాడు చిన్నారావు.
"దీన్ని ఫోన్ ఫోబియా అంటారు. నయంచేస్తా" అంటూ పదివేలు తీసుకుని ట్రీట్‌మెంట్ ఇచ్చి పంపించాడు సైకియాట్రిస్ట్ విశాల్.
పదిరోజుల తర్వాత పరీక్షిద్దామని ఫోన్ చేశాడు డా॥ విశాల్ ఎలా వుందని.
"భలే వుంది సార్...ఇప్పుడు ఫోన్ రింగ్ అవకున్నా హాయిగా ఫోన్ తీసుకుని మాట్లాడగలుగుతున్నాను అంటూ ఆనందపడ్డాడు" చిన్నారావు.

## ఈ కార్టూన్ మీదే




లక్ష్యం ఎప్పుడూ ఉన్నతంగా ఉండాలి. దానికై మనస్ఫూర్తిగా శ్రమించాలి.